


అని సూటిగా చెబితే సరిదిద్దుకోనూ?... అనుచితంగా ప్రవర్తించి, అనవసరంగా మనసుకు నొప్పి కలిగించటం నాకు మాత్రం సరదావా?'

"ఏం? అలా వున్నారు? ... తల నొప్పిగా వుందా?"

"తలా లేదు, నొప్పీ లేదు. నన్ను వేధించక వెళ్లు. నా కెప్పుడు మొహం కడుక్కోవాలని బుద్ధిపుడితే అప్పుడు కడుక్కుంటాను."

మళ్ళీ యీసారికూడా అలాగే చీదరించుకున్నాడు శ్రీనివాస్.

'నిన్న ప్రొద్దున్న, గదిలోకి బ్రష్షూ, పేస్టూ, టవెలూ పట్టుకెళ్ళి చేతి కందివ్వబోతూంటే, తలుపురెక్కల్ని దగ్గరగా జారేసి, చటుక్కున నా రెక్కపట్టుకుని, తనమీదికి లాక్కున్నవారేనా వీరూ?... లాక్కునీ-నిన్నిలా గాఢాలింగనంలో యిముడ్చుకుంటూంటే భాషకూ, భావానికీ అతీతమైన అర్థంకాని హాయి ఏదో నాలో నరనరానా ఆవహించి, ఆవేశంతో నన్ను ఓ వెర్రివాణ్ణి చేసిపారేస్తోంది అరూ?-అని వాపోయిన ఆ వెర్రివాడు వీరేనా?...ఇముడ్చుకొని, పెదవులమీద పెదవులు పెట్టి, తల వెనుక చేతితో పూనికగా అదివి(పట్టి, -నీ అధరామృతం పోసి, నాకు అమరత్వాన్ని ప్రసాదించు అరూ!-అని ప్రాధేయపడుతూ ఆవేశంతో చుంబించిన ఆయనేనా కసిరికొట్టి యింత కాఠిన్యాన్ని గుమ్మ

రిస్తున్నదీ!? ... భగవాన్! ... మను ష్యుల్ని ఎంతలో ఎలా మార్చి పారే స్తావ్?'

"నే నేమైనా తప్పు చేస్తే మన్నిం చండి! మీకు నొప్పి కలిగించేలా ప్రవ ర్తిస్తే క్షమించండి! తెలిసి నే నేదీ చెయ్య లేదు." అరుంధతి వదనంలో దైన్యం గూడుకట్టుకుంది.

"సరే! ... నువ్విక్కణ్ణుంచి వెళ్ళ దల్చుకోకపోతే పోనీ, నేనే వెళ్ళి పోతాను."

మొహం చిట్లించుకుంటూ, చటు క్కున కుర్చీలోంచి లేచాడు శ్రీనివాస్.

ఇహ మారు మాట్లాడి, వాదన పెంచు కోవటం ఇష్టంలేక వెంటనే తలవాల్చు కుని, అక్కణ్ణుంచి తరలి వెళ్ళిపోయింది అరుంధతి.

'ఆయన ఇంత కఠినంగా ప్రవర్తించ టానికి నే నేదో తప్పు చేసే వుంటాను. లేకపోతే, ఆయ నెందుకు హఠాత్తుగా అంత అలా మారిపోతారు?'

గతరాత్రీ అంతకు ముందురాత్రీ గదిలో తను భర్తతో గడిపిన విధాన్నీ, వచ్చిన ప్రస్తావనల్నీ, చెప్పిన మాటల్నీ అన్నింటినీ ఓసారి నెమరు వేసుకుంది అరుంధతి.

'చెప్పినవల్లా విన్నాను. చెయ్యమన్న ట్లల్లా చేశాను. అడిగినవన్నీ చెప్పాను. అంతరాత్మను అద్దంలా చూపించాను. అంతర్యాన్ని విప్పి చాటాను. ఇంక ఎందులో లోపం చేశాను?...ఎందుకింత ఆగ్రహం నామీద ఆయనకు?'

అరుంధతి కెక్కడా అంతుపట్టలేదు. ఫలానాచోట ఫలానావిధంగా తప్పుగా ప్రవర్తించాను–అది కానిపని; ఇది కూడని మాట! అని ఏ ఒక్కదానిమీద వేలుపెట్టి చూపించుకోలేకపోయింది.

"ఏఁవోఁయ్. శ్రీనివాస్!...ఒంట్లో బాగులేదట! ... తలో్నొప్పి, వొళ్ళు నొప్పులూ వున్నాయా? డాక్టర్ కోసం పంపించమంటా వేవిఁటి?" అరుంధతి అలా వెళ్ళగానే, భార్య పురమాయింపు మీద రాజశేఖరంగారు వచ్చి పరామర్శ.

"అబ్బెబ్బే!..." పేలవంగా చిన్న నవ్వు నవ్వాడు శ్రీనివాస్. "ఎవరు చెప్పారు మీకు?... డాక్టరూ వొద్దు. ఎవరూ వొద్దు."

"అయితే...లే...మరి. వేన్నీళ్ళూ అవీ సిద్ధంగా వున్నాయ్. మొహం కడు క్కుని వేడివేడి నీళ్ళ స్నానం చేస్తే ఆ బద్ధకంకాస్తా పోతుంది. లే ... బాబూ! ... లే!"

వాత్సల్యం వుట్టిపడుతూన్న స్వరంతో, అనునయంగా భుజం తట్టుతూ అన్నారు రాజశేఖరంగారు.

ఆయనమాటతోసెయ్యలేక, లేచివెళ్ళి మొహం కడుక్కుని వచ్చాడు శ్రీనివాస్.

ట్రేలో స్టెయిన్‌లెస్ స్టీల్ పళ్ళెంలో ఫలహారం, గాజుగ్లాసుతో మంచినీళ్లూ, ఓకప్పూ సాసర్లో కాఫీ పట్టుకొచ్చి,

యీజీచెయిరు ముందున్న టీపాయ్‌మీద పెట్టింది అరుంధతి.

"పోనీ ... ఓ సారి డాక్టరుకు చూపించుకుంటే మంచిదికాదూ? ..." క్షణంఆగి మళ్ళీ అంది అరుంధతి. "పిలిపించమంటారా?" అరుంధతి స్వరంలో ఆప్యాయత. ప్రాధేయత పుట్టిపడ్డాయ్.

"అక్కర్లేదు. డాక్టరూ వొద్దు. యీ టిఫినూ వొద్దు. పట్టుకుపో."

అరుంధతి మొహంవైపు తలెత్తి చూడకుండానే అన్నాడు శ్రీనివాస్. అతని కంఠంలో అపోరకమైన కర్కశత్వం ధ్వనించింది.

'ఏ నోటితో నిన్న 'రా, అరూ!... ఇద్దరం కలిసి తిందాం. నేను సగంకొరికి నీనోటి కందిస్తాను. నువ్వు సగంకొరికి నానోటి కందించు. నువ్వు నాలో అర్ధభాగానివి! నేను నీలో అర్ధభాగాన్ని! ఈ జీవితంలో మనం ఏం చేసినా, ఏం పొందినా, యిద్దరం కలిసి చెయ్యాలి, యిర్వురం సమానంగా పొందాలి!' అంటూ ఆప్యాయంగా ఆదరంతో ఆహ్వానించిన ఆనోటితోనే 'పో!' అని కసిరి కొడుతున్నారా? నిన్నటి ఆయనకూ, నేటి మీకూ ఎంతభేదం!?'

"ఫలహారం చెయ్యకపోతే పోనీ, కాఫీ అయినా తాగండి!" అరుంధతి వేడుకోలు.

ససేమిరా తీసుకోనన్నాడు శ్రీనివాస్.

తన తరపువాళ్ళూ, అరుంధతి




తరపువాళ్లూ వచ్చి పదిసార్లు చెప్పగా గుక్కెడు కాఫీ ఎలాగో గుటకేశాడు.

శ్రీనివాస్ ఆ గుటక వేసి గంట యింది. ఆ గంటా ఎంత సేపటికి అయిందో అరుంధతికి తెలియదు.

ఎన్నిసార్లు ఆ గదిగుమ్మందగ్గరకు వచ్చి వెళ్ళిపోయిందో లెక్కే లేదు. ఎప్పుడుచూసినా ఎవరో ఒకరు ఆ దారిన మసుల్తూనే వున్నారు. 'ఛీ!...గర్భాదానంగది యిలాంటి సత్రం లాంటి చోట వుండకూడదు. స్వేచ్ఛాలేదు, దిబ్బాలేదు!' అని ఓ సారి విసుక్కుంది. 'ఒంటి స్తంభం మేడమీద ఒకే ఒక గది కట్టించి అందులో ఏర్పాటు చెయ్యాలి'

వరూ చూస్తుండగా
నికి వల్లమాలిన సిగ్గు
'నూ వెళ్తాంటే అంతా

అరుంధతీ ... ఇంత అన్యాయం కూడదే!...యిరవై ఏళ్ళనుంచీ యీ మా మందలో పుట్టి, పెరిగి, మసిలి, యిప్పుడు యింకా రెండు రాత్రులైనా అవ్వలేదు, అప్పుడే అంతగా ఆ మందలో కలిసిపోతే ఎలాగే? మీ ఆయన ఎక్కడికీ పోడులే! తపస్సు చేసుకుంటూ ఆ గదిలో కూర్చుంటాడు!...అయినా, ఆలూ మగల అనుబంధాల లాంటివి కాబోసులే." అని పినతల్లి కూతురు పద్మ ఎగతాళి పట్టించటం అయింది.

"'అరుంధతీ!' అంటూ వేవిగేటే యింకనూ?...వాళ్ళాయన దాని పేరును సగానికి తెగ్గోసి, సింపుల్‌గా 'అరూ!' 'అలూ!' అని పిలుస్తోంటేనూ!... నిన్న సాయంత్రం వినలేదుటే!" అని యింకొకర్తి. ఇలా అందరూ తలో మాటా అన్నారప్పుడే. అందువల్ల అరుంధతికి ధైర్యం చాలకపోయింది. కాని, ఆయన వైఖరి ఎందు కింత హఠాత్తుగా యిలా మారిపోయిందో తెలుసుకోవాలనే ఆరాటం ఆమెను లోలోపల పీక్కుతింటూనే వుంది. "ఒసే అమ్మాయ్! ప్రొద్దున్న ఆ అబ్బాయ్ ఫలహారంకూడా చెయ్యలేదు. కాఫీకూడా కప్పులో సగానికి పైగా వదిలేశాడు. ఇహ నువ్వు సరే సరి. పచ్చి మంచినీళ్ళుకూడా ముట్టుకోలేదు...

"అతనికీ నీకూ వడ్డించేస్తాను. మిగతావా ళ్ళంతా తర్వాత తింటారు. వస్తాడేమో వెళ్ళి పిల్చుకురావే!" అని తల్లి ఆదేశించగానే గదిలోకి వెళ్ళటానికి కాస్త చొరవ వచ్చింది అరుంధతికి.

"ఫలహారంకూడా చెయ్యలేదు. ముందు మన కిద్దరికీ వడ్డించేస్తారుట, రండి!"

గదిలో మంచం మీద వెల్లికిలా పడుకుని, నుదురు కడ్డంగా చేతులు పెట్టుకుని ఏదో దీర్ఘాలోచనా ముద్రలో వున్న శ్రీనివాస్ సరసన కూర్చుంటూ అంది అరుంధతి.

"నేను భోం చెయ్యను; నా కాకల్లేదు. కావలిస్తే ను వ్వెళ్ళి భోం చెయ్యొచ్చు. నా కభ్యంతరం లేదు."

చటుక్కున యిట్నుంచి అటు దొర్లాడు శ్రీనివాస్.

"పోనీ లెండి!...మీరు చెయ్యకపోతే, నేనూ చెయ్యను. మీతోపాటే నేనూ పస్తుండి, మీ కాళ్ళదగ్గరే పడివుంటా!"

తన మెళ్ళో తాళిబొట్టు కట్టినవాడికే తన సర్వస్వాన్నీ అర్పించి, ప్రాణాలను సైతం ధారవోసే భారత నారీత్వపు సహజస్వభావసిద్ధమైన త్యాగ సంపదంతా అరుంధతి కంపిస్తున్న గొంతులో ధ్వనించింది. ఆమె బెదిరింపులో ఆప్యాయత్తో కూడుకున్న, నిగూఢంగావున్న ఓ

అభ్యర్థన ! ఆ అభ్యర్థనలో బండరాతిని సైతం కరిగించివేసే ఆర్ద్రత ! ఆ ఆర్ద్రతలో గుండెను పిండే అమాయకత్వం! ఆ అమాయకత్వంలో ఆగ్రహం మాని, అనుగ్రహించమని కాళ్ళా వేళ్ళా పడుతూన్న ప్రాధేయత !!

కాని, శ్రీనివాస్ చలించలేదు.

"అయితే, సత్యాగ్రహాలు చెయ్యటం, నిరసనవ్రతాలు పట్టటంకూడా వచ్చునన్న మాట !"

అరుంధతి హృదయంలో ములుకుల్లా గుచ్చుకున్నాయ్ శ్రీనివాస్ మాటలు.

దాంపత్య జీవనదశ పొద్దు యింకా పొడవనేనా పొడవలేదు ! అప్పుడే నా కిన్ని అగ్నిపరీక్షలా భగవాన్! నేనేం పాపం చేశాను? ఆ చేసిననేరం ఏదో నాకు సూటిగా స్ఫురింపచెయ్ భగవాన్!.. ఆయన కాళ్ళమీదపడి క్షమార్పణ వేడుకుంటాను. న న్నెందు కిలా రంపపుకోత పెడతావ్? నా కెందుకింత హృదయక్షోభ నిస్తావ్?...

"'రా, అరూ! ఇద్దరం కలిసితిందాం. నేను సగంకొరికి నీ నోటి కందిస్తాను, నువ్వు సగంకొరికి నా నోటి కందించు. నువ్వు నాలో అర్ధభాగానివి ! నేను నీలో అర్ధభాగాన్ని !! ఈ జీవితంలో మనం ఏంచేసినా, ఏం పొందినా యిద్దరం కలిపి చెయ్యాలి. ఇద్దరం సమానంగా పొందాలి ! రా !... అదూఁ!' అని నిన్న నేకదా మీరన్నారూ. అప్పుడే మరిచిపోయారా?..."

బిత్తరపోయ్. క్షణంపాటు మౌనంగా వుండిపోయాడు శ్రీనివాస్.

"అయితే యింకనేం? ... అన్ని విద్యలతోపాటూ సమయస్ఫూర్తీ, మాట చాతుర్యం కూడా వున్నాయన్నమాట !" దహించుకు పోతూన్న అరుంధతి హృదయంలో ఆజ్యం పోసినట్లయింది.

"సూటీపోటీ మాటలతో ఎందుకు న న్నిలా చిత్రవధ చేస్తారు? మనసులో వున్న దేదో సూటిగా చెప్పండి ! ఏదైనా అపరాధం చేస్తే వేలెట్టిచూపండి ! మళ్ళీ ఆ అపరాధం చేస్తే మీ కిష్టంవచ్చిన శిక్ష విధించండి !''

శ్రీనివాస్ గుండెలమీదికి ఒరిగి అతని మొహాన్ని తనవైపుకి తిప్పుకోబోయింది అరుంధతి.

''వేధించక, నన్ను ఏకాంతంగా విడిచిపెట్టు; నా వొంట్లో బాగులేదు,"

తృణీకార భావంతో అరుంధతి చేతుల్ని విదిలించి పారేశాడు శ్రీనివాస్.

ప్రొద్దున్న గుక్కెడు కాఫీ గుటక వేసినట్లే, మధ్యాహ్నం కంచదగ్గర కూర్చుని ఎంగిలిపడక తప్పలేదు శ్రీనివాస్‌కు.

"కప్పను మింగిన పాములా గర్భాదాన పెళ్ళికొడుకు యీపూట అలా మందకొడిగా వున్నాడేఁవేఁ?"

"అరుంధతిమొగుడు యీవేళ లేచినప్పటినుంచీ. ధుమధుమ లాడుతూ అలా వున్నాడేఁవఁట్రా?"

"ఏం వుందీ? ... కొత్త కదూ! అత న్నేదో చెయ్యమని వుంటుంది. ఆ కోపం అంతా యిలా అలిగి తీర్చుకుంటున్నాడు! అంతకంటే ఏం వుందీ?... ఇవన్నీ మనం అనుభవించేరగనివా!?"

"మూడుముళ్లూ వేయించటం, కొంగు

ముడివేసి వదిలెయ్యటం మనవొంతు. ఇలాంటి వంటే మనం బయట వుండి ఎన్నయినా చెయ్యగలం. చేయించగలం. ఇహ, ఒకరి హృదయాల్లోకి ఒకరు ప్రవేశించి, వాళ్ళవాళ్ళ అంతరాత్మలనూ, ఆంతర్యాలనూ విప్పి చూసుకుని, పర స్పరం అర్ధం చేసుకుని, దాంపత్య జీవి తాన్ని హాయిగా గడపటం వాళ్ళవొంతు."

"బావుందోయ్!...ఇది మనసులతో పని! మాటలతో కాదు. పాలలో నీళ్ళు కలిసిపోయినట్లు. బొయ్యగానే కలిసిపోవ టానికి! ముందూ, మునుపూ ఎరుగని కొత్త అనుభవంతో కూడుకున్న వినూత్న అనుబంధం! కొంచెము పాత పడితే అన్నీవాటంతటవే సర్దుకుపోతయ్. అప్పుడు పుట్టింటికి వెళ్ళమంటే ఆవిడ వెళ్ళదు! పెళ్ళాన్ని విడిచిపెట్టి వుండ మంటే వీ డుండడు!...ఇందులో నీకు తెలీం దేవుంది చెప్పు?"

"కొత్త యంత్రాన్ని పనిలో పెడితే, పెట్టగానే మామూలుగా తిరిగేస్తుంది టోయ్, పిచ్చివాడా? 'రన్-యిన్' పీరి యడ్ అని మోటారు శకటాలకు ఎలా గుందో, అలాగే కొత్త దంపతులకు కూడా 'ఫిక్సిన్' పీరియడ్ అని ఒహ టుంది. అందులో ఓసారి స్థిరపడి పోయారూ అంటే...యిహ చూసుకోనా రాజా! ... వొద్దు బాబోయ్ వొద్దని పైనుంచి దేశనాయకులు ఒకప్రక్క నుంచి నెత్తీ నోరూ మొత్తుకుంటున్నా సరే, ఏడాది కొకళ్ళు చొప్పున సృష్టికి ప్రతిసృష్టి చేసుకుంటూ పోతారు."

ఇలా పిన్నా పెద్దా, ఆడా మగా ఎవరికి తోచిన వ్యాఖ్యానాలు వాళ్లు చేస్తున్నారు.

పినతల్లి, అరుధంతికేదో ఏకాంతంగా కూర్చోబెట్టి నూరిపోస్తోంది.

"లేదు పిన్నీ!...ఆయన చెప్పినట్లే చేస్తున్నాను. ఈ మంగళసూత్రం పట్టు కుని చెబుతున్నాను...నమ్మి పిన్నీ!" అరుంధతి మధ్య మధ్య వెక్కి వెక్కి ఏడుస్తోంది.

"ఒరేయ్ శీనూ!...పాపం!...ఇంకా చిన్న పిల్ల! ... తెలీకపోతే, నీ కేం కావాలో చెప్పి చేయించుకోవాలి గాని, అలా హడిలి చావగొట్టేస్తే ఏం చేస్తుం దిరా?...ప్రొద్దుట్నుంచీ ఆ పిల్ల మొహ ములో నెత్తురుచుక్క లేదు...కొంచెం ఓర్పుతో వ్యవహరించాలి మరి!.." అటు పెద్ద మేనమామ శ్రీనివాస్‌కి హితబోధ.

ఆవేళ రాత్రి పక్క అరుగుమీద వేయించమని పట్టుపట్టాడు శ్రీనివాస్.

అవసరం అయితే, ఆనవాయతీలేదని బొంకమనీ, వెంట అరుంధతిని గృహ ప్రవేశానికి తీసుకురావొద్దనీ మేనమామ గొంతుమీద కూర్చుని తండ్రికి చెప్పిం చాడు మన్నాడు.

ఎటువైపు చూసినా ఆందోళనా పూరితమైన వాతావరణం!

ఏ పక్షంవాళ్ళని పలకరించిచూసినా వ్యక్తంకాని ఏదో బాధ!

ఎవరి మొహాల్లో చూసినా అర్ధం కాని ఏదో భయం!



మంచంమీద బోర్లా పడుకుని. దిండులో తల దూర్చుకుని అరుంధతి ఏడుపు.

వంటింట్లో తల్లి శోకాలు.

పినతల్లి ఓదార్పులు.

వీధిగదిలో...చేతుల్లో తల పట్టుకుని తండ్రి దిగులు.

ద్వివేగశీలి కాలం!

కొంతమంది కది పందెపుగుర్రంలా పరుగెడుతుంది.

మరికొంతమందికి మందకొడిగా తాబేలునడక నడుస్తుంది.

ఆర్నెల్లకాలం అరుంధతివిషయంలో ఆరు బరువుయుగాలుగా దేకింది!

"బావగారూ!... నన్నేం చెయ్యమంటారు చెప్పండి!...'ఇలాంటిపనులు మన యింటా వంటా లేవురా! మన కుటుంబగౌరవానికి మచ్చ తేకురా!... ఆ అమాయకురాలి జీవితాన్ని నాశనం చెయ్యకురా!... నీ కేం, మగాడివి! పళ్ళూడిపోయినా, కళ్ళుచూపు తగ్గిపోయినా ఎవరో ఒకరు పిల్లను యివ్వటానికి సిద్ధపడతారు. కాని, అది న్యాయం కాదు. నీకూ పెళ్ళికావలసిన చెల్లెళ్ళు ఉన్నారు. ఇది లోకం హర్షించని పని; ఆలోచించుకో!' అని శతవిధాల వాడికి నూరిపోశాను; ససేమిరా నా కొద్దంటాడు. నే నేంచెయ్యను, చెప్పండీ!... ఈ విషయంలో నిజానికి మీ కంటే నేనే ఎక్కువ బాధ పడుతున్నాను. మీ అమ్మాయ్ ఓటీ, మాఅమ్మాయ్ ఓటీ కాదు నాకు." చెప్పలేక చెప్పలేక చెప్పాడు వియ్యంకుడు రంగధామం.

రాజశేఖరంగారి మొహంలో కత్తి వాటుకికూడా నెత్తురుచుక్క లేదు!

ఎన్నో ఆశలు పెట్టుకుని వచ్చాను. వియ్యంకుడికి ఎలాగైనా నచ్చచెప్పి కూతురి కాపరాన్ని చక్కచెయ్యాలని. కాని, ఆ ఆశలన్నీ మంచుగడ్డలా కరిగి నీరైపోయినయ్.

"సరే!...ఇంక మీరలా అంటుంటే మేం చెయ్యగలిగే దేం వుందీ? దాని ఖర్మ. మా ఖర్మ యిలా కాలిపోయిం దని యావజ్జీవం కుమిలి, కృశించి పోవటం తప్ప...మరి సెలవిప్పించండి!"

ఇహ చేసే దేదీ లేక, చెమ్మగిల్లిన కళ్ళను పైమీదున్న కండవాతో ఒత్తు కుని, కుర్చీచేతి కానుకున్న గొడుగును తీసుకుని యింటిముఖం పట్టాడు రాజ శేఖరంగారు.

* * *

"ఎంగిలి కూడు బావా యిదీ, ఎం...గి...లి...కూ...డు...నా కోసం నా జీవనసహారాలో సెలఏళ్ళ కూడలిని తరలించి నందనవనంగా మార్చటం కోసం...యీ ఎంగిలికూడును తినటా నికి సిద్ధపడతావా? నీ కేం ఖర్మ బావా? నా ఖర్మం అంటే ఇలా కాలిపోయింది. ఏనాడో ఎవరికో పాపం చేశాను. ఈనాడు అనుభవిస్తున్నాను. నాకు యింతే రాసి పెట్టాడు. నేను యింతే పెట్టిపుట్టాను. ఒక పుల్లివిస్తరాకుకోసం బంగారం లాంటి నీ జీవితాన్నికూడా గంగపాలు చేసుకుంటావా? ఒక దిక్కుమాలిన దాన్ని ఉద్ధరించటం కోసం పదిమంది లోనూ పరపతి పోగొట్టుకుని నగుపా లవుతావా? ఒకరు అక్కర్లేదని త్యజించి నేల రాసిపారేసినదాన్ని నెత్తిమీద పెట్టుకుని పూజిస్తావా? వొద్దు బావా! వొద్దు. నీ ఔదార్యానికీ, త్యాగశీలానికీ నే నెంతయినా ఋణపడి వున్నాను. కాని, యీ దౌర్భాగ్యురాలిని చేరదీసి, నువ్వు ఏమీ సుఖపడలేవు. ఇదొహ అగ్నిగుండం! అది నిన్నుకూడా దహించి పారేస్తుంది. బావా! దహించి పారేస్తుంది.

"ఇహ, అదొక్కటీ ఎందుకు మిగ ల్చాలనీ, ఆ విడాకుల లాంఛనం కాస్తా కూడా ఆయన యీ మధ్యే తీర్చేశారు. పోనీలే బావా!...ఆయ నంటే.... పొట్లాల దారంలా తేలిగ్గా తెంపేసుకో గలిగారు ఆ అనుబంధాన్ని! కాని, నా వల్ల కాదు బావా! శారీరకంగా ఆయన నాకు దూరమై(పోయినా, నా మనోఫల కంమీద వారి ప్రతిబింబం ఎప్పుడూ ఓ పవిత్ర ముద్రగా నిలిచే వుంటుంది. అది చాలు నాకు. నా కన్నీటితో ఆ ప్రతిబిం బానికి నిత్యాభిషేకాలు చేస్తాను. నా రక్తమాంసాలను ఆ పవిత్ర ముద్రకు నైవేద్యంగా అర్పిస్తాను. ఇంతకంటే ఏం కావాలి బావా నాకు?...పునీతమైన యీ భరతఖండంలో పుట్టిన హిందూ నారీమణికి యింతకంటే ఎక్కువ పుణ్యం ఎక్కడ లభిస్తుంది చెప్పు?...

"నామీద ఆయిన కెలాంటి అభిప్రా

యం వున్నా. నేను చెయ్యగలిగిం దేమీ లేదు. చెయ్యిజారి పోయిం దిప్పుడు. కాని, నా అంతరాత్మ మటుక్కి నిర్మలంగా వుంది. నా క్కావలసిం దదే. ఆ నైతిక బలాన్నీ, ఆ ఆత్మస్థైర్యాన్నీ చూసుకునే యిలా బ్రతగ్గలుగుతున్నాను.

ఇంతవరకూ వచ్చాక, యింకా నీదగ్గర దాపరికం ఎందుకు బావా ? నేను చేసిన అపరాధాన్ని చెప్పేస్తాను విను. అర్థాంగిగా వారి ఉన్నతిని కోరాను. వారి అభివృద్ధిని కాంక్షించాను. ఇదీ నేను చేసిన అపరాధం బావా !

"రెండోరోజు రాత్రి, ఏదో మాటల సందర్భంలో, 'ప్రైవేటుగా బియ్యేకూ, ఎమ్మేకూ కట్టి ఎంచక్కా మా బావలా మీరూ లెక్చరర్ అవ్వండి !' అన్నాను, నోరు జారి 'బావలా' అన్నాను. ఇదీ నేను చేసిన ఘోరమైన అపరాధం బావా !

"ఆమాట ఆయన మనసులో ఓ విష బీజంలా నాటుకుపోయి, మొలకెత్తి, చిలవలూ, పలవలూ వేసి, మర్నాడు మధ్యాహ్నానికల్లా పెద్ద మ్రానై వేళ్ళు తన్నుకుపోయింది ! దానికితోడు, ఆయనతో అతి సన్నిహితంగా తిరుగుతూ, ఆంజనేయులనే కుర్రా డొక డున్నాడు - వారి కేదో దగ్గర బంధువేనట అతను.

"హనుమంతుడులేకపోతే, లంకంతా ఎలా తగలడిపోతుంది !?

"శకుని లేకపోతే మహా భారత యుద్ధం ఎలా అయ్యేది !?

"ఈ ఆంజనేయులనేకుర్రాడు ఆయన చేత 'సత్యాన్వేషణకు' నియోగించబడ్డాడు'

"స్వామిభక్తి పరాయణు డైన యీ ఆంజనేయులు, ప్రొద్దున్నే కాఫీ తాగి, వెళ్ళి, వూళ్లోఅక్కడక్కడ ఆరాతీశాట్ట.

" 'వాళ్ళ బావను చేసుకోవాలని ఆ అమ్మాయికి చాలా యిదిగా వుండేది. కాని, దరిమిలా వాళ్ళకీ, వీళ్ళకీ ఏం వొచ్చాయో తెలీదుమరి.'

" 'పెళ్ళంటే కాలేదుగానీ, చిన్నప్పట్నించీ వాళ్ళిద్దరూ మొగుడూ పెళ్ళాలే.'

"ఇలా, ఇంకా ఎం వేం విందో అక్కడక్కడా చితుకలు ఏరి పట్టుకొచ్చి, ఆయన చెవిలో పోగేసి, అగ్గిపుల్ల ముట్టించాడు, అంతే.

"అదనుకోసం నక్కల్లా కాచుకూర్చున్న కిట్టనివాళ్లు, సంతోషంతో భుజాలెగరేశారు.

"చిత్తశుద్ధితో, అమాయకంగా అన్న నా వాక్యాన్ని ఆ'హనుమంతుడు' తెచ్చిన సమాచారంతో జతచేసి, గోరంతదాన్ని కొండంత చేసుకుని, ఎవేవో ఆపోహలు పడి, తుదినిర్ణయాని కొచ్చి, 'యావజ్జీవం నువ్విలా కుమిలి, కృశించి, నశించిపో !' అని శపించేసి వెళ్ళిపోయారాయన. ఆ శాపవిముక్తి ఎప్పుడో, ఎలాగో చెప్పలేదు. అది యీ జన్మకు మాత్రం నేను నోచుకోలేదు.

వుంటాను, బావా !

ఇట్లు,

అరుంధతి కాని అరుంధతి."




(మే సంచిక తరువాయి)

"లేదు, లేదు. అన్ని రాయనేలేదు. నా బిడ్డ పూర్తిగా మారిపోయింది కదూ?" ఆర్ద్రంగా ఉన్న స్వరంలో అడిగారు.

"అవునండీ, శశిరేఖ బాగా మారింది. ఇంక మీరు బెంగ పెట్టుకోనక్కరలేదు," అంది ధీమాగా భారతి. 'నిజమే శశిరేఖ ఒక్కరోజు కూడా తను ప్రేమించిన మోహన్ గురించి మాట్లాడలేదు. ఇక లాభం లేదని వదులుకున్నట్టుంది' అనుకుంది భారతి.

"నీకా మోహన్‌ని గురించి చెప్పలేదా శశిరేఖ?" అడిగారు జమీందారిణి.

"తొలిరోజుల్లో ఒకటి రెండుసార్లు చెప్పింది. 'అందంగా ఉంటాడు. డబ్బు లేకపోతేనేం మాకున్నది చాలదా?' అంది. 'మరీ మూర్ఖపు పట్టుదలలు' అనేది నే చెప్పి చూశాను. మళ్ళీ నా దగ్గర ఆ ప్రస్తావన తేలేదు." అంది భారతి.

"నిజంగా ఆ మోహన్ ఈ ఇంటికి శనిలాగా దాపురించాడమ్మా. ఏనాడు చేసిన పాపమో, అతని రూపాన పట్టి

పిడిస్తూం దీనాడు మమ్మల్ని. శశిరేఖ స్కూలుకి వెళ్ళిపోయాక ఒకటి రెండు సార్లు ఈ చుట్టుపక్కల తారసపడ్డాడట అబ్బాయికి అబ్బాయిదిమరీ ముక్కోపం. మళ్ళీ తన కంటపడితే తంతానని బెద రించాడుట. మోహన్ పగపట్టిన తాచులాంటివా డమ్మాయీ...వాణ్ణి గురించి శశిరేఖకి ఏమీ తెలియదు," అన్నా రామె నిస్పృహతో.

"మీ రెందుకు చెప్పి చూడలేదు? అంత కానివాణ్ణి చేసుకుంటా నంటుందా?" అంది భారతి.

"అక్కడే జరిగింది పొరపాటు. మేం వాడి చెడు గురించి చెప్పినకొద్దీ వా డంటే కక్ష ఉంటుంచేత అలా అంటున్నా మని నిశ్చయించుకుంది."

"పోనీలెండి, ఇక ఆ బెంగ లేదుగా. శశిరేఖ కో మంచి సంబంధం చూసి చేద్దురుగాని." ఓదార్పుగా అంది భారతి.

"అంతా భగవంతుడి దయ తల్లీ! అదుగో సూర్యంకూడా వస్తున్న ట్టుంది,'' అంటూ లేచా రామె.

భారతి కూడా లేచింది.

"నువ్వు కాస్సేపు కూర్చో అమ్మాయీ! నేను మళ్ళీ వస్తాను," అంటూ ఆమె లోపలికి వెళ్ళిపోయారు.

మళ్ళీ వస్తా నన్నారు కదా అని అక్కడే కూర్చుంది భారతి. దూరం నుంచే తల్లినీ భారతినీ చూసిన సూర్యా రావు అటే వచ్చాడు. ఇంతట్లోనే అమ్మగారు లోపలికి వెళ్ళడం, భారతి ఒంటరిగా తారసపడ్డం ఉత్సాహం కల్గించింది అతనికి.

"ఏమిటి చాలా సుదీర్ఘంగా ఆలో చిస్తున్నట్టున్నారే." తల వంచుకుని కూర్చున్న భారతిని వస్తూనే అడిగాడు. ఎలా సంభాషణ మొదలు పెట్టాలో తెలియలేదు భారతికి.

"ఏం లేదు మీ మదర్ లోపలికి వెళ్ళారు మళ్లా వస్తామన్నా," రంది.

"అందుకని వేచి చూస్తున్నారా?" అంటూ నవ్వుతూ పక్కనే కూర్చు న్నాడు సూర్యారావు.

"మీతో ఒక్క విషయం చెప్పాలి," అంది భారతి.

"నేనూ చెప్పాలి. అందుకే మీ కోసం వచ్చాను," అన్నాడు.

"శశిరేఖ దరిదాపు రోజూ ఒక ఉత్తరం రాసేది. మీ అమ్మగా రేమో 'అబ్బే, వారాని కొకటి రాస్తేనే అబ్బురం' అన్నారు. ఆ ఉత్తరా లెవరికి రాసిం దంటారు?" అడిగింది. భారతికి ఒక విధంగా భయం పట్టుకుంది. అందరినీ నమ్మించి మోసం చేయదు కదా శశిరేఖ? అనుకుంది. ఈయన నాపైన అంత నమ్మకం ఉంచారే! శశి ఏదైనా తప్పుదారి తొక్కితే తా నెంత తప్పు అంచనా వేసుకున్నానో అనుకుంటారు ఎలాగ? అనుకుంది.

ఏదైనా జరిగితే ప్రిన్సిపాల్‌కి ముఖం ఎలాగ చూపడం? అనుకుంది

అప్పటిదాకా నవ్వుతో వెల్గుతున్న సూర్యారావు ముఖం గంభీరమైంది.

"మీ రంటున్న దేమిటి? శశి ఎవరికేనా ఉత్తరాలు రాస్తూం దేమో ఎప్పుడూ అడగలేదా?"

"అమ్మకి అని స్పష్టంగా బదులు చెప్పేది. మీకు దగ్గర చుట్టాలు గాని, బంధువులుగాని ఎవరేనా ఉన్నారా? బహుశా శశిరేఖ వారి కెవరికేనా రాస్తూ ఉండివుండొచ్చు కదా!" అడిగింది.

అలా ఎప్పుడూ రాసేది కాదు. ఇంటి దగ్గిర ఉన్నప్పుడు లేని బంధువులు అక్కడి కెలా వస్తారు?" ఓ క్షణం ఆగాడు సూర్యారావు.

"మీ కా మోహన్ సంగతి తెలియదు. ఎంతకైనా తెగించినవాడు. కటిక కసాయివాడు కూడా. ఎక్కడైనా దయాదాక్షిణ్యాలు చూపుతాడేమో గాని మోహన్‌కి అలాంటి వాటికి అర్థంకూడా తెలియదు. నాతో ఛాలెంజి చేశాడు భారతీ వాడు. వాడు గుండెలుదీసినబంటు!" ఆవేశంతో అరచినట్టుగా అన్నాడు సూర్యారావు

"మన పిల్లని కట్టుదిట్టం చేసుకోవాలి మనం. ఊళ్ళోవా డెవడో ఏదో అన్నాడని మనం ఏం చెయ్యగలం?" నెమ్మదిగా అంది భారతి.

సూర్యారావు కళ్ళలో బాధ స్పష్టంగా కనబడుతూంది. బోనులో పెట్టిన పులిలాగా ఇటూఅటూ పచార్లు చెయ్యడం మొదలుపెట్టాడు.

"మీరు అనవసరంగా గాబరాపడుతున్నారేమో! శశిరేఖకి ఇప్పుడా మొంకిపట్టుదల లేదేమో!" అంది అనుమానంగానే.

"అలా అయితే బాధేలేదు. కాని, సరే. ఇక మనం చేయగల్గిన దేముంది కనుక?" అంటూ మళ్ళీ వచ్చి భారతి పక్కనే కూర్చున్నాడు సూర్యారావు.

ఆందోళనతో కూడిన అతని ముఖం చూస్తే జాలివేసింది భారతికి. ధోరణి మార్చాలన్న తలపుతో "ఇందాక ఏదో అడగాలి అన్నారే," అడిగింది.

ఆ క్షణంలో ప్రసన్నం అయింది సూర్యారావు ముఖం.

భారతి చేయి అప్యాయంగా తన రెండు చేతులలోకి తీసుకున్నాడు. తెల్లపావురపు పిల్లలాగా ముడుచుకుని ఉన్న ఆమె చేయి అతని చేతులమధ్య నిస్సహాయంగా ఉన్నట్టు అనిపించింది.

"చూడు భారతీ! ఇదివరలో ప్రేమా, పెళ్ళీ అంటే నేను ఎప్పుడూ లెక్కచెయ్యలేదు. కాని నా ఊహలనీ, ప్రపంచాన్నీ నువ్వు తలకిందులు చేశావు భారతీ! నిన్నా స్కూల్లో చూసినది మొదలు నేను ఎప్పుడు తలెత్తి చూసినా, నువ్వు కనపడితే



బాగుండును అనిపిస్తూంది. నే నేదైనా నిర్ణయించుకుంటే దాన్ని దాచుకో లేను; అమ్మగారితో చెప్పాను. తన కేం అభ్యంతరం లేదన్నారు. ఎల్లుండి మన శశిరేఖ పుట్టిన రోజు. ఆ రోజే మన పెళ్ళి నిశ్చయంకూడా. చుట్టాలకీ స్నేహితులకీ తెలియచేయాలని నా అభిలాష. నీ కేం అభ్యంతరం లేదుగా ?"

'ప్రేమతో నిండిన కంఠస్వరంతో మాట్లాడుతూ ఉంటే సూర్యారావు ఎంత బాగుంటాడు !' అనుకుంది భారతి. 'నే నెవ్వరి నడగాలి? నా కెవ రున్నారు అభ్యంతరాలు చెప్పడానికి?' అన్నది గుర్తుకు రాగానే దుఃఖం పొంగివచ్చింది.

"ఎందు కలా కంట తడిపెడతావు భారతీ! నీకు ఇష్టం లేకుంటే నిర భ్యంతరంగా చెప్తావనే కదా!" భారతిని ఆప్యాయంగా తన చేతుల్లోకి తీసుకుని గుండెల కదుముకుంటూ అడిగాడు సూర్యారావు.

"లేదు లేదు; ఇష్టం లేదని కాదు. నా కెవ రున్నారని అడగడానికి? నాలో ఏముందని మీ కింత ప్రేమ? ఆప్యాయత నెరుగని నాకు మీ రింత ఆప్యాయత కనబరచేసరికి దుఃఖం వచ్చింది," అంది భారతి అతని గుండెలలో ముఖం దాచుకుంటూ.

అప్పుడే తోటలోకి వచ్చిన శశిరేఖ ఈ దృశ్యం చూసి మరీ ఆశ్చర్యపడ లేదు. "హాయి! హాయి! మీ ప్రేమ మంచి రసవత్తరఘట్టంలో పడిందే!" అంది అక్కడే కూర్చుంటూ.

అదరిపడి దూరంగా జరిగింది భారతి.

తప్పు చేసినవాడిలాగా తలమీద చేయి వేసి జుట్టు సవరించుకుంటూ ఎక్కడో చూడ్డం ప్రారంభించాడు సూర్యారావు.

"నేను మళ్ళీ వస్తాను. స్నేహితురాళ్ళు మాట్లాడుకోండి," అంటూ గబగబా అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

నవ్వుతూ భారతి ముఖం తనవైపు తిప్పుకుంది శశిరేఖ.

"పెద్దవాళ్ళను కాదనను, తప్పు," అంటూ పాతమాటలు గుర్తు చేసింది.

"నువ్వేదో ఊహించుకుంటున్నావు శశిరేఖా! మీ అన్నయ్య నన్ను పెళ్ళి చేసుకుంటానని అడిగారు." తన పొజిషన్ వివరించాలని చెప్పింది భారతి.

"తమదాకా వస్తేగాని ఇలాంటివి అనుభవానికి రావు కదా!" అంది శశిరేఖ. "లే, లోపలికి పోదాం-చీకటి పడిపోయింది," అంటూ భారతిని లేవదీసింది. "నీతో ఈ రెండు రోజుల్లో ఎన్నో చెప్పాలని అనుకున్నాను. నీతో నా కేదైనా చెప్పే ధైర్యం ఉంది. కాని ఇప్పుడు కాదనిపిస్తూంది భారతీ! ఎప్పుడైనా నే నేదైనా తప్పటడుగు వేస్తే నువ్వు అర్థం చేసుకుంటావు. ఆ ధైర్యం ఈ రోజు వచ్చింది నాకు. ఇదివరలో నువ్వు వట్టి 'మిస్'వే! కాని ఇప్పుడో స్త్రీవి!" అంది శశిరేఖ.

భారతికి ఏం చెప్పాలో తోచలేదు.

నేలమీద కాళ్ళూ, మబ్బుల్లో ఊహాలూ ఉన్నాయి.

# 7

రాత్రి విందుభోజనాలు- ఇల్లంతా ఒకటే హడావిడిగా ఉంది. అందమైన దీపగుచ్ఛాలు శుభ్రంగా తుడవడంతో వింతరంగులు వెదజల్లుతున్నాయి. గాలికి కదలాడుతున్న వాటి చప్పుడు మృదువైన సంగీతం లాగా ఉంది. హాలులో గోడలకి ఉన్న పాతకాలపు తైలవర్ణ చిత్రాలు తుడిపించింది భారతి. బంగారం రంగులో ఉన్న వాటి ఫ్రేములు దీపకాంతికి తళతళ మెరిసేలాగా ఉన్నాయి. ఖరీదైన తివాసీలు దుమ్ముదులిపి తిరిగి పరిచారు.

కుర్చీలు అమర్చారు. ఇల్లంతా కొత్త వెల్గుతో నిండినట్లుంది.

సాయంత్రం అయిదు గంటల వేళ భారతి ఒక్కర్తీ బయలుదేరింది దేవాలయానికి. పుట్టిపెరిగిన ఊరు- ఎన్నాళ్ళయిందో గుడికి వెళ్ళి! చిన్న తనంలో సరదాగా గుడి ఆవరణలో ఆడుకొనేది. ఒక్కర్తే నడిచి వెడుతూ ఉంటే చిన్ననాటి సంగతులన్నీ జ్ఞాపకం వస్తున్నాయి. చేతిలో పూలూ, కొబ్బరి కాయా మొదలైన పూజాద్రవ్యాలు ఉన్నాయి. ఊహలు మటుకు రెక్కలు విచ్చుకొని గతంలో విహరిస్తున్నాయి. అలా ఆలోచనలు వెంట తరుము తూండగానే దేవాలయంలో ప్రవే శించింది గుడిలో ఎక్కువ జనంకూడా లేరు. త్వరగా పూజ చేయించి బయ టికి వచ్చింది. నాలుగడుగులు వేసిందో లేదో ఎదురుగా నిలబడిన వ్యక్తిని చూసి నిశ్చేష్టిత అయి నిలబడిపో యింది. నోట మాట రాలేదు.

"మీరు...నువ్వు..." తడబడింది భారతి.

"ఔను నేనే. ఆ రోజు ఉత్తరం ఇచ్చి పుణ్యం కట్టుకున్నారు ఈ రోజేమిటి? మీ రనాలా? ను వ్వనాలా? అని ఆలోచిస్తున్నారు?" హేళనగా అంటున్న అతని కళ్ళు తళతళ మెరుస్తున్నాయి,

"మీ రిక్కడెందు కున్నారు? సూర్యానికి తెలిస్తే!" అంది.

"మీరు చెప్తే తప్పించి ఎందుకు తెలుస్తుంది? మీరు చెప్పరు," అన్నాడు ధీమాగా.

భారతికి కొంచెం ధైర్యం వచ్చింది. ఇతని సంగతేమిటో తెలుసుకోవా లనుకుంది.

"మీ రిక్కడున్నసంగతి ఎవరికేనా తెలుసా?"

"ఒక్క శశిరేఖకి తెలుసు ఇంత వరకూ. ఇప్పుడు మీకు తెలిసింది. అయినా మీరు తటస్థపడతా రనుకో లేదు నేను," అన్నాడు మోహన్.

"శశిరేఖ కెలా తెలిసింది? మిమ్మల్ని పూర్తిగా మరిచిపోయింది శశిరేఖ. ఇక ఆ కుటుంబాన్ని వేధించకండి;" అవే శంగా అంది భారతి.

శశిరేఖ నన్ను మరిచిపోయిందా?" హేళనగా నవ్వాడు మోహన్. "న న్నెలా మరిచిపోతుంది? రోజూ ఒక ఉత్తరం రాసేది. మరిచిపోతే రాసేదా?" అడిగాడు.

"మీకా రాసింది?" అదరివడింది - భారతి.

ఓక్షణంలో తెప్పరిల్లింది.

"స్కూలుకి ఉత్తరాలు రాకూడదే. మీ ఉత్తరా లెలా వచ్చాయి. మీరు అబద్ధం ఆడుతున్నారు," అంది.

సమాధానంగా నవ్వాడు మోహన్.

"చెప్పండి మీది అబద్ధమేనా?"

"మీతో సంతకివచ్చేటప్పుడు అవూరు

పోస్టాఫీసులోంచి నా ఉత్తరాలన్నీ తీసుకునేది," అన్నాడు.

తన తెలివితేటలకి తనని తనే అభినందించుకున్నట్టు టోపీ సవరించుకున్నాడు

ఎంత ఆశ్చర్యం? ఇందుకా శశిరేఖ అంత ఆనందంగా ఉంది? 'ఈ సంగతి సూర్యానికి తక్షణం తెలియాలి' అనుకుంది భారతి.

"మీరిక వెళ్ళండి. ఇక ఈ ఊళ్ళో ఉంటే మీకు మర్యాద దక్కదు," అంటూ కోపంగా ముందుకి సాగింది.

ఆమెను కొంతదూరం వెళ్ళనిచ్చి, "ఇన్నాళ్ళు ఓపిక పట్టారు; ఈ ఒక్క రాత్రికి ఓపిక పట్టండి. అంటూ కేక వేసి త్వరత్వరగా అడుగులు వేసుకుంటూ సాగిపోయాడు మోహన్.

భారతి నడక వేగం పెచ్చింది.

మోహన్ శశిరేఖ కలిసి తనని ఎంత మోసం చేశారు? ఈసంగతి జ్ఞాపకం వస్తూంటే నడక మరీ వేగం కాసాగింది. గుండె దడదడ లాడుతున్నా ధైర్యం చెప్పుకుంటూ ఇల్లు చేరింది భారతి.

లోపలికి వెడుతూనే సూర్యారావు కోసం వెదికింది. అతను ఇంట్లోలేడు.

"విందువేళలోగా వచ్చేస్తా నన్నాడమ్మా," అన్నారు శశిరేఖతల్లి.

కూనిరాగాలు తీస్తూ శశిరేఖ స్నానం చేస్తూంది.

ఇక చేసేదేంలేక భారతి, తనూ అతిధులు వచ్చేవేళకు సిద్ధం కావాలని తయారుకావడం ప్రారంభించింది. ఏపని చేస్తూన్నా మోహన్ మాటలు జ్ఞాపకం వస్తున్నాయి. సూర్యం ఇంటికి ఎప్పుడు వస్తాడా అని ఎదురుచూడ సాగింది

ఈగొడవేం లేకుండా చక్కగా అలంకరిచుకొని బంగారు బొమ్మలాగా తయారైంది శశిరేఖ. పాతకాలపు జహ్వారీతో దివినుండి దిగివచ్చిన దేవ కన్యకలాగా ఉంది శశిరేఖ.

భారతి మనస్సు పరిపరి విధాల పోతూంది ఏపనీ పూర్తిగా చేయిలేక పోతూంది. బాగా చీకటులు అలముకొన్నాయి. భవంతి ముందుహాల్లో దీపాలు దేదీప్యమానంగా వెల్గి పోతున్నాయి. ఊరి పెద్దలంతా ఒక్కొక్కరే వస్తున్నారు. వారితోపాటే లోపలికి అడుగు పెడుతున్న సూర్యాన్ని చూడగానే ప్రాణం లేచి వచ్చింది భారతికి కాని అతడు మాత్రం ఎంత సేపటికీ లోపలికి రాలేదు. అందరితో నవ్వుతూ కబుర్లు చెప్తున్నాడు. పెద్దలతోపాటే ముందు హాల్లోనే కూర్చుండిపోయాడు.

అతనెంత ఆలస్యం చేస్తే అంత ప్రమాదం అని బెంగపడుతూంది భారతి.

భారతి అదోలా ఉండడం గమనించింది శశిరేఖ.




"ఏం భారతీ! ఎందు కంత హడావిడిగా అన్నయ్యకోసం చూస్తున్నావు. పిలవనా?" చిన్న వేళాకోళం చేస్తూ అడిగింది శశిరేఖ.

"ప్లీజ్! శశీ! అన్నయ్య నొకసారి లోపలికి పిలుస్తావా? మాట్లాడాలి," అంది ఆత్రంగా భారతి.

"ఏంకథ? నాతో చెప్పకూడదా?" అంది శశిరేఖ.

ఎంత నటించకలదీ శశి? ఏమీ తెలియనట్టే ఎలా ఉండకలుగుతూంది? తనకి తెలిసిన సంగతి చెప్తే ఏం చేస్తుంది?... 'ఊహు, చెప్పకూడదు. తొలిసారి చేసిన తప్పు చాలు,' అనుకుంది భారతి.

"ఏం లేదు. అన్నయ్యకి చెప్పాలి," అంది మొండిగా భారతి. శశిరేఖ అన్నయ్యని పిలవడానికి వెళ్ళింది. హాల్లోకి తొంగిచూసింది అందరిమధ్యా చందమామలాగా కూర్చుని కబుర్లు చెప్తున్నాడు సూర్యారావు, 'అన్నయ్యా!' అని శశిరేఖ కేకవేసింది.

లేచి ఇవతలికి వచ్చాడు సూర్యారావు. "ఏం శశీ?" అడిగాడు ఇంట్లో కళకళలాడుతూ తిరుగుతున్న శశిరేఖని చూస్తే ఆనందంగా ఉంది సూర్యానికి. చెల్లెలి తల ప్రేమతో నిమురుతూ "ఎందుకూ పిలిచావు!" అడిగాడు

"నీతో అర్జెంటుగా మాట్లాడాలని భారతి పిలుస్తూంది," అంది. చిలిపిగా

నవ్వుతూ అన్నగారి ముఖంలోకి చూసింది.

"నీ పుట్టిన రోజు కదా? ఏం కావాలో కోరుకో ఇచ్చేస్తాను," అన్నాడు ప్రేమగా.

అప్రయత్నంగా కళ్ళవెంట నీరు వచ్చింది శశిరేఖకి.

"నే నెక్కడున్నా సుఖంగా ఉండాలని దీవించన్నయ్యా!" అంది.

"ఓయ్ పిచ్చి! ఈ రోజేమైనా నీ పెళ్ళి అనుకుంటున్నావా!" అంటూనే లోపలికి వెళ్ళిపోయాడు సూర్యారావు.

అతని రాకకోసం ఆత్రుతతో వేయి కళ్ళతో చూస్తున్న భారతికి అతణ్ణి చూడగానే భోరున ఏడవాలని పించింది.

తనకోసం ఎదురు చూస్తున్న భారతిని అప్యాయంగా పొదవిపట్టుకున్నాడు సూర్యారావు

"నువ్వీఊరు వచ్చినరోజునే నీకోసం ఆర్డరిచ్చాను - ఓ ఉంగరం. అదీ రోజున నీకు పెట్టాలని నా కోరిక. అందుకే వెళ్ళాను. ఏదో మాట్లాడాలన్నావుట," నెమ్మదిగా అడిగాడు సూర్యం.

"మరేంలేదు... మనశశిలేదూ..." అనబోయింది భారతి. ఇంకా మాట పూర్తి కాలేదు. జమీందారిణి లోపలకి వస్తూనే...

"అంతా నీకోసం చూస్తూంటే ను వ్విక్కడేం చేస్తున్నావు? రా నాయినా," అని సూర్యారావుని పిలిచేశారు.

భారతికేసి ప్రేమ నిండిన కళ్ళతో చూస్తూ "నువ్వూ, శశీ కూడ త్వరగా రండి," అంటూ వెళ్ళిపోయాడు సూర్యారావు.

చెప్పడానికేం అవకాశం రాకపోవడంతో మరీ బెంగపడింది భారతి. శశిరేఖని ఓ క్షణంకూడా వంటరిగా విడిచిపెట్టకూడదని నిర్ణయించుకుంది. ఈ నిశ్చయానికి వచ్చాక కొంచెం మనస్సు స్థిమితపడింది భారతికి.

హాలంతా స్త్రీ పురుషులతో నిండి ఉంది. అందరూ కోలాహాలంగా కబుర్లు చెప్పుకుంటున్నారు. విందుభోజనాలు అయ్యాయి. కొడుకుపెళ్ళి నిశ్చయం అయిన శుభవార్త అందరికీ తెలియచేశారు జమీందారిణి. ఆమెకు భారతిని చూస్తే ఎంతో గర్వంగా ఉంది.

కాని భారతి మనస్సు అక్కడలేదు. శశి నెలా కాపాట్టం? అసలు శశిరేఖ వేస్తున్నది ఏమైనా ప్లానా? లేక ఉట్టినే భయపెట్టడానికి అలా అన్నాడా మోహన్? అన్న ప్రశ్నలు శాంతి లేకుండా చేస్తున్నాయి భారతిని.

భారతి ఎందుకలా ముభావంగా వుందో ఊహించలేక పోయాడు సూర్యం. అందుకే ఏకాంతంగా మాటలాడే అవకాశంకోసం చూస్తున్నాడు.



ఆడవాళ్ళమధ్య కూర్చుని క్లుప్తంగా సమాధానాలు చెప్తూంది భారతి. ఎప్పుడు లేచిందో ఎవరూ చూడలేదు. కాని శశిరేఖ అక్కడ లేదు. ఎంత సేపైలేదో కూడా గ్రహించలేక పోయింది భారతి. ఒక్క ఉదుటున లేచి "శశిరేఖ ఏది?" అంటూనే లోపలికి నడిచింది. "శశిరేఖా" అంటూ గది లోకి వెడుతూ పిలిచింది. ఏదో తెలియని భయంతో నిలువెల్లా ఒణికి పోయింది భారతి.

ఏముంది?

శశిరేఖ గదిలో లేదు!

"సూర్యం?" అని అరుస్తూనే తెలివి తప్పి పడిపోయింది భారతి. భారతి లేవడం చూసిన సూర్యారావు తనూ ఆమె వెనకనే లోపలికి వచ్చాడు. పడి పోబోతూండగానే భారతిని పట్టుకుని నెమ్మదిగా పడుకోపెట్టాడు. ఓ పది నిమిషాలకుగాని భారతి కళ్ళు తెరవ లేదు.

"ఏమైంది భారతీ? ఏమైంది?" అడిగాడు.

"శశిరేఖ లేదు!" అంది క్లుప్తంగా.

పక్కనే బాంబు పేలినట్టు అదరి పడ్డాడు సూర్యారావు.

"ఏమైంది?" అంటూ ఆదరా బాదరాగా లేచాడు సూర్యారావు. అతని చెయ్యి పట్టుకుని ఆపింది భారతి.

"అంతా పెద్దవాళ్లు ఉన్నారు.

వారు వెళ్లాకగాని అమ్మగారికి తెలియ నీయవద్దు," అంది.

వెనకపక్క పెరటి తలుపులు తెరచి ఉన్నాయి.

పక్క బల్లమీద ఉండే శశిరేఖ పెట్టె లేదు.

'ఎంత దారణం చేసింది శశిరేఖ!' అని నిట్టూర్చింది భారతి.

ఎక్కడికి వెళ్ళి ఉంటుం దన్నది ఆలోచించడానికి ప్రారంభించింది — కాని ఎలా తెలుస్తుంది?

8

అతిధు లందరూ వెళ్లిపోయారు. నిశ్చింతగా కుర్చీలో చేరపడి కూర్చు న్నారు జమీందారిణి.

ఆమెకు ఒకపక్కగా కూర్చుంది భారతి. రెండోపక్కగా సూర్యారావు కూర్చున్నాడు.

"అమ్మా శశిరేఖ మన నందరినీ మోసంచేసి వెళ్లిపోయిందమ్మా!" అన్నాడు సాధ్యమైనంత ఆవేశరహితంగా.

మొదట ఆ మాటలు గ్రహింపు కాలే దామెకి.

"ఏమిటి సూర్యం నువ్వనేది?" అడిగారు రెట్టించి.

"మనందరి కళ్లూ కప్పి వెళ్లిపోయింది శశిరేఖ; పెట్టెకూడా లేదు," అన్నాడు సూర్యారావు.

ఆ మాటలు విని అదిరిపడ్డా రామె. "నిజమా? నిజంగానా?" అన్నా రే గాని ఆ మాటకూడ పూర్తికాకుండానే కుర్చీలో కుప్పగా కూలిపోయారు. భారతీ, సూర్యారావూ కలిసి ఆమెని నెమ్మదిగా పడకమీద చేర్చారు.

రాత్రి రెండుఝాములు గడిచింది. అయినా ఆమెకు తెలివి రాలేదు.

తెల్లవారింది. అయినా ఆ ఇంట్లో అంతా చీకటే నిండివుంది.

పూర్తిగా వెల్గురాకుండానే బట్టలు వేసుకు బయలుదేరాడు సూర్యారావు.

"అమ్మ జాగ్రత్త. నేను పోలీసు రిపోర్టు ఇచ్చివస్తా," నని భారతి చేయి నొక్కి వెళ్లిపోయాడు.

"ఈ ఇంటిలో ఆత్మశాంతి పోయి, అది ఇప్పుడిప్పుడే తిరిగి వస్తోంది — అనుకున్నది కాస్తా ఎండమావి అయి పోయింది. దీని కంతకీ నేనే బాధ్యు రాలిని," అంటూ లోలోన కుమిలిపో సాగింది భారతి.

తెలతెలవారుతూండగా వెళ్లిన సూర్యారావు మిట్టమధ్యాహ్నం దాకా తిరిగే రాలేదు. వచ్చాకకూడా తిన్నగా తనగదిలోకి వెళ్లిపోయాడు. నెమ్మదిగా తలుపు తోసుకుని అతని గది లోకి వెళ్లింది భారతి. కళ్ళకి చెయ్యి అడ్డం పెట్టుకుని టేబిల్‌మీద కాళ్ళు పడేసి మూల్గుకున్నాడు సూర్యారావు. అతని తీరులోనే కన్పిస్తూంది — అతనిలో ఆవహించిన నిస్పృహ.

"నేను అన్నిటా ఓడిపోయినదాన్ని. మీరంతా కలిసి నాపై పెట్టిన నమ్మకాన్ని వమ్ము చేసుకున్నాను. క్షమించండి," అంది భారతి అతని చెంత నిలబడుతూ.

తలెత్తి భారతిముఖంలోకి చూశాడు సూర్యారావు.

దైన్యం గూడు కట్టుకొన్నట్టుంది భారతి ముఖం.

"లేదు భారతీ! మన బంగారం మంచిది అయితే కదా! ఎదుటివారిని ప్రయోజనం శూన్యం. మమ్మల్నీ నిన్నూ ఒక్కలాగే నమ్మించింది శశిరేఖ. 'వెలుగువెన్నెలబాటలు పరుస్తాం నీకోసం, రా,' అంటేమటుకు 'చీకటిదారే బాగుంది' అనే మూర్ఖులను ఎవరు మార్చకలరు? నువ్వేం బాధపడకు," అన్నాడు సూర్యారావు, భారతిచేయి తనచేతిలోకి తీసుకుంటూ, "అమ్మ ఎలా ఉంది?" అన్నాడు.

"మీరు వెళ్ళాక డాక్టరు వచ్చారు. ఏమిటో అంతా నిరుత్సాహంగానే ఉంది...పోనీ నేను వెళ్ళిపోతే?" అంది భారతి. తనరాక ఈ ఇంటిదీపం ఆర్పినట్టు అనిపించింది భారతికి.

భారతి పడుతున్న కోత సూర్యారావుకి అర్థం కాకపోలేదు. భారతిని తన వడిలోకి లాక్కుంటూ, "చూడు భారతీ! ఆమాట ఎప్పుడూ అనకు. నా హృదయంలోని వెల్గు ఇప్పుడు కనబడదు నీకు. శశిరేఖని ఎక్కడున్నా సరే ఈ ఇంటికి తెచ్చితీరుతాను. నువ్వు వెళ్ళిపోతే అమ్మని ఎవరు చూస్తారు? మనకి ఇంతకుముందే పెళ్ళి అయిపోయి ఉంటే ఈమాట అనిఉండేదానవా?" భారతి ముఖం తనవైపు తిప్పుకొన్నాడు. ఏమీ సమాధానం చెప్పలేక కళ్ళు దించుకొంది భారతి.

రోజూ సూర్యారావు బయటికి వెళ్ళి వస్తున్నాడు. కాని. కొత్త విషయాలేమీ ఉండడం లేదు.

ఒకరోజు అతను బయటికి వెళ్ళాడు. శశిరేఖ వెళ్ళిపోయిన నాటి నుంచీ మంచం పట్టిన జమీందారిణిని భారతే చూసుకుంటూంది.

పదిగంటల వేళ ముందు హాల్లో కూర్చుని ఏదో పుస్తకం చూస్తూంది భారతి.

"అమ్మాయిగారూ, ఈ కాగితం ఎవరో ఇచ్చారు," అంటూ ఓ కాగితం పట్టుకుని తోటమాలి వచ్చాడు.

కాగితం అందుకుంది భారతి. ఆ చేతివ్రాత చూసి అదరిపడింది. అది బాగా గుర్తు.

మోహన్ హెచ్చరికలాంటి లేఖ వ్రాసి పంపాడు!

"గురవయ్యా, ఇదెవరిచ్చారు?" అడిగింది.

"ఎవడో చిన్న కుర్రాడిచ్చిపోయాడమ్మాయిగారూ!" అంటూ

దాని ప్రాముఖ్యం తెలియని గురవయ్య తన పనిమీద వెళ్ళిపోయాడు.

పిరికి గుండెలతోనే కాగితం మడత విప్పింది భారతి. చాలా కటువైన ఉత్తరం అది. శశిరేఖని ఎరగా పెట్టి బెదిరిస్తున్నాడు మోహన్.

"నాకు శశిరేఖని పెళ్ళి చేసుకోవడం కాదు ముఖ్యం. ఆ కుటుంబానికి బుద్ధి చెప్పడం – ఆ సంగతి గ్రహించ కలవాడు ఒక్క సూర్యారావే. అతగాడెందుకు శశిరేఖని నిర్బంధంలో ఉంచాలని చూశాడో ఇప్పుడర్థం అవుతోందా మీకు? ఈరోజు మీ రోసారి రండి. నాతో పేచీ మంచిది కాదని సూర్యానికి చెప్పండి. ఇన్నాళ్ళూ అతగాడు లెక్కలేకుండా నన్ను అడ్డుకున్నాడు. ఇప్పుడు నాపై ఏ చర్య తీసుకున్నా శశిరేఖ గతి జ్ఞాపకం చేసుకోమనండి. దేవాలయందగ్గిర మీకోసం చూస్తాను," అని ఉంది. ఎంత ధైర్యం అని వింత పడింది భారతి.

బయటికి వెళ్ళిన సూర్యారావు ఎంతకీ తిరిగిరాలేదు. ఇక లాభం లేదని వంటావిడని జమీందారిణి దగ్గిర కూర్చోమని, తనే బయలుదేరింది భారతి. మోహన్‌తో మాట్లాడి శశిరేఖని ఇంటికి తీసుకురావాలని ఆమె పిచ్చికోరిక.

నిర్భయంగానే దేవాలయం దగ్గిరకి వెళ్ళింది. తొలుత ఉత్తరం ఇవ్వడానికి ఎలా కాచి నిలబడ్డాడో అలాగే నిలబడి ఉన్నాడు మోహన్. 'ఇంత అందమైన వాడు., చతురతతో మాట్లాడ కల్గిన వాడు; కాని హృదయం ఎంత కలుషితం, అనుకుంది భారతి. అతగాణ్ణి చూసేసరికి వళ్ళు తెలియని కోపం వచ్చింది.

"చేసిన నిర్వాకంచాలక ఇదేమిటి ?" అడిగింది సూటిగా.

"మీకు కొంచెం ఇంగితం ఎక్కువ అనుకున్నాను. మీరూ వాళ్ళలాగే తయారవుతున్నారే!" నవ్వుతూ అన్నాడు.

"ఆ ఉత్తరం పోలీసుల కిచ్చి నా వెంట తీసుకువచ్చి ఉంటే ఏం చేసేవాడివి?"

"మీ రలా చెయ్యరని తెలిసే రాశాను. ఇక వ్యవహారం మాట్లాడుకుందాం. వ్యవధి లేదు. నే నా యింటి ఆడబిడ్డ కడుపున పుట్టిన దోషాన ఇలా గతి లేకుండా తయారయానని మీకు తెలియకపోవచ్చును. కాని నాకు తెలుసు. బాగా తెలుసు. ఏభయివేలు యిచ్చి శశిరేఖని తీసుకుపొమ్మనండి. నా కక్ష తీరుతుంది. నా తల్లి చెడిపోయిందని ఇంట్లోంచి గెంటించారే! ఇప్పుడీ శశిరేఖని ఏం చేసుకుంటారో నేనూ చూస్తాను," అన్నాడు.

అతగాడి గుండెలుతీసిన మాటలకి అనరిపడింది భారతి.




"నేను శశిరేఖని చూస్తేగాని ఏ సంగతీ చెప్పను," అంది ఖచ్చితంగా భారతి.

వ్యంగం ఉట్టిపడేలా నవ్వాడు మోహన్.

"మీలాగా భవంతుల్లో నివాసం అంత మంచిది కాదని తగినచోటే మకాం పెట్టాను. మొదట్లో, పాపం, శశిరేఖ బాధపడింది–ఈసరికి అలవాటు పడిందనుకోండి – మీకు చూపెడతాను. అయితే మీరు మాట్లాడ్డానికి వీలు లేదు," అన్నాడు.

"ఏం? ఎందుచేత?" అడిగింది భారతి.

"ఏమో, మీ ఇద్దరూ లాలోచీపడితే నా షరతుల గతేంకాను? నా షరతులకి ఒప్పుకోనేదాకా ఎవ్వరూ శశిరేఖను పలకరించడానికి వీలులేదు," అన్నాడు.

"సరే అయితే, నేను కళ్ళారా శశిని చూడాలి. తరువాతగాని మాట్లాడను," అని మౌనంగా అతని వెనుక నడవడం ప్రారంభించింది భారతి.

అలా అతనివెంట ఎంతదూరం నడిచిందో! పూరిగుడిసెలు, రోడ్డువార కుళ్ళునీళ్ళలో పొరిలేపందులు, మురుగు కాలవలమీది చిన్న కర్రవంతెనలు దాటి నడుస్తున్నాడు మోహన్.

ఒకచోట ఆగాడు. దూరంగా

గుంపుగా ఉన్నాయి పాకలు. వాటిలో ఒకదానివైపు చూపుతూ "అదిగో, అందాకా ఆపాకలోనే మకాం," అన్నాడు.

"మీ రిక వెళ్ళండి," అంటూ తిరిగి చూడకుండా వెళ్ళిపోయాడు. ఎంత దారుణం!

మనుషుల మీద కక్ష ఇలాగా సాధిస్తారు?

కోపం, పగా – వీటికి ప్రేమా, అనురాగం ముసుగులు!

ఎంత విచిత్రం.

బ్రమాన్పడి నిలబడిపోయింది భారతి.

## 9

వచ్చిన దారివెంట ఇంటిముఖం పట్టింది భారతి. ఆమె మనస్సు మనసులోలేదు. 'ఈదారుణం వింటే అమ్మగా రేమైపోతారు? సూర్యం ఎంత బాధపడతాడు! దానికి పర్యవసానం ఎలా ఉంటుందో?' అనుకుంటూ తల వంచుకొని గబగబా నడుస్తూంది భారతి. పక్కగా వచ్చి ఆగిన కారుని చూడనేలేదు చప్పుడు కూడా వినబడ లేదు భారతికి.

"రా భారతీ! ఇంటికిపోదాం," అంటూ కారు తలుపు తెరిచి పిలిచాడు సూర్యారావు.

నిద్రలో నడుస్తున్న మనిషిలా వచ్చి కారెక్కింది.

"ఎక్కడికి వెళ్ళావు? తమ్మ నువ్వు రాలేదని ఇప్పటి కెన్నోసార్లు అడిగింది. నేనే చూద్దామని బయలు దేరాను," అన్నాడు కారు స్టార్టుచేస్తూ.

"సూర్యం! ఈ దారుణాన్ని విన్నావా? నేను మోహన్‌ని కలుసుకున్నాను;" అంది; కోపంతోటీ, ఆవేశంతోటీ నోట మాటరాలేదు భారతికి.

"అంత ఆవేశపడకు భారతీ. ఈ చుట్టుపక్కల ఎక్కడున్నా వాడు నన్ను తప్పించుకుపోలేడు. పోలీసులు వల పన్నే ఉంచారు వాడికోసం," అన్నాడు అనునయంగా.

"నీ కసలు తెలియడం లేదు. వాడు కసాయికంటే అన్యాయం. నువ్వు వాడి చేతుల్లోంచి శశిరేఖని రక్షించలేవు సూర్యం, రక్షించలేవు;" గూడు కట్టుకొన్న దుఃఖం ఉప్పెనలాగా పొంగి నోట మాట రాలేదు భారతికి.

చేతుల్లో ముఖం దాచుకొని భోరున ఏడ్చింది

ఇల్లు చేరగానే నెమ్మదిగా అన్ని విషయాలు తెలుసుకున్నాడు సూర్యారావు. మోహన్ వ్రాసిన ఉత్తరం తీసుకొని తిరిగి అప్పుడే బయలుదేరి వెళ్ళిపోయాడు.

ఉట్టి బెదిరింపులకు లొంగేవాడు కాదు మోహన్ అని తెలుసుగాని, మరీ ఇంత దారుణానికి తెగించేవాడని ఊహించలేకపోయాడు. శశిరేఖని

పెళ్ళి చేసుకోవాలన్న కోరిక ఉంది కాబోలు అన్న అనుమానం ఎప్పుడేనా తలెత్తినా, దాన్ని అణచివేసేవాడు. కాని ఇలా పగ సాధించడానికే ప్రేమ నటించి అమాయకురాలైన శశిని మోసం చేస్తాడని సూర్యారావు ఊహకేనా అందలేదు. ప్రస్తుత కర్తవ్యం అంతా శశిరేఖని రక్షించడమే. అది తనొక్కడివల్లా సాధ్యం కాదు. అందుకే మోహన్ ఉనికి విషయంలో తెలిసిన ఈ కొత్త సమాచారం తక్షణం పోలీసులకి అందచేయాలి అనుకున్నాడు సూర్యారావు.

అంతా ఎంత త్వరగా రంగంలోకి దిగితే అంత మంచిదని తక్షణమే బయలుదేరాడు సూర్యారావు.

భారతి కాలు కాలిన పిల్లిలాగా ఇంట్లో తిరుగుతోంది - ఏం చేయాలో తోచని స్థితిలో ఉంది.

"అమ్మాయీ! మళ్ళీ సూర్యం బయటికి వెళ్ళాడా?" అడిగారు జమీందారిణి.

"అవునమ్మా, శశిరేఖ విషయంలో కొత్త సంగతులు తెలిశాయని పోలీసు స్టేషనుకి వెళ్ళారు,'' అంటూ ఒడిలిన ఆమె చేయి తన చేతిలోకి తీసుకుంటూ మంచంపక్కనే కుర్చీలో కూర్చుంది భారతి.

"మీ ఇద్దరూ కలిసి నాదగ్గర ఏదో దాస్తున్నారు. నిజం చెప్పు భారతీ!" దీనంగా అడిగారు.

ఆమెకు మనశ్శాంతి కల్గేలా చేయాలంటే నిజం చెప్పడం ఒకటే అనుకుంది భారతి. తరువాతేనా అన్నీ తెలిశాక బాధపడతారు గాని, మానరు కదా?

"మోహన్ మీ రనుకునే మోసగాడే కాదు; దుర్మార్గుడుకూడా నమ్మా. ఈ రోజు ఉత్తరం రాసి పంపాడు," అని తను వెళ్ళడం, తిరిగి సూర్యారావు తీసుకురావడం. మొదలైనవన్నీ వివరంగా చెప్పింది.

"రేపీ పాటికి మన శశిరేఖ మనింట్లో ఉంటుందమ్మా! మీ రేం బెంగపడకండి," అని ఓదార్చింది.

"నీకు తెలియదు భారతీ! మోహన్‌దికూడా వాడి తండ్రిపోలికలా వుంది;" గతంలోకి తవ్వుతూ చెప్తున్నా రామె.

"వారి చెల్లెలు నా ఆడబిడ్డ - మన శశిరేఖ లాగే చాలా అందంగా ఉండేది; చాలా మొండి. మన శశిరేఖది ఆ పోలికే తల్లీ! ఎవరినో ప్రేమించాను, అతగాణ్ణి తప్పించి పెళ్ళి చేసుకోను అని పట్టుపట్టింది. ఆ ఎవరో వాణ్ణి గమ్మన్నారీయన. అతగా డెందుకు వస్తాడూ? చివరికి తేలింది - అమ్మాయి నెల తప్పిందని. ఈయనదా ముక్కోపం. వెనకా ముందూ చూసే అలవాటే లేదు. ఇంట్లోంచి ముందు బయటికి పొమ్మన్నారు. నే నెంత వద్దని మొత్తు

కున్నానో, ఆ భగవంతుడికే ఎరుక. ఆ పిల్లమటుకు తక్కువదా! 'చంపుతే చంపు, నే వెళ్ళను అన్నయ్యా!' అని కాళ్ళమీద పడకూడదూ? ఉహుఁ, నేను బయటికిపోయి అతగాణ్ణే పెళ్ళి చేసుకుంటాను. నీ లెక్కేమిటి అని వెళ్ళిపోయింది. అంతే, తరువాత నాలు గైదేళ్ళదాకా ఆ అమ్మాయి సంగతే తెలియలేదు. చాలా నికృష్టపు బ్రతుకులో పడిపోయిందని వినడమే గాని కళ్ళారా చూడలేదు. ఆ చేసుకుంటానన్నవాడు చేసుకోలేదు. ఎలా బ్రతికిందో ఆ దేవుడికే తెలియాలి. తల్లీ తండ్రీ లేనిదాన్ని ఇంట్లోంచి పొమ్మన్నానే అన్న మనోవ్యధ వారిని బ్రతికి ఉన్నంతకాలం పీడించింది. కాలం, మనకి ఇష్టం లేనప్పుడు, క్షణాలమీద గడిచిపోతుంది. మన శశి పూర్తిగా పధ్నాలుగేళ్ళుకూడా నిండకుండానే మొండిగా తయారైంది. అది చూసి వారి కింకా చింత పెరిగింది. స్నేహితుల ఇళ్ళకనీ అక్కడికనీ ఇక్కడికనీ వెళ్ళి ఎవరినో కలుసుకుంటూందన్న సంగతి మాకంటె ముందు మాలిక్కి తెలిసింది. వాడీనాటివాడా? ఆ పిల్ల వాడి నిట్టే గుర్తుపట్టేశాడు. వాడెలాంటి బ్రతుకు బ్రతుకుతున్నాడో ఆరా తీశాడు. ఓ రోజు బాగా తన్నించాడుకూడా. దానితో మోహన్‌కి పంతం పెరిగింది. ఇటు శశిరేఖా మొండికెత్తింది. ఈ బెంగతోనే వారు కన్ను మూశారు భారతీ!' దీర్ఘంగా నిట్టూర్చారామె.

"అవన్నీ పీడకల లనుకోండమ్మా. అన్నీ గడిచిపోయాయి. ఇక శశిరేఖ సుఖంగా ఇంటికి వస్తుందిగా;" ధైర్యం చెప్పాలని చూసింది భారతి.

"నా కా నమ్మకం లేదు భారతీ! అదంతా అత్తపోలికే. సూర్యం దాన్ని తిరిగి రానివ్వడు," అన్నారు నిస్పృహగా.

"మీ రలా అనకండి. జరిగినదాని కెంతగానో బాధపడుతున్నారు వారు. తప్పకుండా ఆయనే శశిని తీసుకు వస్తారు చూడండి," అంది లేని ఉత్సాహం తెచ్చుకుంటూ.

బయటికి వెళ్ళిన సూర్యారావు తిరిగి వచ్చాడు. తల్లిని చూస్తే అతనికి మరీ బెంగగా ఉంది.

"నీ కేం భయం లేదమ్మా! శశిరేఖని తీసుకువచ్చి నీకు అప్పగిస్తాంగా!" అంటూ తల్లిని ఓదార్చాడు.

రాత్రి చాలా సేపటివరకూ ఇద్దరూ మాట్లాడుకుంటూ కూర్చున్నారు. ఒకరికొకరు ధైర్యం చెప్పుకున్నారు. 'ఇదెంతవరకు' సాధ్యం? అన్న అనుమానం ఇద్దరి మనస్సుల్లోనూ ఉంది. అది పైకి గట్టిగా అనే ధైర్యం ఇద్దరిలోనూ లేదు.

కలత నిద్దురలతోనే తెల్లవారింది రాత్రి.

"ఉదయం తొమ్మిదింటికి ఇనస్పెక్టరుగారు వస్తారు భారతీ! నీ వెంటమే మంతా మోహన్ చూపెట్టిన ఇంటికి వస్తాం," అని చెప్పాడు సూర్యారావు.

తల్లికిధైర్యం చెప్తున్నకొద్దీసూర్యారావు ధైర్యం కొరవడుతూంది.

"మనం చాలా జాగ్రత్తగా ఉండాలి. ఏ మాత్రం అనుమానం కల్గించకూడదు. అందుచేత మిస్ భారతిని ముందుగా వెళ్ళనిద్దాం. ఆమెను మనం వెన్నంటి వెళ్ళవచ్చు," అని ఇనస్పెక్టరు సూచించడంతో పుంజుకున్న ధైర్యం కాస్తా సన్నగిల్లింది సూర్యారావుకి.



## 10

గుడిసెల ప్రాంతాలకి కొంత దూరంగానే భారతిని దింపేశారు. అప్పటికే ఎండ తీక్షణంగా ఉంది. గుడిసెలలోనుంచి వంట వాసనలు వస్తున్నాయి. ఎక్కడోగాని సందడే లేదు. కూలినాలి చేసుకునేవాళ్ళంతా పనుల్లోకి పోయినట్టుంది. దూరంనుంచి మోహన్ చూపిన గుడిసెలోకి అడుగు పెట్టింది భారతి. అక్క డేముంది? ఖాళీ! ఎదురు చూడని ఈ ఫలితానికి బెదిరిపోయింది. అదరా బాదరాగా ఇవతలికి వచ్చింది. ఈ అలికిడి విని పక్క గుడిసెలోంచి చింకిచీరా, చిందరవందరగా ఉన్న జుట్టుతో ఒకామె బయటికి వచ్చింది.

'అమ్మాయిగారూ!' అంటూ భారతిని కేక వేసింది భారతి వెనక్కి తిరిగి చూసింది. ఇటు రమ్మన్నట్టు సౌంజ్ఞ చేసిం దామె. అదే క్షణంలో భారతికి తోచింది. చుట్టుపక్కల వాకబు చేస్తే ఏమైనా సంగతులు తెలుస్తాయేమోనని. ఆతురతతో పిలుస్తున్న ఆమె దగ్గిరికి వెళ్ళింది.

"నిన్న రాత్రికి రాత్రే గుడిసె ఖాళీ చేసేసి పోయాడు. ఆ పిల్లది ఒకటే గోల. కాని ఈడ్చుకు వెళ్ళిపోయాడు. 'ఈ రెండు ముక్కలు గీకింది కాబోలు,

ఎవరేనా వస్తే ఇవ్వమంది," అంటూ బొడ్డులో దోపిన ఒక కాగితం బయటికి తీసింది.

లాక్కున్నంత త్వరగా ఆ కాగితం అందుకుంది భారతి. ఎంతో నిస్పృహాతో నిండి ఉన్నాయి వ్రాసిన నాల్గు పంక్తులూ - "రాత తప్పించలే రన్నది నేను నిరూపించాను మిస్! నన్ను మరిచిపొండి. అనవసరంగా మీ రంతా బాధలపాలు కావద్దు. అవమానాల పాలు కావద్దు. మోహన్‌తో ఏ విధ మైన ఒప్పందానికీ దిగకండి. అది రెండువిధాలా నష్టం తప్పించి వేరు ఫలితం లేదు. సెలవు. మళ్ళీ కలుస్తా ననుకోను;" సంతకంకూడా లేదు. అది చదువుతూ ఉంటే భారతి కళ్ళని నీటిపొర కప్పివేసింది.

"ఇక్కడ్నుంచి ఎటు వెళ్ళి ఉంటారో కొంచెమేనా చెప్పకలవా?" అడిగింది భారతి.

"ఎక్కడా కొంప చూసినట్టులేదు. అయినా అటేపు పోయారు. వాకబు చెయ్యి," అంటూ పని అయిపోయి నట్లు లోపలికి పోయిం దా మనిషి.

వెనక్కి వెళ్ళి సూర్యానికి చెప్పాలా? ఆమె చూపిన దారివెంట ముందుక్కి సాగాలా? నిర్ణయించుకోలేక తికమక పడింది భారతి. పోలీసులూ బందో బస్తూ కల్పడితే ఏం అఘాయిత్యం చేస్తాడో ఈ మోహన్ అన్న అను మానం రావడంతో ముందుకే సాగి పోయింది భారతి. మురుగు కాల్వలు, పూరిగుడిసెలు దాటుకుంటూ ఎంతో దూరం వెళ్ళింది. ఏ సంఘసేవికో అనుకున్నారుకాబోలు ఎవరూ అంతగా భారతిని పట్టించుకోలేదు! అక్కడక్కడ వాకబు చేస్తూ ముందుకే నడుస్తూంది భారతి.

"ఇక్కడి కెవ రేనా కొత్తగా వచ్చారా?" ఎంద రెందరినో అడిగింది.

ఎవరికి వారే, చెప్తే ఏం గొడవో అన్నట్టు 'తెలీదు' అనేస్తున్నారు. తమకి అనవసరపు శ్రమ అని ఎదుటి వ్యక్తి కష్టసుఖాలని చిన్నమెత్తు కూడా పట్టించుకోరు సామాన్యులు. 'తనను తప్పించి ఊరంత పిడుగు!' అన్నట్టు ఉంటుంది వీరి ధోరణి. చివరికో పదేళ్ల పిల్లని దారిలో ఆపింది భారతి. రేకు డబ్బాతో నీళ్లు పట్టుకు వస్తూం దాపిల్ల. అందరినీ అడిగినట్టే అడిగింది భారతి. బెదురుగా అటూ ఇటూ చూసిం దా పిల్ల. "వాళ్ళు మీకు తెలుసా?" అడిగింది.

"అవును; ఎక్కడున్నారు?"

"ఇంకో నాలుగు గుడిసెలు దాటి ఎడంకి తిరగండి. ఆ పక్క గుడిసెలోకి ఎవరో వచ్చారు." డబ్బా సరిగా సర్దు కుని వెళ్ళిపోయింది పిల్ల.

దడదడలాడుతున్న గుండెలతో ముందుకి సాగింది భారతి. ఎవడో తనని

చూసుకుంటూ దాటిపోయాడు. సందేహం లేదు. అతడు మోహన్. ఆశ చిగురించింది భారతిలో. మళుపు తిరిగేచోట నిలబడ్డాడు మోహన్. అతని తీరు పిచ్చివాని తీరులాగా తోచింది భారతికి.

భారతిని సమీపానికి రానివ్వి, "ఆగండి. ఒక్క అడుగు ముందుకు వేసినా జాగ్రత్త! మీరంతా మర్యాదస్తులు కదూ? గౌరవంగా బ్రతికే వాళ్ళు!" అని కంట్రోల్ లేకుండా నవ్వడం ప్రారంభించాడు మోహన్.

"ప్లీజ్. నన్ను శశిరేఖని చూడనివ్వండి. మీ ఇద్దరికీ ఏమీ ప్రమాదం రాకుండా చూసే పూచీ నాది." ఇంకా ఏదో చెప్పబోయిన భారతి మాటలు మధ్యలోనే ఆపేశాడు మోహన్.

"అందుకే కాబోలు పోలీసు బలగం గూడెం చుట్టూ నిలబెట్టారు. ఒక్క అడుగు ముందుకు వచ్చినా, ఇక మీరూ మాతో పాటే," అని చటుక్కున వెనుదిరిగి గుడిసెలోకి రెండంగల్లో వెళ్లి తడిక తలుపు చేరవేశాడు మోహన్.

భారతి తెగింపు తెచ్చుకొని ముందుకి సాగేలోపలే గుడిసెలోంచి నల్లని పొగలు బయలుదేరాయి. 'శశిరేఖా!' అంటూ అరుస్తూ ముందుకి పరుగెత్తింది భారతి.

బాగా ఎండ ఎక్కి ఉంది. గుడిసెల తాటాకులు గలగల్లాడుతూ ఎండి ఉన్నాయేమో – బుస్సున అంటుకున్నాయి. దట్టమైన పొగతో జన. కేకలతో ఆ ప్రదేశంఅంతా బీభత్సంగా తయారైంది.

## 11

భారతి వెనకనే వస్తున్నాడు సూర్యారావు. దూరంనుంచే భారతిని చూస్తూ నడుస్తున్నాడు. అంటుకొన్న పాకకేసి పరుగుపెట్టాడు. అప్పటికే బాగా మంటలులేచాయి. వీస్తున్న గాలి, మంటలిని విపరీతంగా విస్తరింపచేసింది. గుడిసెముందు బోర్లాపడి ఉంది భారతి.

భారతిని రెండుచేతులా ఎత్తుకుని మంటలకి దూరంగా తీసుకువచ్చాడు సూర్యారావు. పోలీసుల ఈలలతో ఫైరింజనుల చప్పుళ్ళతో పిల్లల ఏడుపులతో, సామానులు రక్షించుకొనే వారి గోలతో – ఆ వాతావరణం నిండిపోయి భయంకరంగా ఉంది.

అంతా సద్దుమణిగేసరికి గూడెం కాస్తా స్మశానంలాగా తయారైంది. ముప్ఫయికి పైగా గుడిసెలు తగలబడి పోయాయి. ఎంతో కష్టంమీద లోపలికి ప్రవేశించిన రక్షకులు శశిరేఖ శరీరాన్ని ఇవతలికి మోసుకువచ్చారు. అది చూసి సూర్యారావు చిన్నపిల్లవాడులాగా గొల్లుమన్నాడు. కాస్సేపటికి మోహన్‌ని కూడా మోసుకువచ్చారు. బాగా కాలి పోయాడు. చూడ్డానికే

భయంకరంగా ఉన్నాడు. కొనవూపిరి ఆడుతూంది.

కాలినవాళ్ళ నందరినీ ఆస్పత్రికి చేర్చారు. శశిరేఖ ఒళ్ళు ఎక్కువగా కాలనేలేదు. 'షాక్‌కి ప్రాణం పోయింది' అని అన్నారు డాక్టర్లు.

మోహన్‌కూడా బ్రతికే అవకాశం లేదన్నారు. మాట్లాడించవచ్చు అని డాక్టర్లు చెప్పగానే పోలీసు లతని చుట్టూ చేరి మరణవాఙ్మూలం వ్రాసుకున్నారు.

"నా తల్లికి జరిగిన అన్యాయానికి పగబట్టాను. ఇంత జరుగుతుందని నేను ఊహించలేదు," అన్నాడట. "అభం శుభం ఎరుగనిదాన్ని ప్రేమించినట్టు నటించి పగసాధించావా?" అంటూ ముఖం కప్పుకు ఏడ్చాడు సూర్యారావు.

"భారతి ఒళ్ళు అక్కడా అక్కడా కొంచెమే దెబ్బతిన్నది. కాని ప్రమాదం ఏంలేదు," అన్నారు. స్పృహ రావడానికే ఒకరోజు పట్టింది.

"నే నన్నదే నిజం అయింది," అని వాపోయారు జమీందారిణి.

"నా కన్నతల్లి కష్టాలు గట్టెక్కాయి. లేకుంటే ఎలా బ్రతకవలసి వచ్చేదో!" అని తన ముద్దులకూతురు మరణంతో పరిష్కారం చూడకలిగా రాయి

భారతికి తెలివి వస్తుందని అలా ఆస్పత్రిలోనే కాచుకుని కూర్చున్నాడు సూర్యారావు.

ఎంతో బాధతో తెరవలేక తెరవలేక తెరచినట్లు కళ్ళు తెరిచింది భారతి. ఎదురుగా ఉన్న సూర్యం ఏదో పొగలోంచి కన్పడ్డట్టు కనపడడంతో ఒక్క కేక వేసింది.

"భారతీ! నేను సూర్యాన్ని. ఇటు చూడు," అని భారతి రెండు చేతులూ పట్టుకొని ఆమెపక్కనే కూర్చున్నాడు.

మెల్లిగా కళ్లు తెరచి చూసింది భారతి.

కళ్ళకింద నల్లని చక్రాలు కమ్మి అలసిన ముఖంతో ఉన్న సూర్యారావుని రెప్పవాల్చకుండా చూసింది.

"శశిరేఖ ఏది?" అడిగింది.

"లేదు, భారతీ! శశిరేఖలేదు. అది చాలా అదృష్టవంతురాలు. ఒళ్ళుకూడా కాలకుండా కన్ను మూసింది. మనల్ని అందరినీ వదిలి వెళ్లిపోయింది భారతీ!" అన్నాడు సూర్యం.

"అమ్మకీ సంగతి చెప్పారా? నన్నెందు కిక్కడ ఉంచారు?" అని అడిగింది.

"నిన్నటినుంచీ నీ కసలు తెలివి రాలేదు. నువ్వుకూడా నన్ను మోసం చేసి వెళ్లిపోతావేమో నని భయపడ్డాను," అంటూ ఆమె గుండెలమీద వాలిపోయాడు సూర్యం.

అలాగే అతని తల నిమురుతూ ఊరుకుంది భారతి.

మోహన్ దొరికాడా?" అడిగింది.

"ఓ అరగంట క్రితమే అతగాడూ పోయాడు."

అలాగే ఉండిపోయింది భారతి. ఇంత దారుణం జరుగుతుందని ఎవరూ ఊహించలేదు. పాపం! శశిరేఖ ఎంత మోసపోయింది.

"నాతో ఎప్పుడేనా చెప్తూ ఉండేది మోహన్ గురించి. అతనిపై ఎంత అనురాగం పెంచుకుందీ అమ్మాయికు రాలు. 'అతనివేళ్లు చిత్రకారుని వేళ్ళ లాగా ఉంటాయి' అనేది; అతని మాటల్లో తేనెలు, చూపులలో పూల వానలే చూసిందిగాని, పిచ్చిది, అతని హృదయంలో కల్మషం గుర్తించలేక పోయింది." సగం స్వగతంగా మాట్లాడు కుంటున్న భారతిని వద్దని వారించాడు సూర్యం.

"వద్దు భారతీ! అవేవీ జ్ఞాపకం చేసి కోకు. అవన్నీ మరిచిపో. నీ ఆరోగ్యం దెబ్బతినకుండా చూసుకోవాలి," అన్నాడు.

"నాకేం రాదు. నేనూ చాలా మొండిదాన్నే," అంది భారతి.

"నువ్వు మొండివికాదు. లోకం పోకడ తెలిసినదానివి. నిన్ని సాయం త్రమే ఇంటికి తీసుకు వెళ్ళమన్నారు డాక్టరు;" ఆమెతల నిమురుతూ చెప్పాడు సూర్యం.

అలాగే సాయంత్రం అవగానే భారతిని తీసుకువెళ్ళడానికి వచ్చాడు. "ఇంటికి వెళ్లి అమ్మగారి ముఖం ఎలా చూడను?" 'మీ శశిని మీకు అప్పగించి తీరుతాం' అన్నా నే;" దుఃఖంతో పూడుకుపోతున్న కంఠంతో అంది భారతి.

"అమ్మ నీకంటే ధైర్యంగానే ఉంది భారతీ. శశి తిరిగి అత్తలాగా తయారౌతుందేమో అని బెంగపడి పోయింది అమ్మ," అన్నాడు సూర్యారావు

స్మశానంలోని ప్రశాంతత లాంటిది ఆవరించుకొంది జమీందారుగారి భవంతిలో. ఏళ్ళ తరబడి పెరిగిన ఆందోళన చేత్తో తీసివేసినట్టు సమసి పోవడంతో అందరిలోనూ ఒక రకమైన నిస్త్రాణ అలముకొంది.

## 12

ఇంటికి వెళ్ళిన నాల్గురోజులు నాల్గు యుగాలుగా గడిపింది భారతి. ఇటు సూర్యం ముఖం, అటు అమ్మగారి ముఖం చూడలేకుండా ఉంది. ఒకనాటి మధ్యాహ్నం నిశ్శబ్దంగా కూర్చుని పెట్టె సర్దుకోవడం ప్రారంభించింది. ఇక్కడ తన కింకేంపని? స్కూలుకి తిరిగి వెళ్ళిపోవాలని భారతి ఉద్దేశ్యం. తెరచిఉన్న పెట్టెముందు కూర్చుని ముసురుతున్న ఆలోచనలని తరువాత తరుముతూంది భారతి.

"ఏం చేస్తున్నావు భారతీ?" లోపలికి వచ్చారు జమీందారిణి. ఉలిక్కి

పడింది భారతి. తెరచిఉన్న పెట్టె గభాలున మూసింది.

"ఏం లేదమ్మా, పెట్టె సర్దుతున్నాను. నాకు శలవులు అయిపోయాయి కదా!" అంది.

"ఇం కెక్కడికి వెడతావమ్మా నన్ను వదిలి?" అన్నా రామె దగ్గరగా ఉన్న కుర్చీలో కూర్చుంటూ. 'ఇలా రా' అంటూ చేయి జాపి పిలిచారు.

లేచివెళ్ళి ఆమె దగ్గరగా క్రింద కూర్చుంది భారతి. భారతి తల నిమురుతూ కొంచెం సేపు ఏమీ మాట్లాడలే దామె.

"నే వెళ్ళిపోవాలమ్మా. ఈ పరిసరాల్లో ప్రశాంతంగా బ్రతకలేను. నా కా స్కూల్లోనే శాంతి లభిస్తుంది," అంది భారతి.

వస్తూన్న దుఃఖాన్ని ఆపుకోడానికి ప్రయత్నించింది.

"నేను శశితో స్నేహితురాలిగా వచ్చాను. అంతా సంతోషంగా ఉంటే మీ సేవ చేసుకుంటూ ఈ ఇంట్లో కొంచెం స్థలం చూసుకుందా మనుకున్నాను. కలలు కన్నాను. శశిరేఖతో పాటే నా స్వాప్నికసౌధాలు కూడా పేకమేడల్లాగా కూలపోయాయి. నన్ను వెళ్ళనివ్వండి," అంది ఆమె వడిలో తల దాచుకుంటూ.

"నీ అశాంతి నాకు అర్థం అవుతుందమ్మా. శశిరేఖ నీలో ఒక అపనమ్మకాన్ని లేవతీసింది. నిన్ను పూర్తిగా నమ్మేలా ప్రవర్తించి, పూర్తిగా మోసం చేసింది. వెర్రితల్లి! తనని తనే మోసం చేసుకుంటున్నా నన్న సత్యం గ్రహించలేపోయింది. దాని కా గుడ్డి ప్రేమలో ఉచితానుచితాలు తెలియలేదు. నిషేధించాం కనుక చేసితీరాలనుకుంది. చూడు భారతీ! 'ఇది వెల్గుబాట, ఇటు నడు' అని చెప్తాం. 'ఏం? అటెందుకు వెళ్ళకూడదు?' అని వెడితే ఏం చేయగలం చెప్పు? నువ్వు దాన్ని గురించి బెంగపడకు. నిజంగా దాన్ని మరణమే వెల్గులోకి పంపింది. నువ్వే ఉండే సూర్యానికి వెలుగు లేకుండా చేస్తావా?" అన్నారు.

మాతృప్రేమ నెరుగని భారతి కీ మాటలలోని ఆప్యాయత భరింపరాని ఆవేదన రేకెత్తించింది. ఆమె వడిలోనే అలాగే పడుకుని శోష వచ్చేదాకా ఏడ్చింది. మారుమటాడకుండా అలాగే కూర్చున్నా రామె.

'ఇక్కడా ఉన్నావు?' అంటూ లోపలికి వచ్చాడు సూర్యారావు.

"నాయనా, ఈరోజు మధ్యాహ్నం శాస్త్రుల్లుగారిని రమ్మన్నానని కబురు పంపు. పదిరోజులూ కాగానే ఏ ఆడంబరం లేకుండా మీ వివాహం జరిపిస్తాను," అన్నారు.

"అంత తొందరెందుకమ్మా?" అన్నాడు సూర్యం.



"కాకుంటే పరాయిపిల్ల మనింట్లో ఎన్నాళ్ళుంటుందిరా?" అడిగారామె.

పడ్చిపడ్చి ఉబ్బినకళ్ళు పైకెత్తి ఆమె ముఖంలోకి చూసింది భారతి – 'నన్ను అట్టేపెట్టడాని కిదొక్కటే మార్గమా?' అన్నట్టు.

"నాకు పనుంది. చాలాసేపయి భారతి కనబడకపోతే ఇలా వచ్చాను. చూడు సూర్యం. భారతిపెట్టె సర్దుకుంటూంది – వద్దని నచ్చచెప్పు,"

అంటూ లేచి వెళ్ళిపోతున్న తల్లికేసీ, అలాగే బొమ్మలాగా కూర్చున్న భారతికేసీ క్షణంసేపు విస్తుపోయి చూశాడు సూర్యారావు. చేతు లందించి భారతిని లేవదీశాడు; తన కౌగిట చేర్చుకొన్నాడు.

"ఇంత విషాదాన్ని నా ఒక్కడి మీదాపెట్టి వెళ్ళిపోదామనా?" అడిగాడు......

కన్నెపిల్ల కర్మ కేమంత గోడ

వుంటుంది! జమీందారీ కుటుంబమే అయినా అన్నీ సాధారణంగా జరిపించారు సూర్యారావుతల్లి...

కాలం శీఘ్రగతిని పరుగు పెడుతూంది పడి లేచేవారికోసం, సేద తీర్చుకోవాలని ఆగేవారికోసం కాలం ఆగుతుందా? ఆగదు. శాస్త్రుర్లుగారు చెప్పిన ముహూర్తానికి సూర్యారావుకీ భారతికీ దేవాలయంలో వివాహం జరిపించారు జమీందారిణి.

"మ వ్వీ ఇంటి దీపానివి. ను వ్వుంటేనే ఈ ఇంట వెల్గు. ఇది జ్ఞాపకం పెట్టకో భారతీ," అని సూటిగా ఒక్క మాటలో కోడలి బాధ్యతని తెలియ చెప్పారు సూర్యం తల్లి. "నేను ఇల్లు బాగులు చేయిస్తాను. మీ రిద్దరూ పట్నంలో పదిరోజులు తిరిగిరండి," అన్నారు...

పట్నం బయలుదేరేముందు అత్తగారికి పాదాభివందనం చేసింది భారతి. ప్రేమతో లేవనెత్తి అక్కున చేర్చుకొన్నారు. "హాయిగా వర్ధిల్లు తల్లీ," అంటూ దీవించారు.

కారు బయలుదేరబోతూంటే "ఒరేయ్ సూర్యం, ఇన్నాళ్ళు ఆగినందుకు నీవు అదృష్టవంతుడివి వాయనా! భారతిలాంటి భార్య వెతికితే దొరుకుతుందా? అంతా ఘటన!" అన్నారు.

కారు బయలుదేరింది.

పక్క కూర్చున్న భారతి సూర్యం ముఖంలోకే చూస్తూంది. అతని చూపు మటుకు రోడ్డుమీదే ఉంది.

"దారిలో స్కూలుకి వెళ్ళి చూద్దామా?" అడిగింది భారతి. పక్కకు తిరిగి సన్నగా నవ్వాడు సూర్యం.

"ఏం, ఎందుకూ? మొన్ననే నేను ఉత్తరం పంపాను. కొన్నాళ్ళపాటు నువ్వు రాలేవని."

ఆ మాటకు నవ్వుకుంది భారతి. "అంటే?" అంది అర్థం కానట్టు.

"ఏమో భారతీ! 'నాకు ఏమీ తోచడంలేదు. వెళ్ళి పిల్లలకు పాఠాలు చెప్పుకుంటాను అంటే?'... అందుకే ఎందుకేనా మంచిదని అలా వ్రాశాను," అన్నాడు సూర్యారావు.

ఎప్పుడూ అలా అనవద్దు. మనిద్దరం ఉండగా నాకు తోచకపోవడం ఏమిటి?" చిరుకోపం నటిస్తూ అంది భారతి.

కాస్సేపు కారులో మౌనం తాండవ మాడింది.

"ఇలా మౌనవ్రతం పట్టి కూర్చుంటే నాకుమట్టుకు ఏం తోస్తుంది భారతీ!" స్టీరింగు మీద ఒకచెయ్యితీసి భారతి చెయ్యి అందుకున్నాడు సూర్యారావు.

నీరెండకూడా పోయింది. చిరు చీకటులు కూడా అలుముకోకుండా తరిమికొట్టే పున్నమి వెన్నల పరచు

కుంటూంది లోకంపై. ప్రశాంతంగా ఉన్న రోడ్డువెంట నెమ్మదిగా కారు సాగుతూంది. చల్లనిగాలి కూడా వీస్తూంది.

ప్రశాంతంగా ఉన్న రోడ్డువార ఒక చెట్టుక్రింద కారు ఆపాడు సూర్యారావు. తన జీవితాంత ప్రేమని మాటలలో చెప్పి, తన ప్రేయసికి బహూకరించడానికి తగినస్థలం ఇదే అనుకున్నాడు.

అతని ఊహలను గ్రహించింది భారతి. సిగ్గుతో తల వంచినా మెరిసే కన్నుకొసలతో ఆసక్తితో సూర్యం కేసి చూసింది.

"ఇక మనం ఒకటి," అన్నాడు సూర్యారావు. "ఇన్ని యుగాలు నువ్వెక్కడ ఉన్నావు?'' అన్నాడు.

"ఇవన్నీ ఇప్పుడు ఎవరు అడగమన్నారు?" చిలిపిగా అడిగింది భారతి.

"అదిగో అటు చూడు," అంటూ అప్పుడే పైకి వస్తూ కమిలినట్టున్న ఎర్రని చంద్రుణ్ణి చూపెట్టాడు సూర్యారావు.

ఆ చూపుతున్న చేతినే మళ్లించి భారతిని తన కౌగిట చేర్చుకున్నాడు.

అంత సంతోష సమయంలోనూ దుఃఖం వచ్చింది భారతికి.

"ఎందుకూ?" అన్నాడు.

"ఏం లేదు. ఈ ఆనందం, ఈ వెల్గూ అన్నీ నాకు దడపుట్టిస్తున్నాయి," అంది తన ముఖం అతని గుండెల్లో దాచుకుంటూ.

"పోదాం పద," అంటూ కారు స్టార్టు చేశాడు సూర్యం. వెలుగుబాట వెంట కారు పోసాగింది.






సెలవుల్లో నేను యింటికి వచ్చినట్టు కబురు చేశాక ఒకరోజు ఎలాగో తీరిక చేసుకుని నన్ను చూసిపోవటానికి వచ్చాడు శేషుమామయ్య. వెంట సినిమా పత్రికలూ, ఘాటు ప్రేమ కథలూ, డిటెక్టివ్ నవలలూ తెచ్చుకున్నాడు. ఆరోజు-ఆయన మా ఇంట్లో గడిపే కొన్ని గంటల వ్యవధిలోనూ చదువుకోవటానికి ఆ పుస్తకా లన్నీను.

అవి చూచి నే నేం ఆశ్చర్యపడలేదు, యిటీవల కొన్ని సంవత్సరాలుగా ఆయనలో వస్తున్న మార్పుని గమనిస్తున్నవా ణ్నవటంచేత.

ఆయన మా యింట్లో వుండేది ఆ సాయంత్రంవరకే. ముక్కోటి దేవతలు దిగివచ్చి నిర్బంధం చేసినా రాత్రికి వుండడు. అంచేత, దిద్దవలసిన యూనివర్సిటీ పేపర్లన్నీ ఒక పక్కకి నెట్టి

ఆయనతో కబుర్లలోకి దిగాను. మా యింట్లో మిగతావాళ్ళందరికన్నా నాతో ఎక్కువ చనువుగా వుంటాడు మామయ్య.

"నడిచే వచ్చావా?" అన్నాను.

"ఆఁ."

"షష్టిపూర్తి దాటినా చేవ తగ్గ లేదు మనిషికి," అన్నాను.

మామయ్య నవ్వాడు.

శేషుమామయ్య వుండేవూరు మా వూరికి నాలుగు మైళ్ళ దూరంలో వుంది. బస్సుల్లో వస్తే పావుగంట ప్రయాణం. కాని శేషుమామయ్య ఎప్పుడూ పొలాల్లోంచి అడ్డదారిని నడిచే వస్తుంటాడు. పూర్వపురోజుల్లో నయితే అలా వచ్చినప్పుడల్లా దారిలో తోటల్లోని మల్లెపూలూ, చేమంతులూ కోసుకువచ్చేవాడు, ఇంట్లో ఆడవాళ్లు తల్లో పెట్టుకుంటారని. ఇప్పు డదేమీ లేదు. పునుగు జవ్వాదులు మిలా యించి తీర్చిన సన్నని నామం పెళపెళ లాడుతూండగా, సిల్కు కండువా మడతలు రెపరెప లాడుతూండగా దొరలాగ నడిచివస్తాడు. అప్పటికీ ఒకొ్కక్కసారి చెల్లాయి అడగనే అడుగతుంది వుండబట్టలేక.

"అలా చేతులు తిప్పుకుంటూ రాక పోతే తోటల్లోవి కాసిన పూలైనా కోసుకురావచ్చుగదా!" అని.

"వాళ్ళంతా కష్టపడి, తోటలు పెంచుతున్నది నీకు పూలు సప్లయి చేసేందుకే పాపం..."

"నాకు కాకపోతే మరో నాగ రత్నమ్మకైనా మరిచిపోకుండా సప్లయి చేస్తారుగా?" అంటుంది చెల్లాయి. శేషుమామయ్య తిరిగి వెళ్ళే టప్పుడు తప్పనిసరిగా పూలు కోసు కెళ్ళటాన్ని గుర్తు చేస్తూ.

"నీకు పొగరెక్కువ..." అంటాడు మామయ్య.

శేషుమామయ్యతో మాకు చెప్పుకో దగ్గ బంధుత్వ మేమీ లేకపోయినా, దాన్ని మించిన ఆత్మీయత వుంది. మేము తప్ప ఆయనకు నా అన్నవా ళ్ళెవరూ లేరు. ఆయన ఎప్పుడో తన చిన్నతనంలో వచ్చి ఆ వూళ్ళో చేరాడు. చేరినప్పట్నుంచీ నలుగుర్నీ మంచి చేసుకుని అక్కడే స్థిరపడ్డాడు. ఊరి చివర వున్న ఓ పాడుబడ్డ విష్ణ్వాల యాన్ని బాగు చేయించి, వూళ్ళో చందాలు వసూలు చేసి, ఆ డబ్బుతో తిరిగి విగ్రహప్రతిష్ట చేయించి, ఆరోజు నుంచీ నిత్యదీపారాధన ప్రారంభిం చాడు. అది చూచి వూళ్ళోవాళ్ళు కూడా భక్తిప్రపత్తులు కలిగినవారై తరచుగా అంతో యింతో దేవుడి కైంకర్యానికి సమర్పించుకుంటూ వచ్చారు. రోజులు గడిచేకొద్దీ వాళ్ళ ఆదరణతో మామయ్య ఆ వూళ్ళో ఓ చిన్న కుటీరం, భూమీ పుట్రా ఏర్పరచు

కున్నాడు. ఎలాంటి సంసార బంధములూ లేకుండా పూర్తిగా భగవంతుడి మీదే దృష్టి కేంద్రీకరించాలన్న దృఢ సంకల్పాన్ని అందరికీ వెల్లడించాడు.

అందుకే మామయ్య పెళ్ళి చేసుకోలేదు. ఆ వూరికివచ్చి చేరిన కొత్తల్లోనే, అంటే దాదాపు నలభై యేళ్ళ కిందట, మామయ్య మా నాన్నతో పరిచయం చేసుకుని ఆయనవద్ద కొంచెం వేదమూ, సంస్కృతమూ, పంచ కావ్యాలూ నేర్చుకున్నాడు. ఆయనకూ నాన్నకూ వయసులో ఎక్కువ తేడా లేదు; నాన్న ఆయనకన్నా ఒకటి రెండేళ్ళు పెద్దవాడు. అప్పట్లో తరచుగా మా యింటికి రాకపోకలు జరుపుతూండడంతో మామయ్యకు మా కుటుంబంతో ఎక్కువ సాన్నిహిత్యం ఏర్పడింది. ఆ తర్వాతనే మా అన్న తమ్ములూ, అక్క చెల్లెళ్ళూ అందరం పుట్టామట. మేము పెరిగి జ్ఞానం తెచ్చుకునేనాటికే మామయ్య మా కుటుంబంలో ఒకడై పోయాడు. ఆయనను మొట్టమొదట మాలో ఎవరు 'మామయ్యా' అని పిలిచారో గాని, ఆయనతో మాకు అదే వరస సరిపడి పోయింది. తమాషా ఏమిటంటే, ఆయన మాకు మాత్రమే కాదు, మా యింటి అల్లుళ్ళకూ, కోడళ్ళకూ, వాళ్ళ పిల్లలకూ, మిగతా వచ్చిపోయే బంధువులకూ అందరికీ మామయ్యే.

తనకన్నా కొంచెం పెద్దవాడవటం వల్లా, ఆయనవద్ద తను అంతో యింతో చదువుకుని వుండటం వల్లా, మా నాన్నపట్ల మాత్రం మామయ్యకు కాస్త భయం, గౌరవం వున్నాయి. మిగతా ఎవరంటేనూ ఆనూయనకు లక్ష్యంలేదు. అమ్మ ఆయనకన్నా వయసులో చిన్నట – అంచేత ఆమెను 'చెల్లమ్మా' అని పిలుస్తాడు. వచ్చినప్పుడల్లా ఆమెకు వంటలో సాయం చేస్తాడు; కూరలు తరుగుతాడు; పప్పు రుబ్బి పెడతాడు. ఇంటిల్లిపాదీ భోజనాలకు కూచున్నాక తను అందరికీ ఒక వరస వడ్డించి మరీ కూచుంటాడు. అమ్మకు వంటలో సాయం చెయ్యకుండా నవలలు చేతపట్టుక్కూచుంటుందని అక్కయ్యను కేకలేస్తాడు. మాలో ఎవరైనా ఏదైనా జవాబు చెప్పబోతే, "నా కళ్ళముందు పుట్టిన కుంకలు, మీరా నాకు చెప్పేది?" అంటూ దబాయిస్తాడు.

ఇప్పుడయితే కాలేజీ వుద్యోగంతో తీరిక దొరక్కుండా పోతోంది కానీ, నేను చిన్నప్పటినుంచీ కాలేజీ చదువు పూర్తి చేసేవరకూ ఎప్పుడూ శేషు మామయ్యను వెన్నంటి వుండేవాణ్ని. చీటికి మాటికీ ఏదో వంకతో వాళ్ళ వూరికి వెళ్ళేవాణ్ని. మామయ్య మంచి భోక్త. ఆవకాయీ, పేరిన నెయ్యీ, తోడు పెరుగూ లేకుండా




ముద్ద ఎత్తాడు. నేను వెళ్ళినప్పుడు మాత్రం, 'కుర్రకుంక' పట్టి ఆవకాయ భరాయించలేడని, ముద్దపప్పు వండే వాడు. ఇద్దరం కలిసి భోంచేశాక, కుటీరం పంచలో దర్భచాపమీద కూచుని నాకు కథలు చెప్పేవాడు. అవన్నీ గాఢశృంగారరసంతో నిండినవే.

ఇప్పుడాలోచిస్తే, ఆ రోజుల్లో మామయ్య యింట్లోవున్న ఆవకాయి, తోడు పెరుగు కోసం నేనెంత అవసరంగా వెళ్ళేవాడినో, నేను కూడా మామయ్యకు అంత అవసరంగా వుండే వాడి ననిపిస్తోంది. ఆయన చెప్పే కథలు వినటంద్వారా నేను ఆయనలో నిక్షిప్తమై, నిద్రాణమై అణగివున్న శృంగార భావవీచికల కొక మార్గం కల్పించాను. ఎందుకంటే ఆయన ఆ కథలు చెప్పేది నాకొక్కడికే. మిగతా యావన్మందికీ మహాభక్తవిజయంలోని కథలు చెప్పేవాడు. మనిషి కొంచెం సంగీతగాడు. పగలూ, రాత్రీ భోజనా నంతరం రాగయుక్తంగా పురాణం చెప్పేవాడు. ఊళ్ళోని కొంతమంది ఆడవాళ్ళూ మగవాళ్ళూ వినటానికి వచ్చేవాళ్ళు. బయట నలుగురిలో వున్నప్పుడు ఆయన ఒక్క క్షణకాలం మౌనంగా వుండటం నేను చూడలేదు. జనాంతికంగా భగవద్గీత శ్లోకాలో, భాగవతం పద్యాలో వల్లించుతూ వుండేవాడు. ఎప్పుడేనా పండగో, పబ్బమో అయి, మా యింటికి వచ్చి, రెండుమూడు రోజులపాటు వుండ వలసివచ్చినప్పుడు వెంట ఏ భాగవతమో, రంగనాథ రామాయణమో

తెచ్చుకుని రాత్రిళ్ళు గొంతెత్తి చదువుతుండేవాడు. ఈ విషయంలో ఒకసారి ఆయన అన్నయ్యతో ఘర్షణపడి అలిగి పోవటం నా కింకా గుర్తుంది. బి. ఏ. పరీక్షను పార్టులు పార్టులుగా విడగొట్టి సెప్టెంబరుకు తయారవుతున్న అన్నయ్య రాత్రి టీ తాగి తన గదిలో పుస్తకాలతో తల బద్దలుకొట్టుకుంటుంటే, పక్కనే వరండాలో మామయ్య కంచుకంఠంతో రుక్మిణీ కల్యాణం హోరెత్తి పోతోంది. (రుక్మిణీ కల్యాణంఅంటే మామయ్యకు ప్రత్యేకాభిమానం - శ్రీ కృష్ణుడిలా సాహసించగలవాడీనాటి ప్రేమికుల్లో ఒక్కడూ లేడని మామయ్య చాలా సార్లు నా ముందు నొచ్చుకున్నాడు) ఆ దగ్గర్లోనే పడుకున్న మా కెవ్వరికీ నిద్రలేదు. అర్ధరాత్రిదాకా చూసిన అన్నయ్య యిక భరించలేక గదిలోంచి బయటికి దూసుకొచ్చి బుసలుకొట్టాడు: "అర్ధరాత్రి వేళ నీ అంకమ్మ శివాలేమిటి?" అంటూ.

మామయ్య తను మామూలుగా మా అందరినీ కేకలేసే ధోరణిలో అన్నయ్యను నోరు మూసుకోమని అన్నాడు గాని, అన్నయ్య మూసుకోలేదు. "నా కిప్పుడు కావలసింది రుక్మిణీ కల్యాణం కాదు, గజేంద్ర మోక్షం," అని ఆక్రోశించాడు, పరీక్షలనే మొసలి నోట్లో చిక్కుకున్న గజేంద్రుడిలా అన్నయ్య.

అప్పటికి అన్నయ్యది నిజమైన కోపమేనని గుర్తించిన మామయ్య, పురాణ ధోరణిలోనే అన్నయ్యకు జవాబిచ్చాడు: "కాలేజీలో గీసురు బాసురుమని నాలు గింగ్లీషుముక్కలు చదువుకునే కుర్రకుంకవి నీకు భాగవతం మజా ఏం తెలుస్తుంది? కల్యాణాత్మకమైన విష్ణుకథ లాకర్ణించుచున్ ముక్తుడై కల్యుం డెవ్వడుముక్తుడే..."

దాంతో అన్నయ్య పేట్రేగిపోయి ఘాటుగా మాట్లాడటమూ, మామయ్యకూడా మరింత ఘాటుగా జవాబు చెప్పటమూ జరిగింది. వాళ్ళిద్దరూ అలా పోట్లాడుకుంటుంటే నాన్న కలిగించుకుని యిద్దర్నీ కేకలేశాడు. మామయ్యతో, "పోనీ నువ్వు కాస్త మెల్లగా చదవకూడదట్రా? ఇక్కడ వినేవాళ్ళెవరూ లేరుగా?" అన్నాడు. ఆ ఒక్క మాటతో మామయ్యకు కోపం వచ్చి, కొడుకు పక్షం చేరి మాట్లాడుతున్నా డని నాన్నమీద అలిగి ఆ రాత్రికి రాత్రే పొలాలమ్మట నడిచి వాళ్ళ వూరెళ్ళిపోయాడు. ఆ మర్నాడు యింట్లో అమ్మా, అక్కయ్యా వాళ్ళంతా మామయ్య అలా అలిగిపోయినందుకు బాధపడుతోంటే నాన్న అన్నాడు: "వాడికి వేపకాయంత వెర్రి వుంది. అది వదిలిపోయాక వాడే వస్తాడు. రాకపోతే అప్పుడు చూద్దాం..." ఆయన అన్నట్టే

మూడోనాటికల్లా మళ్ళీ తయారు శేషుమామయ్య, పూలూ, కూర గాయలూ తీసుకుని.

ఇది జరిగి దాదాపు పదిహేనేళ్ళు ఐంది. చెప్పవచ్చిందేమిటంటే అప్పటికే పరమ భాగవతోత్తముడుగా, మహా పౌరాణికుడుగా మామయ్య కీర్తి చుట్టుపట్ల గ్రామాల్లో వ్యాపించింది. ఆయా గ్రామాల్లోంచి తరచుగా ఒకచోట పురాణం చెప్పటానికనీ, మరోచోట తిరునాళ్ళప్పుడు దేవాలయాల్లో పూజా పునస్కారాలు చేయించటానికనీ మామయ్యకు పిలుపులు వచ్చేవి. వెళ్ళినచోటల్లా మంచి సంభావనలు గిట్టేవి.

ఆ తరువాత నాలుగైదేళ్ళు గడిచాక నేను కాలేజీ చదువులకు బస్తీకి వెళ్ళాను. ప్రతిసారీ సెలవుల్లో యింటికి వచ్చేవాణ్ణి. నేను వచ్చినప్పుడల్లా నన్ను చూడటానికి వచ్చి రెండుపూటలుండి వెళ్ళేవాడు మామయ్య. కాని బి.ఏ. ఫైనలియర్ చదువుతున్నప్పుడు మాత్రం పబ్లిక్ పరీక్షల గొడవలో పడి వుండటంవల్ల నేను దసరా సెలవుల్లోనూ, సంక్రాంతి సెలవుల్లోనూ యింటికి రావటం పడలేదు. అంటే, వేసవి సెలవుల అనంతరం కాలేజీలు తీసినప్పుడు బస్తీకి వెళ్ళినవాణ్ణి తిరిగి సంవత్సరానికి పరీక్షలు రాసి వేసవి సెలవుల్లో యింటికి వచ్చాను. వచ్చేసరికి మామయ్య జీవితం ఓ కొత్త మలుపు తిరిగింది.

ప్రతీసారీ నేను యింటికి వచ్చానని తెలియగానే మర్నాడే నన్ను చూడటానికి వచ్చే మామయ్య అప్పుడు వారం రోజుల తర్వాత వచ్చాడు; అదీ నేను కబురు చేశాక. పొద్దున్నే వచ్చి ఆ సాయంత్రమే తిరిగి ప్రయాణం కట్టాడు, ఏవో అర్జంటు పనులున్నాయని. ఆ రాత్రికి నిలవమని ఆయన్ని బలవంతం చేస్తున్న నన్ను పక్కకు పిలిచి అన్నయ్య అన్నాడు:

"నువ్వు లక్ష రూపాయలిచ్చినా ఆయన ఆగడురా అబ్బాయ్! అక్కడ వాళ్ళో అయస్కాంతం లాగుతుంటుంది."

"ఎవరా అయస్కాంతం?"

"నాగరత్నమ్మ.''

మామయ్య వెళ్ళిపోయాక అన్నయ్య టూకీగా అసలు విషయం చెప్పాడు. మామయ్య తన కుటీరంలో రోజూ పురాణం చెప్పేటప్పుడు విని తరించటానికి వచ్చే భక్తబృందంలో ఒక నాగరత్నమ్మ వుంది. ఆవిడ పెళ్ళయినాక కొద్దిరోజులకే కొన్ని అనివార్య కారణాలవల్ల భర్తను వదిలిపెట్టివచ్చి మామయ్య వుండేవూళ్ళో తన పుట్టింట వుంటోంది. నాగరత్నమ్మ పురాణం వినటానికి రావటం మొదలుపెట్టినప్పట్నుంచీ మామయ్యలో పొడసూ

పిన మార్పు నే నింతకుముందే గమనించాను. ఆయన అంతకుముందు ఎక్కువగా చదువుతున్న రంగనాథ రామాయణం, భక్తవిజయం లాంటి వన్నీ పక్కకి తోసేసి, అప్పట్నుంచీ నిత్యమూ వట్టి భాగవతాన్నే చదివే వాడు. ముఖ్యంగా శ్రీకృష్ణులవారి రాసక్రీడల్ని మైమరచి గానం చేస్తూ అందులోని భక్తి శృంగారతత్వాన్ని ఎంతో రసావేశంతో నాగరత్నమ్మకు వివరించేవాడు. ఫలితంగా ఆవిడకూడా ఆ తత్వ మేదో తరచిచూడా లన్న ఆసక్తి కలిగినదై ఇటీవల కొద్ది రోజుల్నుంచీ మామయ్యకు శిష్యరికం చేస్తూ, ఆయనద్వారా చాలా కొత్త విషయాలు నేర్చుకుంటోంది.

నాగరత్నమ్మ నా మనసులో మెదిలింది. బర్మాముడీ, ధగధగా మెరిసే వజ్రాల కమ్మలూ, నుదుటిపై సన్నని పొడవైన కస్తూరి బొట్టూ, చేతిలో ఫలపుష్పాదులతో నిండిన పళ్ళెం ... నేను నిరుడు రెండు మూడు సార్లు సెలవుల్లో మామయ్య యింటికి వెళ్ళినప్పుడు పురాణ కాలక్షేపంలో ఆవిణ్ని చూశాను. మామయ్యను ఉత్తేజపరచే అంశ మేదో ఆవిడలో వుందని ఆనాడే అనిపించింది నాకు... భేష్, మామయ్య భక్తితత్వానికి ఆవిడ శృంగారపు మెరుగులు దిద్దుతున్నదన్నమాట! కాని యీ విషయము మా యింట్లో మిగతావాళ్ళందరికీ కలిగించినంత ఆశ్చర్యం నాకు కలిగించలేదు. ఆయన చెప్పే కథలూ, కబుర్లూ ఎన్నో విన్నవాడినవటంవల్ల. ఎప్పుడో ఒకనాడు ఆయనలో నిజయదేవుడో, విప్రనారాయణుడో యిలా హఠాత్తుగా బయటపడకుండా వుండడని నే ననుకుంటూనే వచ్చాను.

క్రమేపీ మామయ్య జీవితంలో ఆ శృంగారమే ప్రధానరసముగా, భక్తి కేవలం అంగంగా పరిణమించింది. లక్ష్యం నెరవేరగానే ఆగిపోయే వుద్యమంలాగా పురాణశ్రవణం మూలబడిపోయింది. విష్ణ్వాలయం పూజ మాత్రం యిక తప్పదన్నట్టు ఏదో తూతూ మంత్రంగా జరుపుతున్నాడు, కైంకర్యపు భూమిల్ని అనుభవిస్తూ వుండటం వల్ల. కాని అంతకుముందే పరమ భాగవతోత్తముడుగా చుట్టుపట్ల గ్రామాల్లో ఆయన సంపాయించిన కీర్తి కేమీ లోటు రాలేదు. ఇప్పటికీ మామయ్య ఆయా గ్రామాలకు పూజలకనీ, పురాణాలకనీ వెళ్ళుతునే వున్నాడు. సంభావనలు తెచ్చుకుంటూనే వున్నాడు. కాని మునుపు వాళ్ళు ఎంత యిస్తే అంత తీసుకునేవాడు యిప్పుడు 'ఇంత' అని అడిగి బేరమాడి మరీ తెచ్చుకుంటున్నాడనీ, అలా వచ్చిందంతా జాగ్రత్త చేసి, దాన్ని నాగరత్నమ్మ వస్త్రాభరణాల







నిమిత్తం వినియోగిస్తున్నాడనీవినికిడి.

మునుపు మామయ్య నాలుగు రోజులకో మారు మా యింటికి వచ్చేవాడు. అది కాక, యింట్లో ఏ చిన్న పండుగ వచ్చినా, శుభకార్యం జరిగినా మామయ్య కనీసం ఒక్కరోజైనా ముందుగా రావలసిందే. అలా రావటం ఆయన మరిచిపోతే నాన్న కబురు చేసి మరీ రప్పించేవాడు. ఒక్కొక్కసారి అలా వచ్చి రోజుల తరబడి వుండిపోయేవాడు మామయ్య. ఇప్పుడదంతా మారిపోయింది. నాగరత్నమ్మ సాహచర్యంతో గడుపవలసిన అమూల్య క్షణాలను ఇతరత్రా గడపటం అవివేక మనుకున్నాడేమో, ఎప్పుడో కాని మా వూరికి రావటం లేదు. వచ్చినా మళ్ళీ ఆ రోజే ప్రయాణం. ఆ రోజు వుండిపొమ్మని పొరబాటున అన్నామా, ''మీ కేం తెలుసు? అక్కడ యింటిదగ్గర కొంపలు మునిగిపోతుంటేను...'' అని విసుక్కుంటాడు. పూర్వం ఆయన మా వూరికి వచ్చేటప్పుడు వెంట ఏ రామాయణమో, భగవద్గీతో తెచ్చుకునేవాడు. ఇప్పుడసలు రావడమే అరుదు; వచ్చినా వుండేది కొన్ని గంటలపాటే; ఆ కాసేపట్లోనూ చదివేది ఘాటు ప్రేమ కథలూ, సినిమా పత్రికలూ వగైరా.

మామయ్య మచ్చలేని అఖండ భక్తుడుగా వెలుగొందిన రోజుల్లో అయనకు చుట్టుపట్ల గ్రామాల్లో ఏర్పడ్డ శిష్యబృందంలో ఈశ్వరమ్మ అనే వృద్ధ భక్తురాలొకావిడ వుంది. మంచి గౌరవమైన, సంపన్నమైన కుటుంబం

లోంచి వచ్చిన ఈశ్వరమ్మ మర్యాదా, మన్ననా తెలిసిన మనిషి. వాళ్ళ కుటుంబానికి ఆవిడే పెద్ద. చిరకాలంగా ఆవిడకు మా నాన్నంటేనూ, ఆయన ద్వారా మామయ్యంటేనూ ఎనలేని భక్తివిశ్వాసా లున్నాయి. మామయ్య తరచుగా వాళ్ళ యింటికి కూడా పూజలకనీ, పురాణాలకనీ వెళ్ళివస్తూం డటం కద్దు. మొన్న సంక్రాంతి సెల వుల్లో నేను యింటికి వచ్చినప్పుడు ఆయన ఈశ్వరమ్మ భక్తిని గురించీ, ఆవిడె వాళ్ళ వూళ్ళో కట్టిస్తోన్న రామమందిరం గురించీ, ఆ మందిరంలో పూజ ప్రారంభమయ్యే రోజున అక్కడ తన చేతిమీదుగా జరగ వలసిన తతంగం గురించీ చాలాసేపు నాతో ముచ్చటించాడు. సంక్రాంతి సెలవులు పూర్తయి, నేను బస్తీకి వెళ్ళి పోయింతర్వాత ఒకసారి నాకో వుత్త రంకూడా రాశాడు, ఎప్పుడూ ఎవరికీ వుత్తరాలు రాసే అలవాటు లేని మామయ్య. దాన్లో, ఈశ్వరమ్మ కట్టిం చిన మందిరంలో శ్రీరామనవమినాడు పూజ ప్రారంభ మవుతుందనీ, నన్ను రమ్మనీ మరీ మరీ రాశాడు. కాని వెళ్ళటానికి నాకు సెలవు చిక్కింది కాదు.

వెళ్ళకపోయినా ఆ పూజా కార్య క్రమా లెలా జరిగాయో తెలుసుకుం దామని వుంది. కాని ప్రతిసారీ అడ క్కుండానే యిలాంటివన్నీ చెప్పు కొచ్చే మామయ్య, యీమారు ఆ విష యము ఎత్తనేలేదు. అంచేత నేనే ఆ ప్రస్తావన తీసుకొచ్చి-

"ఈశ్వరమ్మ కులాసాగా వుందా?" అన్నాను.

"ఏమో, ఎవరికి తెలుసు?''

"అదేమిటి?"

"ఒరే, దాని వూసెత్తకు నావద్ద."

"మరి భక్తురాలు కదా..."

"భక్తీ దాని పిండాకూడూనూ... అంతా దొంగభక్తి-వృద్ధ నారీ పతి వ్రతా అన్నట్టు... ఇలాంటి వాళ్ళ కంతా భక్తి కుదురుతుందా? అందుకు చిత్తశుద్ధి అవసరం."

నేను ఆశ్చర్యపోయాను. మొన్న సంక్రాంతి సెలవుల్లో ఈశ్వరమ్మను గురించి మాట్లాడినప్పుడు మామయ్య అన్న దిది :

"అసలు ఈశ్వరమ్మ తరహాయే వేరు. ఆమె కున్నటువంటి భక్తీ, దైవ చింతనా, అణకువా, ఆప్యాయతా, యివన్నీ కేవలం పూర్వజన్మ సంస్కార విశేషం చేతనే పట్టుబడ్డాయా అనిపి స్తుంది. ఇంటికి వెడితే నాలుగు భాగ వత పద్యాలైనా చదివి చెప్పందే యివతలికి రానివ్వదుకదా? పండ్లో, ఫలహారమో, పాలో, మజ్జిగో పుచ్చు కోనిదే అక్కడనుంచి కదలనివ్వదు కదా? ఏదో అటువంటి ధర్మాత్ములు



కొందరైనా ప్రపంచకంలో వున్నారు కాబట్టే ఆయొక్క కలిపురుషు డింకా విజృంభించటం లేదుగాని..."

ఈ సదభిప్రాయాన్ని యింతలోనే పాడుచేసుకున్న ఈశ్వరమ్మ మీద ఎంతైనా జాలి వేసింది నాకు' మామయ్యలాంటి భక్త శిఖామణి ఆగ్రహిస్తే ఆవిడకు తరుణోపాయం లభించే దెలాగా అన్న ఆవేదనకూడా కలిగింది. ఆవిడ చేసిన నేరం ఏమిటో

తెలుసుకోవా లనిపించినా, ఆ నేరా లను నోటితో వుచ్చరించటానికి కూడా మామయ్యకు అసహ్యం కాబట్టి, ఏమీ అడక్కుండా వూరుకున్నాను.

ఆ సాయంత్రం మామయ్య వెళ్ళి పోయాక అన్నయ్య నా దగ్గరికి వచ్చి "ఇంతకీ ఏమంటా డాయన? ఈశ్వ రమ్మగారి వూరికి వెడతా నంటాడా ఎప్పుడేనా?" అన్నాడు. నాకూ మామయ్యకూ జరిగిన సంభాషనిణ అన్నయ్య విన్నాడల్లే వుంది.

"ఎలా వెళతాడు? ఆయన కెందుకో మనసు విరిగిపోయినట్టుంది."

"మనసు కాదు, వెళ్ళాడం లే నడుం విరుగుతుంది మనిషికి,'' అన్నాడు అన్నయ్య. అన్నయ్య కేనాడూ మామయ్యపై మంచిఅభిప్రాయం లేదు.

"ఇంతకీ ఏం జరిగింది?" అన్నాను.

అన్నయ్య చెప్పుకొచ్చాడు. "రామ మందిరంలో పూజ ప్రారంభ మవటా నికి పదిరోజులు ముందుగానే భక్తుల కోరికపై మామయ్య వెళ్ళి అక్కడ మాకాం పెట్టాడట. ఆయన చేసే పనల్లా రోజూ పొద్దుటినుంచీ సాయం త్రమువరకూ జహ్వాదినామం చెరగ కుండా చూచుకుంటూ మందిరంలో కూచోవటం, ఆయా వేళల్లో ఈశ్వ రమ్మగా రింటినుంచి యథాశక్తిగా వచ్చే పండ్లూ, పాలూ, ఫలహారాలూ అరగిస్తూండటం, రాత్రిళ్ళు మంది రంలో కాసేపు పురాణం చెప్పటం; పోతే పగలంతా ఆయన దేవుడివిగ్రహం ఎదుట సుందరకాండ పారాయణ చేస్తున్నాడని అంతా అనుకునేవాళ్ళు.

"కాని మామయ్య పారాయణ చేసేది సుందరకాండ కాదు; భాగవ తంలోని శ్రీకృష్ణుని రాసక్రీడా ఘట్టం. అదీ దేవుడి విగ్రహం ఎదుట కాదు; మందిరంలో వూడ్చటం, ముగ్గులు పెట్టటం, పూలు కోయటంలాంటి పనులు చేసే చుక్కమ్మపిల్ల ఎదుట. చుక్కమ్మ ఈశ్వరమ్మగారి పొలాల్లో పనిచేసే ఒక పాలేరు భార్య-కొత్తగా పెళ్ళయింది. చక్కగా వుంటుంది.

"రాసక్రీడా పారాయణం ఆనాడు నాగరత్నమ్మలో కలిగించిన చలనంలో నూరోవంతైనా యిప్పుడు చుక్క మ్మలో కలిగించినట్టు లేదు. అంచేత నాలుగైదు రోజులు గడిచాక సరాసరి కార్యరంగంలోకి దిగదల్చుకున్నాడు మామయ్య. ఆ రోజుపొద్దున మందిరా నికి చుక్కమ్మ పూలు తీసుకువెళ్ళగానే, బుట్టలోంచి యిన్నిపూలు తీసుకుని ఆ పిల్ల కొప్పులో తురిమాడట. చుక్కమ్మ కాస్త ఖంగారుపడినా, ఏదో పెద్ద వాడు చనువుకొద్దీ అలా చేసివుంటాడు లెమ్మని వూరుకుంది.

"ఆ సాయంత్రం చుక్కమ్మ మంది రంలో పనంతా పూర్తి చేసి వెళ్ళబో తుంటే, 'చుక్కా' అని వెనక్కి పిలిచా డట మామయ్య.

"ఈ సంబోధనతో చుక్కమ్మకి కోపం వచ్చింది. మామయ్య దగ్గరకి వెళ్ళి, 'ఏం దయ్యగోరూ ఆ పిలుపు? మావోడొక్కడే నన్నట్టా పిలుత్తాడు. ఆడు పిలిత్తేనే వూరుకుంటాను,' అంది.

"మామయ్య నవ్వాడు."

'ఎందుకు పిలిసేరో చెప్పండి. నేం బోవాల...ఆ ఎదురు జూత్తుంటాడు.'

"మామయ్య మళ్ళీ నవ్వాడు, ద్వంద్వాలకు అతీతుడైన యోగిలాగా.

"ఎప్పుడూ 'ఆణ్ణి' గురించే కలవరమయితే ఎలాగే చుక్కా? మరి నా సంగతేం జేశావు?" అన్నాడు.

చుక్కమ్మ మండిపడింది.

"మీ సంగతా? అమ్మగోరితో మాట్టాడొచ్చి చెబుతా నుండండి..." అంటూ గిరుక్కున వెళ్ళిపోయింది. ఆ పిల్ల. అక్కణ్నుంచి నేరుగా ఈశ్వరమ్మగారింటిదారిన వెళ్ళటం చూసిన మామయ్య తన కర్తవ్య మేమిటో గుర్తించినవాడై వెంటనే అడ్డదారిన పొలాలమ్మట నడిచి రాత్రికి రాత్రే తన వూరికి వచ్చేశాడట. ఆ హడావుడిలో ఆయన మందిరంలో వదిలిపెట్టివచ్చిన వస్తువుల్లో మదన కామరాజు కథల పుస్తకం ఒకటి ఈశ్వరమ్మకు దొరికిందట.

"మళ్ళీ యీ రోజుదాకా ఆ వూరి చాయలకే వెళ్ళటంలేదట మామయ్య.

"ఇది నీ కెలా తెలిసింది?" అనడిగాను అన్నయ్యను.

"మొన్న ఆ మధ్య నాన్న ఏదో పనిమీద ఈశ్వరమ్మగారింటికి వెడితే ఆమె అయనతో యీ కథంతా పూస గుచ్చినట్లు చెప్పిందట."

"మరి నాన్న మామయ్య నేమీ అనలేదా?''

"లేదు. నాలుగూ పెట్టమని నేను చెబితే, అందువల్ల నిష్ఠూరం కొని తెచ్చుకోవటం తప్ప వేరే ఫలితం వుండదన్నాడు నాన్న..."

"మరి మామయ్య ఇప్పుడు ఈశ్వరమ్మ పేరెత్తితేనే మండిపడుతున్నాడెందుకని?"

"ఇన్నాళ్ళూ ఈయన పరమభక్తుడని నమ్మి శుశ్రూష చేసిన పాపానికి, పాపం, ఆవిడేమో ఈయన చేసిన అప్రాచ్యపు పని గురించి ఎవ్వరికీ చెప్పనేలేదట. ఒక్క నాన్నతో తప్ప, కాని మామయ్యకు మాత్రం ఆవిడ యీ విషయం గురించి నలుగురితోనూ చెప్పకుండా వుంటుందా అని అనుమానం. ఆ అనుమానం కసిగా మారి, ఆయన సమయం దొరికినప్పుడల్లా ఆమెను దుయ్యబట్టుతుంటాడు ... అదొక సైకాలజీ," అన్నాడు, బి. ఏ. లో సైకాలజీ మాత్రం ప్యాసై ఆ తర్వాత పరీక్షకి వెళ్ళటం మానేసిన అన్నయ్య.




### జరిగినకథ

[స్వగ్రామం చేరిన కిరణ్‌కు జగపతి, ఇంద్రాణినే వివాహమాడితీరాలని తన నిర్ణయాన్ని చెప్పడంతో, కిరణ్ రౌద్రమూర్తి అయి దేవరాణిని చూడాలని రాయుడు యింటికి వెళ్లాడు. రాయుడుఇల్లు తాళాలుపడివుండి, అక్కడ తమ ఇంటినౌకరు వెంకన్న కాపలావుంటం చూచి, వారి సంగతిసందర్భాలు వెంకన్న తెల్పకపోవడంతో, తాళంచెవులగుత్తి వాడివద్ద చూచి, వాడిచేత ఇల్లుతెరిపించి, సర్వం పరికించి, లోపల దొరికిన 'ఫేర్ వెల్ మై ఫ్రెండ్' అనే పుస్తకాన్ని తీసుకు ఇంటికి వచ్చాడు. ఇంటివద్ద తల్లిదండ్రు లెంతచెప్పినా వినకండా, ఎగత్రించి బయల్దేరి వెళ్ళిపోయాడు. తనకు అసిస్టెంట్ ఇంజనీరుగా ప్రమోషన్ అయిందని తెలిసినాకూడా ఆనందం కలుగలేదు; దిగులుతో క్రుంగిపోయాడు.

తనచేత చేయించిన ఘోరాలకు ప్రత్యుపకారంగా ఇంద్రాణితో తనకు వివాహం జరపాలని పట్టుపట్టిన జగన్‌ను అనునయించబోయిన జానకి, స్టౌమంట చీరెకు తగులుకుని మంటలకు గురైంది. జగన్ జానకీలమధ్య జరిగిన సంఘర్షణంతా చాటునుండి విన్నది ఇంద్రాణి. అక్క మంటలమధ్య వుండగా, అందరినీ కేకలేసి పిలిచింది రక్షించమని.]

— ఇక చదవండి

కిరణ్ ఆఫీసునుండి ఇంటికి వచ్చేసరికి గదిలో కమలాకరం కూర్చునిఉన్నాడు.

పామును చూచి వెనుకంజ వేసినట్లు రెండడుగులు వెనక్కు వేసి నిలబడ్డాడు కిరణ్ అసహ్యంగా చూస్తూ అతడిని.

"దా చినబాబూ! కూర్చో. అలా చూస్తావేమిటి?" అన్నాడు కమలాకరం సాదరంగా.

"హుఁ! చినబాబు! ఎవరు? ఎవరికి?" హేళనగా నిర్లక్ష్యంతో ప్రశ్నించాడు కిరణ్. ఆవేశాగ్రహాలతో అరిచాడు; "ముందు బయటికి నడు. మీ చిన్నబాబు ఎప్పుడో చచ్చాడు. ఇక్కడింకా ఎవడున్నాడని వచ్చావ్? ఎవరినడిగి ఈ యింట్లో అడుగుపెట్టావ్?"

"అలా కోపం తెచ్చుకోకు చినబాబూ! ఈ పాటికి కాస్త కోపం తగ్గి దారిలోకి వస్తా వనుకున్నాను. ఇంకా అలాగే ఉన్నావా?"

"అధికప్రసంగం అనవసరం; ముందు బయటకు నడు."

"పోనీ కాస్త నేను చెప్పేవమాటైనా విను. అమ్మ నీపై బెంగతో అహో రాత్రాలూ క్రుళ్ళి క్రుళ్ళి ఏడుస్తూంది. ఓదార్చలేకుండా వున్నాం."

"హుఁ, అమ్మమీదా నా మీదా ఎంత ప్రేమ వచ్చిం దిప్పుడు? ఏడవండి. అంతా క్రుళ్ళి క్రుళ్ళి ఏడ్చి కృశించిపోండి, ఎక్కడ ఎందరు ఏడుస్తున్నారో మీరు చేసిన పనికి – ఆ ఉసురంతా తగులక పోతుందా?"

"అలా అనకు చినబాబూ, జరిగిందేదో జరిగిపోయింది, ఇక ముందువిషయం చూడాలి. కోపం మాని నాతో రా; చాలాకష్టాలలో ఉన్నాం. జానకిని రాజమండ్రీలో హాస్పిటల్‌లో చేర్చాం. వంటగదిలో పొయ్యిదగ్గర చీరకు నిప్పంటుకొని శరీర మంతా కాలిపోయింది. కుడిచేయి తీసేశారు. మాకేమీ బాగుండలేదు. నువ్వు రావడం మంచిది."

"నాకు చాలా సంతోషంగావుంది! చేసినపాపాలతో అలాగే కాలి బూడిదవ్వండి. నే నానాడే చెప్పాను, నా కెవరూ లేరని. అంతే, ఇక ఈ జన్మకు ఆ మాటకు తిరుగులేదు; వెళ్ళు, మరి మాట్లాడకు."

"చిన్నబాబూ......"

ఇంకా ఏమో చెప్పబోయిన కమలాకరం, కిరణ్ తన నౌఖరును కోపంగా, "అడ్డమైనవాళ్ళను గదిలో కెందుకు రానిచ్చావురా?'' అని తిడుతూ రెండు తన్నడంతో మరి లాభంలేదని, ఆ మర్యాదలు తనకుకూడా జరగకముందే త్వరత్వరగా వెళ్ళిపోయా డక్కడినుండి.

తనకు తానే చెప్పుకుంటూ బిగ్గరగా నవ్వుకున్నాడు కిరణ్! "దేవదానవులను కలిపి కలియుగంలో మానవులగా సృష్టించాడు దైవం, అహ్హాహ్హా."

అతడి హృదయంలోని సరళ మృదుత్వాలు ఆనాటి కానాడు హారతికర్పూరంలా హరించిపోతున్నాయి.

## 40

పౌర్ణమి! పూర్ణశశాంకుడు జగమంతా అందంతో కప్పివేసి ఆనందాన్ని వర్షించు తూన్నా గ్రోలలేని నిర్భాగ్యహృదయాలూ కొన్ని వుంటాయి. నిండు జాబిల్లిని తిలకించుతూ గోదావరిఒడ్డున ఇసుకలో నడచి నడచి ఒకచోట నీరసంగా చతికిల బడ్డాడు కిరణ్. 'ఆనాడు రాణి వీణాగానం విని, వారి ఇంట్లోనే భోజనం చేశాను. ఆనాడుకూడ పౌర్ణమే. జీవితానికి ఆ పౌర్ణమే పౌర్ణమి! తర్వాత ఎన్నిపున్నమ లైనా వచ్చి వెళ్ళాయి. కాని అనుభవసకూ వాటికీ తేడాయే లేకపోయింది......... చెట్ల కొమ్మలలోనుండి తొంగితొంగి చూస్తూన్న పూర్ణచంద్రికా సౌందర్యాన్ని ఆస్వాదిస్తూ, రాణీ గానవాహినిలో తన్మయమైపోయిన మధురానుభూతి ఈ జన్మకు మరువరాని మహత్తరమైనది!'

"ఊఁ!" తీయని స్మృతిని జుగుప్సా మేఘమాలిక కప్పివేసి విషాద వర్షాన్ని కురిపించేసింది. 'ఇష్టాగోష్టి జరుపుతూన్న తమ మధ్య ఏదో నీడ పడి మాయ మైంది. ఆ పైన తనకూ, రాణీకీ, రాయుడుకూ ఆ విషయమై కొంత చర్చ సాగింది...అబ్బ! ఆనాటి రాణి వచనాలు గుర్తుకు వచ్చినకొలదీ దహించి వేస్తు న్నాయి. 'మనుష్యులే దయ్యాలమాదిరి పీడిస్తారు; కాని వేరే దయ్యాలంటూ లే' వన్న రాణి మాటలు అక్షరాలా నిజమయ్యాయి! తల్లీ, తండ్రీ, అన్నలు, వదిన—అంతా కలిసి దయ్యాలమాదిరిగానే తనను సుఖశాంతులకు దూరం చేసేశారు కదా!"

"హుఁ, ఈ శార్వరీరాత్రులు నిన్నే తలపు తెచ్చి హృదయశల్యాలను నిలువునా దహించివేస్తున్నాయి రాణీ. చల్లని సాయంత్రాలలో శరద్రాత్రులలో మనం సలిపిన విహారాలూ, చేసిన తర్కవితర్కాలూ, హాసప్రతిహాసాలూ, వాదోపవాదాలూ, మధురగానాలూ–ఎన్ని? ఎన్ని? అవన్నీ మళ్ళీ...మళ్ళీ ఎన్నటికైనా జీవిస్తాయా రాణీ? మనం తిరిగి కల్సుకొంటామా? దైవం దయ జూపుతాడా?" నిట్టూర్చుతూ స్వగతంగా అనుకొంటూన్న ఆ మాటలు, భుజంపై హఠాత్తుగా ఎవరిదో చేయి పడడంతో ఆగిపోయాయి. ఉలికిపాటుతో వెనుదిరిగి చూచాడు; 'గోపాలరావు!'

"అర్థమైంది కిరణ్ నీ బాధ. రాణీ నీవూ ఎందుకు విడిపోయారు? ఎవరికీ చెప్పుకోనిదే హృదయతాప మెలా చల్లారుతుంది చెప్పు?" లాలనగా అడిగాడు గోపాలరావు, కిరణ్ చేతులు తన చేతిలోనికి తీసుకుంటూ.

"అవును గోపాలం, చెప్తాను విను. తప్పకుండా చెప్తాను. చెప్తామంటే మాత్రం,




మరొకరి గోడు వినేవా ళ్ళుండద్దూ?...ఊఁ, ఇదీ జరిగినది గోపాల్! ఆమె గానామృతం గ్రోలిన నన్ను ఇహ ఏ సంగీతమూ ఆకర్షించడం లేదు; పైగా ఏవో బాధ, అశాంతి రేకెత్తుతాయి. ఆమెకు ఆమే సాటి. అద్వితీయ. ఆమె లేని నా జీవితం మరి ఉండబోదు. అమృతం భుజించే నోటికి అంబలి ఎట్లా రుచిస్తుంది?"

"ఆమె గానజలధిలో నా జీవననౌకను నిర్మలంగా నడుపుకొందామని కలలు గన్నాను. కాని రాగకుసుమం వికసింపకపూర్వమే ప్రేమమొగ్గ త్రుంచివేయబడింది. ఆమె లభించనిదే నాకు సుఖశాంతులు చేకూరవు. ఆమె సాధారణ స్త్రీ కాదు — సముజ్జ్వల చైతన్యమూర్తి. నాలోని జీవస్రవంతి ఆమెలోని చైతన్య రాగస్రవంతిలో లీనమైపోయింది — ఇహ ఈ కట్టెమాత్రమే మిగిలింది."

"మరి నువ్వు తిరిగి ఇక్కడ డ్యూటీలో జేరడంలో అర్థమేమైనా వుందా కిరణ్? వాళ్ళెక్కడికి వెళ్ళారో ఆచూకీ తీసి తెలుసుకోవద్దూ?"

"ఎలా తెలుస్తుందోయ్?'' అమాయకంగా ప్రశ్నించాడు కిరణ్.

''ప్చ్, నీ బుద్ధి బొత్తిగా పాడైపోయి పనిజేయడం లేదు వర్మా! అదంతా తర్వాత చూద్దాం. నువ్వు ముందు సెలవుపెట్టి నాలుగుఊళ్ళు తిరిగి చూచిరా, కాస్త మనస్సు సర్దుకుంటుంది...

"అదృష్టముంటే ఎక్కడో వారు తటస్థపడనే పడవచ్చు. డబ్బు వుందా, ఏమైనా కావాలా?''.

"హుఁ!" లోకంలోని విషాదమంతా కిరణ్ నవ్వులోనే ఒలికింది.

"డబ్బు కేం? నా కెప్పుడూ ఇంటికి పంపాల్సిన అవసరం లేదుగా? చాలా మూలుగుతూ పడివుంది. ఎటొచ్చీ అనుభవించే అదృష్టమే లేదు."

గోపాలరావుకూడ నవ్వలేక నవ్వాడు. "అవును, నా కా అగత్యంలేదు. నా జీతండబ్బు ఇంటికి పంపించితేనే గాని గడవదు. ఏం జీవితాలో! ఒక సుఖం వుంటే మరొకటి వుండదు."

కొంతసేపు ఇద్దరూకూడ నిశ్శబ్దంగా కూర్చున్నారు. క్రింద గట్లొరిసి పారుతూన్న గౌతమి గలగలలూ, పైన తారామండల పరివేష్ఠిత పూర్ణశశాంకుడూ; మదిలో ప్రణయతపనతో మధన.

కిరణ్ ప్రొద్దుపోయి ఇంటికి వచ్చి భోజనం చేసీ చేయకుండానే మేను వాల్చబోయేసరికి బయటనుండి "చిన్నబాబూ!" అనే పిలుపు విన్పించింది.

ఉలిక్కిపడ్డాడు కిరణ్. "ఎవరు?"

"నేను చిన్నబాబూ!" జగపతి కంఠం స్పష్టంగా విన్పించింది. లేచి కిటికీలోనుండి చూచాడు — అతడే!

కోపం ఒక్కసారి పెల్లుబికింది కిరణ్‌కు, "ఎవరవు నువ్వు? ఎందుకు? చిన్నబాబు చచ్చిపోయాడు. కిరణ్‌కు అందరూ చచ్చిపోయారు. గెటౌట్."

"చిన్నబాబూ! ఒక్కసారి మాట్లాడే అవకాశమియ్యి."

"ఛీ ఛీ, గెటౌట్."

## 41

ఆఫీసులో సెలవు అనుమతిపొంది, బజారుకు పోయి కొన్ని కొన్ని వస్తువులు కొనుక్కొని మధ్యాహ్నం ఇల్లు చేరగానే — గదిలో అడుగిడగానే — కిరణ్ దృష్టి నాకర్షించినది టేబుల్‌మీద సెంటువాసనలు విరజిమ్ముతూన్న ఎఱ్ఱని డాక్టర్ గులాబీపుష్పం — దాని అడుగుననే ప్రత్యేకంగా కన్పిస్తున్న నీలికవరు.

నౌఖరును పిలిచి 'ఎవరిచ్చా'రని ప్రశ్నించాడు. "ఎవరో అమ్మాయిగారు వచ్చి ఆమే స్వయంగా అక్కడుంచి వెళ్ళారండి! మీకోసం అడిగారు. లేరని చెప్పాను. ఇంకేమీ మాట్లాడలేదు. వెంటనే వెళ్ళిపోయారు;"

"అమ్మాయిగారా?" అతి ఆశ్చర్యంతో ప్రశ్నించాడు.

"ఇంకెవరూ? రాణీయే అయ్యుండాలి — భగవాన్, కనికరించు," అంటూ లక్ష ఆశలతో, కోటికోర్కెలతో విప్పాడు ఉత్తరాన్ని.




ఆశ్చర్యపోతూ ఆత్రంగా చదువుకుపోయాడు —

“శ్రీ కిరణ్ బావగారికి,

వందనములు. ముందుగా మిమ్మల్ని క్షమాపణలు కోరుకొంటున్నాను — మీరు లేని సమయంలో మీ గదిలోనికి వచ్చి ఈ ఉత్తరం తెచ్చి ఉంచినందుకు. మీ రిది చదువుకొనే సమయానికి మీ గృహమేకాదు, ఈ ప్రాంతాలనే వదలి చాలాదూరం పోయివుంటాను. నే నిది వ్రాయడం తప్పో ఒప్పో నాకు తెలియదు. అనుకొన్న దానిని నిస్సంశయంగా, నిర్భయంగా ఆచరణలో పెట్టడం నా కలవాటు. నాకు చేతనైనంతవరకూ మీకు సహాయపడి మనశ్శాంతి చేకూర్చుదామనే ఉద్దేశ్యంతో వ్రాస్తున్నాను, ఓర్పుతో సాంతం చదవండి.

మీకూ దేవరాణికీ గల పరిచయం ఎటువంటిదో, ప్రేమానురాగాలెంత బలీయమైనవో నాకు తెలుసు. అందుకు కలిగిన విఘాతాలూ తెలుసు. అందుకే ఆమె సమాచారం నాకు తెలిసినంతవరకూ మీకు తెలియపరచడం నా బాధ్యతగా గుర్తించాను... నేను పట్టణంలో పుట్టి, పట్టణంలోనే పెరిగాను. పల్లెప్రకృతిని గురించీ, ప్రజలగురించీ హృదయంగమంగా చిత్రింపబడిన రచనలను చదివిన నేను — ఆ

అందమైన పల్లెలనూ, నేత్రానందకరమైన ప్రకృతి సౌందర్యాన్నీ తిలకించి, ఆనందించి, ఆస్వాదించుదామని అక్క జానకి ఉత్తరం వ్రాయగానే వెంటనే ఎగిరి వచ్చాను. కాని అక్కడ ఒక పెండ్లికుమారు డున్నాడని గానీ, మీ మా కుటుంబాల లోని వ్యక్తులు ఒక ప్రత్యేక పన్నాగంతో నా ఆ ప్రయాణం ఏర్పాటు చేశారనిగానీ అప్పట్లో తెలియలేదు. అందుకే మనోల్లాసంతో ఎగిరివచ్చిన నేను అంత విచారంతో, నిష్ఠురాలతో తిరిగి వెళ్ళవలసివచ్చింది. ఒకగొప్ప విషాద చరిత్రకు కారణభూతురాల నయ్యానని ఈ క్షణంవరకూ విచారిస్తూనే వున్నాను. అందుకే స్వపరభేదాలనూ, పక్షపాతాలనూ విస్మరించి యథార్థాన్ని నిస్సంశయంగా బయట పెట్టి, న్యాయంకోసం పాటుపడదలిచాను. నాప్రయత్న మెంతవరకూ ఫలిస్తుందో తెలియదు. దైవనిర్ణయ మెట్లా ఉందో ?

నేనే స్వయంగా మీతో ముఖాముఖీ మాట్లాడుదామని నిన్న మధ్యాహ్నం మీ గదికి వచ్చాను. అసలు నే నీ ఊరు ఎందుకువచ్చానో మీకు తెలియదేమో ! మా అక్కయ్యకు శరీరమంతా నిప్పంటుకొని కాలిపోయింది; ప్రస్తుతం గవర్నమెంట్ ఆసుపత్రిలో వుంది. అదంతా వేరేకథ. నన్ను బలవంతంగా మీకిచ్చి వివాహం చేయించాలనీ — ఇక్కడే ఏగుళ్ళోనో త్వరలో చేసేయాలనీ —ఆపైన పరిస్థితు లవే సర్దుకుంటాయనీ అందరూ పన్నాగం పన్నుకున్నారు. అక్కయ్యను చూడ టానికి వచ్చిన నేను అదృష్టవశాత్తూ ఆ పన్నుగడనూ, రహస్యాలనూ తెలుసుకోవడం జరిగింది. దానితోపాటే మరికొన్ని సంగతులుకూడా తెలిశాయి. చెప్దామని నిన్న మీ గదికి వస్తే మూర్తీభవించిన శోకదేవత వలె, నిరాశా నిస్పృహలతో నిర్జీవప్రతిమవలె ఒకచోట నిలబడివున్న మిమ్మల్ని చూచి నిర్ఘాంతపోయి, పలుకరించ సాహసించలేక వెళ్ళిపోయాను మీతో మాట్లాడవచ్చిన కొందరికి జరిగిన మర్యాదలు గురించి విన్నాను. అసలు ముఖ్యకారకురా లైన నాకు అంతకంటె అధికగౌరవ మివ్వలేరని అనుకున్నాను. అందుకే ఈ లేఖలో అన్నివిషయాలూ వ్రాసి తెచ్చాను.

మీ వివాహవిషయంలో మా అక్కయ్య చేసిన ప్రయత్నాలూ, ప్రదర్శించిన కోపతాపాలూ, కలిగించిన అవరోధాలూ మొదటినుండీ నేను చెప్ప నవసరం లేదు; కాని జరిగిన ప్రతి అరిష్టంకూడా ఆమెవల్లనే జరిగింది. ఆ విధంగా రాణిపై అపో హాలు పెరిగాయి. ఆమె నష్టజాతకి అని అందరూ నమ్మారు. అదేం ఖర్మమో — దైవంకూడ అన్యాయానికి అండగ నిలచి నిద్రపోతూంటాడు తరచు.

కడకు రాయుడుగారి వ్యాపారం బూడిదవ్వడానికికూడా కారణమైన ఒక

ఘాతుకానికి తోబుట్టువునని వ్రాసుకోవలసిన గతి పట్టింది. ఆ గోదావరీ మాతకుకూడ మరి వారిపై అంతకక్ష ఎందుకో — వారి పొలాలను నాశనం చేసి తుడిచిపెట్టి బికార్లను చేసి వదలింది. ధనంకోసం ఆత్మీయతనుకూడ దూరం చేసుకోగల మీ తండ్రినిగురించి మీకంటె తెలుసునని నేను వ్రాయాలా?

రాయుడుగారి మిగిలిన ఒక్క మేడనూ పదివేలకు కొనివేసి, తమ పలుకుబడినంతనూ ఉపయోగించి వారిని మీ ఊరినుండి వెళ్ళగొట్టారు — అంతా రహస్యంగానే జరిగిపోయింది. వారెక్కడికి వెళ్ళారో నాకు తెలియదు. ఎక్కడికి వెళ్తారు? అన్నివిధాలా దెబ్బ తిన్న నిర్భాగ్యులు! చేతనైతే వెదుక్కోండి. ఈ గాలిమారాని కంతకూ చాలవరకు నేనూ, నారాకా ముఖ్యకారణాలుగనుక, నాకు తెల్సినంతవరకూ మీకు తెలియపరచి నిష్క్రమించడం నా బాధ్యతగా గుర్తించాను. నేను చదువూ — సంస్కారం వున్నదానను. బుద్ధిపూర్వకంగా ఇద్దరిమధ్యకు వచ్చి, ఇరుకునపెట్టి హింసించే హీనురాలినికాను. ఈ హీనుల విషవలయనుండి దూరమై ఎక్కడైనా హాయిగా సుఖంగా — ఇతరులను నొప్పింపజేయకుండా జీవించగలను — సెలవు.

మీరూ మీ రాణీ ఒకటవ్వాలని కాంక్షించే —

— ఇంద్రాణి."

కుమిలి కుమిలి కదలి కదలి ఏడ్చాడు కిరణ్, పసిబిడ్డలాగా.

'నీది నష్టజాతక మన్నారు కాని, నాదెంత నష్టజాతకం రాణీ! నావల్ల మీ కుటుంబ మెలా అయిపోయింది?

'ఇంద్రాణీ! ఎంత అమృతహృదయవు తల్లీ! ఆకువచిప్పల నడుమ ఆణి ముత్యంలాగా పుట్టావామ్మా?"

## 42

తొలకరి కొద్దికొద్దిగా ఆరంభించి, వర్షాకాలం ఒయ్యారంగా ప్రవేశించిది. ధరణి కళకళలాడింది. ఇళ్ళు, కొట్లు ధాన్యంతో నిండిపోయాయి. జగమంతా ఆనందభరిత మైంది. కాని భగ్నహృదయుడు కిరణ్‌కు ఆనందమే లేకపోయింది. అశాంతితో అనేక ప్రదేశాలు తిరుగుతున్నాడు.

గాలితో సరసాలాడే కొమ్మల కదలికలలో గొప్ప సంగీతం వినవస్తుంది అతడి చెవులకు. విహంగ శాబకాల కిలకిలారావాలలో ప్రియబాంధవియొక్క మధురకోకిలస్వరం దోబూచులాడుతుంది. సెలయేటిఅలల గలగలలలో చెలిగాత్రం ప్రతిధ్వనిస్తుంది. పూబాలలలో ప్రాణేశ్వరి ముగ్ధగానము ద్యోతక మౌతుంది. పిచ్చివాడై పోతాడు. నిర్జనప్రదేశంలో ఏకాంతంగా కాలగమనాన్ని గమనించకుండా శోకపారావారంలో గడుపుతాడు. ఆ సమయంలో ఆ దీనుని శోకం విన్న రాళ్ళు సహితం కరిగిపోవలసిందే.

ఏ స్త్రీ ఎదురైనా ఆశగా దేవరాణి కావాలని చూస్తాడు. 'ఆశ తీరుతుందా? ఈ అన్వేషణ ఫలిస్తుందా?' ఎవరు చెప్పగలరు ఆ దీనునికి జవాబు?

అనేక యాత్రాస్థలాలు తిరిగాడు. దైవదర్శనం చేసుకున్నాడు. మనశ్శాంతి లభించలేదు. ఏమూలకి ప్రయాణాలు చేశాడో, చేస్తున్నాడో తనకే తెలియలేదు. కాశీ, బృందావనం, గయ దర్శించుకొన్నాడు. త్రివేణీసంగమంలో స్నానం చేశాడు. కోరిక తీరలేదు. కలకత్తాలో వినోదాలు అనుభవింపబోయాడు. మనస్సులో మంట అధికమైపోయింది. ఆగ్రాలో తాజ్‌మహల్ దర్శించాడు. వెన్నెల రాత్రిలో వెలుగొందిపోతూన్న ఆ జగద్విఖ్యాత ప్రేమపీఠం అతడి ఎదలో జ్వాలలను నూతనంగా ఎగద్రోసి ప్రజ్వలింపజేసింది.

గమ్యం లేకుండా కొంతకాలం తిరిగాడు, ఏ ఊరోకూడా తెలుసుకోకుండా గడిపేశాడు.

కన్యాకుమారిని చూచి అద్వితీయమైన ఆ ప్రేమచరిత్రను విని ముగ్ధుడయ్యాడు. సేతువులో స్నానం చేసి పునీతుడయ్యాడు. రామలింగేశ్వరుని దర్శించి మొక్కు-

కున్నాడు. అయినా హృదయం శాంతించలేదు. మధుర మీనాక్షిదేవి దర్శనంకై ఆలయంలో అడుగుపెట్టాడు. ఎందువల్లనో ఆ ఘంటికా నినాదం అతడి హృదయాన్ని సమ్మెటలతో కొట్టినట్టు బాధించింది. దేవతాదర్శనం చేసుకొనకుండానే మధురను విడచిపెట్టాడు.

శ్రీరంగనాయకుని సన్నిధిలో ఎందువల్లనో హృదయం శాంతించింది. 'లక్ష్మీదేవి హస్తద్వయం మధ్య బంధించుకుపోయిన అదృష్టవంతా! నామొర వినవేమయ్యా?' అని వాపోయాడు. ఆ శ్రీరంగక్షేత్రాన్ని విడువలేక చాలారోజు లుండిపోయాడు; అలా ఎంతకాల మున్నాడో అతడికే తెలియదు. తన జాడను గూర్చి గానీ, క్షేమసమాచారాలను గూర్చి కానీ ఎవ్వరికీ తెలియజేయడంలేదు. ఉద్యోగ మేమైందో, స్నేహితు లెలావున్నారో, తనవా రేమనుకుంటున్నారో అనే ఆలోచనే లేకపోయింది. తిథి తెలియదు. వారం తెలియదు. తేదీ తెలియదు. తన అస్తిత్వమే తనకు తెలియదు.

అంభోవీథిలో నిండుచంద్రుని చూచినప్పుడు మాత్రం తనరాణిని చూచి ఎన్ని నెల లైందో తెలుస్తుంది. ఆ వెనువెంటనే ఒక్కటొక్కటిగా అనేక సంగతులు గుర్తుకొచ్చి హృదయాన్ని దహించి, మెల్లమెల్లగా మసిచేసి బాధనిస్తాయి. లభించు

తున్న శాంతి కాస్తా మాయమైపోతుంది. ఏక్కడా ఒక్క క్షణకాలమైనా పరిపూర్ణ మైన మనశ్శాంతి లభ్యం కావడంలేదు. ప్రతిరాత్రీ కావేరి ఒడ్డున నడుస్తూ చిత్ర విచిత్ర ఊహావల్లరులతో గడిపివేస్తాడు. చంద్ర కిరణోజ్జ్వలమైన అలరికల వినా దిని కావేరి, నిశీధ సమయాన తనతో మూగగా అనేక సంభాషణలు జరుపుతున్నట్లు భావిస్తాడు. 'నాబోటి నిర్భాగ్యు లెందరో తమతమ కథలను నీతో చెప్పుకొని వుంటారు. నేనూ అందులో ఒకడిని తల్లీ.' అంటూ అనుదినం ఆక్రోశించేది అంత రంగం. చూస్తూండగానే చంద్రుని కళలు తరిగి, తిరిగి పెరుగ నారంభింపాయి - రోజులూ గడుస్తున్నాయి. హఠాత్తుగా ఒకరేయి ఆకాశంలో పూర్ణచంద్రోదయ మైంది. అంతే - అజ్ఞాతవాసంలోని చెలికై అంతరంగం ఆక్రోశించింది. సుధాం శునికంటె సుధామయమైన సుందరవదనం తలపుకు వచ్చింది. ఇహ ఆ ప్రదేశంలో నిలువలేకపోయాడు. ఎంతకాలం గడచినా హృదయంనుండి ప్రణయరూప కంట కాన్ని లాగివేయలేకపోతున్నాడు.

శరదృతువు ప్రవేశించింది. ఆ శరద్రాత్రులలో కిరణ్ హృదయమంతా దేవ రాణీ ప్రపూర్ణ మైపోయి హృదయజ్వాల రగుల్కొనేది. హేమంతఋతువు వచ్చింది. ఆ చల్లదనంలో ప్రజ లంతా హాయి పొందారు; కాని మండుతున్న కిరణ్ హృదయం చల్లారలేదు. ఆకాశం మేఘదూరమై నిర్మలమైంది; కాని, కిరణ్ హృదయాకాశా న్నావరించిన కారుమేఘాలు తొలగిపోలేదు. కృషీవలులు తిరిగి ధాన్యం నూర్చారు. భోగభాగ్యాలతో నిమిత్తం లేకుండా జనులంతా సంక్రాంతిపండగ జరుపుకున్నారు; కాని, ఆ స్నేహపాలితు డీ జన్మలో పండగ జరుపుకొనగలడా?

## *43*

కనిష్ఠ పుత్రునికై బెంగటిల్లుతూ కమల మంచంపట్టింది. కుటుంబ సభ్యు లం దరినీ - కడకు భర్తనుకూడా చీదరించుకుంటోంది: "నా బిడ్డను మీరే మ్రింగేశారు; మీరే. పొండి పొండి," అని పిచ్చిగా అరుస్తూంది.

జగపతి కర్తవ్యమూఢు డయ్యాడు. అతడికీ లోలోన కడుపుకోత భరింప నలవిగాకుండా వున్నది. ఇదివరకులాగా మంతనా లాడడానికీ, ఆలోచనలు చెప్ప డానికీ ఇప్పు డతడి కెవరూలేరు. తాను చేసిన కుట్రలూ, కుతంత్రాలూ బయటపడి పోవడమేగాక, శాశ్వతంగా అవిటితనం ప్రాప్తించినందువల్ల సిగ్గుతో తన గది విడచి బయటకు రావడంలేదు జానకి. కుంటిభార్యపై వెగటుపుట్టిన శ్రీరాం విలాస వినోదాలలో మునిగితేలుతూ, నగరాలలోనే నివసిస్తూ, ఆ పల్లెనూ, స్వజనాన్నీ

పూర్తిగా విస్మరించాడు. భార్య వనజ ప్రోత్సాహంతో పట్టణంలో ప్లీడరు ప్రాక్టీస్ కొనసాగిస్తున్న కమలాకరం కూడ యింటిఛాయలకు రావడం మానివేశాడు. గృహంలోని కళకళలూ, కాంతికిరణాలూ కిరణ్‌తోపాటే నిష్క్రమించినట్లు అన్పించసాగింది జగపతికి. అయినా అతడు తన భల్లూకపుపట్టును విడనాడలేదు. కుమారుడు కిరణ్‌ను ఏదైనా యుక్తితో యింటికి రప్పించాలని తాపత్రయ పడసాగిన అతడికి జానకే ఆధారంగా కన్పించింది.

“ఇక వీడిపైన ఆశ వదలుకోవడమే నంటావా అమ్మాయ్?” అనడిగాడు ఒకనాడు కోడలుజానకిని.

జానకి వెంటనే ఏమీ మాట్లాడలేదు.

“ఏదైనా ఉపాయం చెప్పి పుణ్యం కట్టుకుందూ తల్లీ! వాడు రాకుంటే మీ అత్తగారి ప్రాణాలు నిలిచేట్టులేవు:” కోడల్ని ప్రాధేయపడ్డాడు జగపతి.

జానకి బెట్టుసరిగా చూచింది. బింకంగా అన్నది: “ఉపాయలకేం, ఎన్నైనా వుంటాయి. ఎటొచ్చీ వాటిని సరిగా ఉపయోగించుకొనే నేర్పూ, ఓర్పూ ఉండాలేగాని.




అయినా యిందులో నా కేం వైకుంఠం ఒరిగిందిలెద్దురూ, ఆంతగా శ్రమపడటానికీ! ఉపకారం జరిగితే నన్ను మరచేపోతారు. జరగలేదూ — అందరి దీవనలూ కూడా నాకే. ఎందుకు నా కీ కొష్టంతా ?"

"తల్లి తల్లీ! అలాగనకుమరి!" అందితే జుట్టు, అందకుంటే కాళ్ళు పట్టగల దిట్ట జగపతి. "ఆ ఉపాయ మేమిటో చెప్పు. ప్రయత్నిద్దాం. పని జరిగితే ని న్నెందుకు మరచిపోతానమ్మా ? వాడికి నీ చెల్లెలు ఇంద్రాణి నిచ్చే వివాహం జరిపిస్తాను సరా?"

''అంతేకాదు !"

"మరి ?"

"కాదనరుకదా ?"

"చెప్పమ్మా !"

''మీ ఆస్తి నాపేర వ్రాయండి !''

''ఏమిటీ ?''

''అవును మామయ్యా! ఆయన తీరు — అదే మీ రెండోఅబ్బాయిగారి తీరు చూస్తున్నారుకదా! నాకు ఈ చేయి తీసేసిన దగ్గర్నుంచీ నా ముఖం చూడ్డం మానేశారు. పట్టణాలలో వుంటూ ఆస్తినంతనూ హారతికర్పూరంలాగా హరింప జేసేస్తున్నారు. మరి ఇలాగైతే నా మిగిలిన బ్రతు కెలా గడుస్తుంది ? గా జీవితం గురించి నేను జాగ్రత్తపడవద్దా ?"

"నీకు నీ తండ్రి ఆస్తి చాలా వున్నదికదా జానకీ :"

మామగారి ప్రశ్నకు జానకి నిర్లక్ష్యంగా చూచింది. "పోనిండి. మీకంత యిష్టంలేకుంటే వద్దు. ఎందుకంత తర్కం?"

"సరే," విధిలేక నీళ్ళుగారుతూ అంగీకరించాడు జగపతి.

తన వంతు ఆస్తి అంతా తన తదనంతరం నిరాటంకంగా కోడలు జానకికి సర్వహక్కులతో సంక్రమించేట్టు విల్లు వ్రాశాడు జగపతి, ఆ మర్నాడే. మామగారి చేతినుండి దస్తావేజు అందుకుంటూ సగర్వంగా నవ్వుకుంది జానకి. ప్రతిఫలంగా కిరణ్ మనస్సును విరచగల మార్గం వివరించి, సాధనం అందించింది మామగారికి.

"ఇదిగో; దేవరాణి, దివాకర్‌ల పెళ్ళిఫొటో. ఇది ప్రముఖపత్రిక లన్నింటిలోనూ ప్రచురింపజేయండి. కిరణ్ ఎక్కడున్నా చూస్తాడు. వెంటనే మనస్సు విరిగి, పైత్యం దిగిపోతుంది."

జగపతి కనులు ఆనందంతో మెరిశాయి. "ఎక్కడిది జానకీ ఇది? వీళ్ళిద్దరికీ పెళ్ళెప్పుడైంది?"

"ఏమో తెలియదు: ఆ మధ్యన ఒక స్నేహితురాలు యిచ్చింది. 'నా కెందుకులె' మ్మని ఊరుకున్నాను. ఇప్పుడు మీ బాధ చూడలేకనే యిచ్చాను."




జగపతి నిష్క్రమించగానే ఆనందంతో ఈలలేసుకుంటూ జగన్ ప్రవేశించాడు. "అచ్ఛా జానకీ! మన పథకం చాలా బాగానే సాగుతున్నది," అంటూ జానకి చేతిలో విల్లు తీసుకు చూచాడు. "వెరీగుడ్! వెఱ్ఱివాజమ్మ! కొడుకు కట్నం డబ్బులకోసం ఇప్పుడు తన కున్నదే వదులుకున్నాడు. అతి తెలివిగా ప్రవర్తించా మనుకునేవా ళ్ళందరూ యిలాగే అడుక్కుతింటూపోతారు. ఈ ముసలి జంబుకం అనంతరం ఎప్పుడో వచ్చేవరకూ ఎవడు కూర్చుంటాడు?" వీలైనంత తొందరలో వాడిని అంతం చేయడం, ఆపైన నీ మొగుడికి విడాకు లిచ్చి ... మన మిద్దరం హాయిగా ..." జానకిని దగ్గర దగ్గరగా తీసుకుంటూ అన్నాడు. నీతి లేని జంట మహానందంతో నవ్వుకుంది.

## 44

"కపాలేశ్వరా! నువ్వైనా కరుణించవయ్యా! నా వెఱ్ఱిగాని, ఈ బాధలన్నీ పడలేక నేగా నీవు బిచ్చ వయ్యావు? నీ పార్వతికి తీసిపోని అభిమానవతయ్యా నా రాణి. సమయసందర్భా లెరుగని అలుకలూ అభిమానాలూ ఎందుకో ఈ ఆడవాళ్ళకి!"

మద్రాసులో వుండగానే ప్రముఖ పత్రికలో తనకై తండ్రి జగపతి వేయించిన ప్రకటన చూచి నవ్వుకున్నాడు కిరణ్. అంతలోనే అదే పేజీలో కొట్టవస్తూన్నట్టు కనిపిస్తూన్న వధువరుల ఫోటో చూచి క్షణకాలం నిశ్చేష్టుడే అయ్యాడు. మనస్సు అలవిగాని అనిర్వచనీయమైన బాధతో ఆక్రోశిస్తూ మెలికలు తిరిగిపోయింది– వరుడు దివాకర్! వధువు దేవరాణి!

'రాణీ! ఎంతపని చేశావు! ఎందు కిలా చేశావు?' అని ప్రశ్నిస్తూ మతిమాలి రోదించాడు.

'ఛీ, ఇం కెందుకు నా జీవితం? ఇం కెందు కీ అర్థం లేని అన్వేషణ? రాణీ ఎందుకో నాపై విరక్తి పెట్టుకుంది. లేదా–నాలాగే చూచి చూచి వేసారి, మరొక యువకుని వివాహమాడివుంటుంది! ఎవరో ఆ అదృష్టవంతుడు! పోనీయ్; ఎవరైతే నా కేం? ఎక్కడో ఒకచోట ఆ యిద్దరూ సుఖంగా వుండాలి. అంతే...

'కాని...కాని చచ్చేముందు ఒక్కసారి రాణీనీ, రాయుడుగారినీ కల్సుకోవాలి. ఎందు కిలా జరిగిందో వారి ముఖతః యదార్థం వినాలి.'

ఏడెనిమిది నెలలుగా తన జాడా జవాబులు ఎవరికీ తెలియనీయకుండా ఉపేక్ష

చేస్తూ వచ్చిన కిరణ్ నేడు శ్రద్ధగా ఉత్తరాలు వ్రాశాడు అందరికీ.

"డియర్ గోపాల్!

నీ సలహా సహకారాలతో ప్రారంభించబడిన నా అన్వేషణ ముగిసే సూచనలు లేవు. కాని త్వరలోనే ముగియగలదని అంతరాత్మ చెప్తున్నది. ఒకటి మాత్రం నిశ్చయంగా చెప్పగలను - నా ఈ ప్రణయ వృత్తాంతం అసంపూర్ణ ప్రణయగాథగానే సమాప్తి జెందగలదు. ఇవి నా మాటలు కావు. ఒకప్పుడు దేవరాణి చెప్పినవే. ఆమె ఏ మాట అన్నా, ఏ జోస్యం చెప్పినా జరిగింది. కాని అప్పట్లో నేనే అర్థం చేసుకోలేక ఆమెను తూలనాడాను. అప్పుడే నాకు కొంత సహనం ఉంటే, ఈ విషాదగాథ జరుగకపోవునేమో!

రాణికోసం పరితపిస్తూ సుఖశాంతులకు దూరమైన నేను ఎప్పు దేమౌతానో తెలియదు. అందుకే ఇప్పుడే వ్రాసేస్తున్నాను. రాణిలేని నా జీవితం అనవసరం. ఇహలోకవాసిని అయినా - ఆమెను జేరినప్పుడే నా ఆత్మ శాంతించగలదు.

నా ఆయుఃప్రమాణం అంతమవ్వబోతున్నదనీ, ఇక ఆట్టే రోజులు వుండవనీ ఏదో అదృశ్యశక్తి పదేపదే నా ఎదుట నిలచి ఘోషిస్తూన్నట్లు అనుభవమౌతున్నది. అదే నిజమైతే ఆఖరుక్షణంలో ఎవరిని తలచుకొంటానో తెలుసా? దైవంతోపాటు మిమ్మల్నే!- పునర్జన్మ అనేది వుంటే, నీవే నా ప్రాణస్నేహితుడవు కావాలనీ, రాణీయే నా జీవన సహచారిణి కావాలనీ, అమృతాంతరంగిణి ఇంద్రాణే నాకు మాతృమూర్తి కావాలనీ...నా ఉనికిని బుద్ధిపూర్వకంగానే తెలియపరచలేదు. తెల్సుకోవడానికి ఇబ్బందిపడకు, బాధపడకు; అదృష్టముంటే కలుపుతాడు దైవం తిరిగి; అంతే.

— ప్రియమిత్రుడు, వర్మ."

"శ్రీమతి కమల, శ్రీ జగపతివర్మగార్లకు కిరణ్ వ్రాసేది - మీకు వ్యక్తుల ప్రాణాలకంటె ధనమే ప్రధానం. మీరే డబ్బు - డబ్బే మీరు.

మీరు చేసిన కుచేష్టితా లన్నీ నాకు తెలియకపోలేదు. మీకు నాకంటె, నా సుఖంకంటె మీ అధికారమూ, మీ ధనపిపాసే ముఖ్యమయ్యాయి. మంచిది. అందుకే నిష్క్రమిస్తున్నాను — మీ కుటుంబంనుండేకాక మీవంటి మూర్ఖులతోనే నిండివున్న ఈ ప్రపంచంనుండే నిష్క్రమించాలని ఆలోచిస్తున్నాను. నాకోసం వృథా ప్రయత్నాలు చేసి నష్టపోకండి. మీ పత్రికా ప్రకటనలు చూచాను. నే నిక దక్కను. బ్రతికినా, చచ్చినా మీకు తెలియదు. ఎక్కడో - ఏమూలో దిక్కులేకుండా ... సరే, ఆ విషయం మీకు అనవసరం.

# ఈ సంచికలో

పాలగుమ్మి విశ్వనాథం ★ ఏ తప్పు అయినా ఒకేసారి చేయండి

కాశీనాథ రఘునాథమిత్ర ★ లక్ష్మి (సంక్షిప్తనవల)

విజయలక్ష్మి ★ మల్లెతోట

ముప్పాళ రంగనాయకమ్మ ★ ఇదే నా న్యాయం (పెద్దకథ)

అవసరాల నారాయణరావు ★ అర్థం కాని అంతర్యాలు

కె. రామలక్ష్మి ★ చీకటిదారి (పెద్దకథ)

పణతుల రామచంద్రయ్య ★ దక్షిణ నాయకుడు

కౌసల్యాదేవి ★ చక్రవాకం (సీరియల్)

ముఖచిత్రం: లేత వెలుగు

చిత్రకారుడు: వడ్డాది పాపయ్య

---

యువ సాలు చందా — 12-00

దీపావళి ప్రత్యేకసంచికతో — 17-00

యువ, పోస్ట్ బాక్స్ 216, హైదరాబాద్-1

చిన్న దెబ్బ కూడా పుండు కాగలదు. బర్నాల్ తక్షణం ఉపయోగించండి.

**మండనటువంటి**
**బర్నాల్**
**మూలంగా గాయం**
**త్వరగా మానుతుంది.**



# నేడే బర్నాల్ కొనండి—ఎప్పుడైనా అవసరం కలగొచ్చు!








బర్నాల్ మూలంగా గాయం త్వరగా మానుతుంది:
సాధారణ మలాం యొక్క రోగ నాశకతత్వం దాని జిగురు పదార్థంలో వుండుటమూలంగా గాయం మీద దాని ప్రభావం వెంటనే పడదు. గాయానికి చీము పడితే అది మానడానికి చాలా సేపు పడుతుంది.
కాని బర్నాల్ యొక్క రోగ నాశకతత్వం పైనే వుండుట మూలంగా, గాయం మీద వెంటనే ప్రభావం పడుతుంది— గాయం త్వరగా మానుతుంది. మండనటువంటి బర్నాల్ పిల్లలకు కూడా రాయవచ్చు.

## కోతలు, కాల్పులు, పుండ్లు, గాయాలు, దెబ్బలకు బర్నాల్ రాయండి.

25 గ్రా. రూ. 1.50
10 గ్రా. రూ. 0.90
పన్నులు అదనం

బర్నాల్— బూట్స్ యొక్క రోగ నాశక మందు క్రీం

Shilpi B 1/67 Tel.




మే నెల యువ అత్యంతాకర్షణీయంగా వుంది. ముఖ్యంగా వడ్డాదివారి వర్ణచిత్రాలు అమోఘంగా వున్నవి. కథలలో "ఆద్యంతాలు" "చైతన్య ప్రవంతి" 'ముసలమ్మమరణం" చాలా బాగున్నాయి. ఈ రచయిత లందరికీ నా కృతజ్ఞత లందజేయగలరు.

జే. సత్యనారాయణ
గోదావరిఖని_2

మేనెల సంచికలో ప్రచురించిన మీ సంపాదకీయంతో నేను పూర్తిగా ఏకీభవిస్తున్నాను. ఇప్పటికైనా ప్రభుత్వం తమ విధులను సక్రమంగా నిర్వర్తిస్తుందని, మానవసేవకు పాటుపడుతుందని ఆశిద్దాం.

వేము శ్రీరామచంద్రమూర్తి
హైదరాబాద్.

'మే' సంచిక యువలోని ఊర్వశి గారి ఆధ్యంతాలు కథను చదివినాను. అంత మంచికథ రచించిన ఊర్వశిగారికీ, ప్రచురించిన మీకూ మా ధన్యవాదాలు. ముప్పాళ రంగనాయకమ్మగారి "ఇదే నా న్యాయం" చాల రసవంతంగా ఉంది.

చిల్లా శేషు, సాంబశివరావు
చండీఘర్_3



మేనెల యువలోని కథలన్నీ బాగున్నవి. ముఖ్యంగా "స్వయంసిద్ధ" సంక్షిప్త నవల చాలా బాగున్నది. అందులో చండి వాక్చాతుర్యము చాలా రమణీయముగా ఉన్నది. ఇటువంటి ఉత్తమ నవలలు వెండితెర కెక్కితే మనోరంజకముగా ఆనంద దాయకముగా ఉంటుంది. రచయితకు నా ధన్యవాదాలు.

సందక సుబ్బారావు, అనపర్తి.

యువ పత్రిక ప్రతినెలా చదివే పాఠకులలో నేనొకడను. ఈనెల మీ పత్రిక ముఖచిత్రం 'అహింసాజ్యోతి' పత్రికకు వన్నెతెచ్చింది. ఈనెల సంపాదకీయం చాల బాగుంది. 'చీకటిదారి' కథ చాల బాగుంది. రచయిత్రిగారికి నా ధన్యవాదములు. సీరియల్స్ రెండునూ ('ఇదే నా న్యాయం'; 'చక్రవాకం') సస్పెన్స్‌లో నడుస్తున్నవి.

ఆళ్ళ గంగరాజు, పాలకోడేరు.

మేనెలలో ప్రచురించిన "స్వయంసిద్ధ" కథ చాల బాగున్నది. దానిని వ్రాసిన "నందోపాధ్యాయ" గారికి మా హృదయపూర్వక వందనములు. 'చీకటిదారి' కథ చాల బాగున్నది. చదువరులను ఎంతో ఆకర్షించుచున్నది. "చక్రవాకం" సీరియల్ చాల బాగున్నది. రచయితకు నా అభివందనములు. జూన్ నెల యువ గురించి ఎదురు చూస్తున్నాము.

కె. శ్రీనివాసరావు, నంద్యాల.

యువ
సచిత్ర మాస పత్రిక

సంచాలకుడు: చక్రపాణి

సంపుటి 15 జూన్, 1967 సంచిక 6

భారత రాష్ట్రపతి ఎన్నిక విషయంలో ఆసేతుహిమాచలపర్యంతం మూడు వారాలపాటు రేగిన దుమారం, మే తొమ్మిదవ తేదీతో చప్పబడింది. రాష్ట్రపతిగా డాక్టర్ రాధాకృష్ణన్ స్థానే డాక్టర్ జాకిర్ హుస్సేన్ ఎన్నిక అయారు. అంతకుముందే, ఉపరాష్ట్రపతిగా శ్రీ వరహాగిరి వెంకటగిరి ఎన్నిక అయారు.

ఉపరాష్ట్రపతి ఎన్నిక విషయంలో చెప్పుకోదగిన తర్క వితర్కాలు ఏమీ తలఎత్తలేదు. కాని, రాష్ట్రపతి ఎన్నిక విషయంలో మాత్రం వాదోపవాదాలు, తర్క వితర్కాలు విపరీతంగా తల యెత్తినవి.

డాక్టర్ జాకిర్‌హుస్సేన్ కాంగ్రెసుపార్టీ అభ్యర్థిగనుక ఆయనను ఎలాగయినా ఓడించాలనేవారు కొందరూ; ఆయన ముస్లింగనుక ఆయనను రాష్ట్రపతిగా ఎన్నిక కానివ్వకూడదనేవారు కొందరూ. ఈరెండు వాదాలూ కూడా అర్థంలేనివి. కాంగ్రెసు పార్టీకి రాష్ట్ర శాసనసభలలోనూ, పార్లమెంటులోనూ రాష్ట్రపతిని ఎన్నుకోడానికి కావలసిన ఓట్లుగల సభ్యులు వున్నప్పుడు, ఆపార్టీ నిలబెట్టినవ్యక్తి గెలుస్తాడన్న నమ్మకం ఉన్నప్పుడు, తమ యిష్టంవచ్చిన వ్యక్తిని నిలబెట్టడానికి ఆపార్టీకి హక్కుఉన్నది. అలాంటి హక్కును వదలుకోవడానికి ఏపార్టీ అయినా

అంగీకరించదు. తాము నిలబెట్టిన అభ్యర్థి గెలిచే అవకాశం లేకపోయినా, కాంగ్రెసు పార్టీవ్యక్తులే ఆపార్టీకి ద్రోహం చేసి ప్రతిపక్షపు అభ్యర్థికి ఓటు చేస్తారనే ఆశతో అభ్యర్థిని నిలబెట్టిన ప్రతిపక్షాలవారు నిజంగా తమ అభ్యర్థి గెలిచే అవకాశం వుంటే ఆ అవకాశాన్ని ఏమాత్రమయినా వదలిపెట్టేవారా? అలాటప్పుడు, కాంగ్రెసు పార్టీని దుయ్యబట్టడ మెందుకు?

ఇక డాక్టర్ జాకిర్ హుస్సేన్ ముస్లింగనుక ఆయనను రాష్ట్రపతిగా ఎన్నుకో కూడదనే వాదంమాట. పరమత సహనానికి ప్రపంచ విఖ్యాతి పొందిన హిందువులు గాని, సర్వమత సమతాభావానికి ప్రసిద్ధిపొందిన భారతీయులు గాని మతాన్ని ఒక సమస్యగా పరిగణించి రాష్ట్రపతి ఎన్నికను జరుపగోరడం భారతీయ ప్రజలకు గాని, భారత దేశానికిగాని శ్రేయస్కరంకాదు. భారతీయులు, ముఖ్యంగా హిందువులు, ఆలాంటి భేదబుద్ధి కలవారుకారని డాక్టర్ జాకిర్ హుస్సేన్ ఎన్నికతో స్పష్టపడింది. భారతీయుల సర్వమత సమతాభావమూ, హిందువుల పరమత సహన సత్స్వభావమూ ప్రపంచానికి స్పష్టంగా ప్రకటింపబడినవి.

భారతదేశంలో హిందువులు ముస్లిములను నానాబాధలు పెడుతున్నారనీ, అనాదరణముతో చూస్తున్నారనీ దుష్ప్రచారం చేస్తున్న పాకిస్తాన్, ముస్లింతప్ప మరే మతస్తుడూ తమదేశానికి అధ్యక్షుడుగా వుండకూడదని రాజ్యాంగ విధానంలో నిర్ణయించిన పాకిస్తాన్, హిందువులను నానాహింసలపాలు జేస్తూ ప్రతిదినమూ వేల సంఖ్యలో హిందువులు దేశాన్ని వదలి భారతదేశానికి వెళ్ళిపోవలసిన పరిస్థితులను కల్పిస్తున్న పాకిస్తాన్, సిగ్గుతో తల వంచుకొనేటట్లు చేశారు భారతీయులు. భారత దేశంలో ఎంత గొప్పపదవి నైనా పొందడానికి వ్యక్తిగతంగా ఉన్న అర్హత తప్ప, కులంగాని, మతంగాని అడ్డుపడవనీ, ప్రతిభారతీయుడూ తక్కిన తన సోదర భారతీయులతో సమానమైన హక్కులను అనుభవించగలడనీ రుజువు చేశారు భారతీయులు.

ప్రజారాజ్య విధానంలో ప్రజలచే ఎన్నుకోబడే ప్రతిపదవి విషయంలోనూ పోటీ వుంటుంది. పోటీ లేకుండా పదవులను పొందేవిధానం నియంతృత్వరాజ్యాలలో

వుండవలసిందే కాని ప్రజారాజ్యాలలోకాదు. అందుచేత రాష్ట్రపతి పదవి విషయములో పోటీ జరిగిందంటే తప్పు ఏమీలేదు. రాష్ట్రపతి పదవికి డాక్టర్ జాకిర్ హుస్సేన్ కాక మరొక పదహారుమంది పోటీ చేశారు. రాష్ట్రపతిని ఎన్నుకోవలసిన శాసన సభ్యులూ, పార్లమెంటు సభ్యులూ కుల, మత, వర్గ పక్షపాతాలను చూపినట్లయితే ఎన్నిక ఫలితం మరొక విధంగా వుండేది. అలాకాక, అభ్యర్థుల అర్హతానర్హతల విషయంలో తమకున్న విశ్వాసాలను ప్రకటించడంవల్ల నైతేనేమి, పార్టీ నియమాలను పాటించడంవల్ల నైతేనేమి, కుల, మత, వర్గ పక్షపాతాలను మాత్రం ప్రదర్శించకుండా శాసన సభ్యులూ, పార్లమెంటు సభ్యులూ ఓటు వేశారని, ఫలితాన్ని బట్టి స్పష్ట మౌతూవున్నది.

అయితే, యీ పోటీలో కోకా సుబ్బారావుగారు పాల్గొనకుండా వుంటే బాగుండేది. పోటీ చెయ్యడానికి ఆయనకు సంపూర్ణమైన హక్కు వున్నమాట నిజమే; పోటీలో గెలవడానికి మంచి అవకాశం వుందన్న భావానికి తగిన పరిస్థితులు వున్నమాట నిజమే. కాని, భారతదేశానికి ప్రధానన్యాయమూర్తిగా వున్నవ్యక్తి, రాష్ట్రపతి పదవిపై వ్యామోహాన్ని ప్రదర్శించడం చాలామందికి ఉచితంగా కనిపించలేదు. కాంగ్రెసు పార్టీవా రెవరూ ఆయనకు ఓటు చెయ్యక, కేవలం ప్రతిపక్షాల వారే ఓటు చేసినట్లయితే ఆ సుబ్బారావుగారు గెలవజాలరు. పార్టీకి ద్రోహం చేసి కొంతమంది కాంగ్రెసువారు తనకు ఓటు చేస్తారని, ప్రధానన్యాయమూర్తిగా పని చేసిన వ్యక్తి ఆశించడం ఏమాత్రం సబబుగా లేదని చాలా మంది భావించారు. ఈ కారణంవల్లనే ప్రతిపక్షాలకు చెందినవారుకూడా కొంత మంది సుబ్బారావుగారికి ఓటు చెయ్యకపోవడం జరిగిందని కొందరి ఊహ. ఏమయినా, డాక్టర్ జాకిర్ హుస్సేన్ రాష్ట్రపతిగా ఎన్నికకావడం భారతదేశపు ప్రతిష్ఠను ఇనుమడింపజేసింది. ఇది భారతీయులందరూ సంతోషించవలసిన విషయం. అంతేగాక, భారతదేశంలోని అన్ని ఇతర మతాలవారికీ, ఎంతగొప్ప పదవి విషయంలోనైనా హిందువులు మత ద్వేష మనే సంకుచితబుద్ధిని ప్రదర్శించరని స్పష్టపడింది. ఈ ఉన్నతభావాన్ని ఇప్పటికైనా సరిగ్గా అర్థం చేసుకొని, మతం పేరిట పార్టీలను స్థాపించినవారు అలాంటి పార్టీలకు ఉద్వాసన చెప్పి, ఆర్థిక ప్రణాళికల ప్రాతిపదికగా ఏర్పడిన పార్టీలలో చేరడం మంచిది. మతప్రమేయం

లేని రాజ్యాంగవిధానం గల భారతదేశంలో మతం పేరిట పార్టీలు ఉండకూడదు. అలాటి పార్టీలను స్థాపించినవారు ఇప్పటికైనా తమ పొరపాటును గ్రహించు కోవడం మంచిది.

ఉపరాష్ట్రపతి ఎన్నికకూడా చక్కని పద్ధతిలో జరిగింది. ఈ పదవికి పోటీ చేసిన గిరిగారికి వ్యక్తిగతంగా ఆయనకు ఉన్న అర్హతను బట్టే ఓట్లు పడ్డాయి. ట్రేడ్‌యూనియన్ ఉద్యమం అంటే ఏమిటో కార్మికులకు తెలియని రోజులలో, ఈ ఉద్యమాన్ని ఏమాత్రం తలయెత్తకుండా చెయ్యడానికి అన్ని విధాలా ప్రయత్నిం చిన బ్రిటిషు గవర్నమెంటు పరిపాలనాకాలంలో, ఎంతో ధైర్యంతో, యీ ఉద్యమాన్ని సాగించి, ఎన్నికష్టాలు అనుభవించినా ఏమాత్రం చలించక, సక్రమమైన పద్ధతులలో యీ వుద్యమాన్ని నిలబెట్టిన వీరపురుషుడు శ్రీ గిరి. అంతే కాదు; తనకు చేతనైన సహాయం అడిగిన ప్రతివారికీ చెయ్యడమే గాని, ఎన్నడూ, ఎవరికీ, ఏ విధమైన కష్టాన్నీ కలుగనివ్వని సత్పురుషుడు శ్రీ గిరి. కార్మికనాయకుడుగానూ, దేశభక్తుడుగానూ త్యాగాలు చెయ్యడమే కాక, మంత్రిగానూ, రాయబారిగానూ, గవర్నరుగానూ పరిపాలనాదక్షత ప్రదర్శించిన సమర్థుడు శ్రీ గిరి. ఉపరాష్ట్రపతిగా వున్న డాక్టర్ జాకిర్‌హుస్సేన్‌ను రాష్ట్రపతి పదవికి అభ్యర్థిగా కాంగ్రెసు పార్టీ నిర్ణయించినందున, శ్రీ గిరిని ఉపరాష్ట్రపతి పదవికి అభ్యర్థిగా నిర్ణయించడం జరిగింది. లేకపోతే, రాష్ట్రపతిగానే శ్రీ గిరిని ఎన్నిక చేసుకొని వుండవచ్చును. ఇప్పటివరకూ, రాజేంద్రబాబూతరువాత రాష్ట్రపతిగా ఎన్నిక అయిన డాక్టర్ రాధాకృష్ణన్, డాక్టర్ జాకిర్‌హుస్సేన్‌లు ఉపరాష్ట్రపతులుగా వుండి రాష్ట్రపతులు అయారు గనుక, ఈనాడు ఉపరాష్ట్రపతిగా ఎన్నిక అయిన శ్రీ గిరి, అయిదేళ్ళ తరువాత రాష్ట్రపతిగా ఎన్నుకోబడితే భారతీయులంతా సంతోషిస్తారు.

———

# చిత్రవార్తలు



రాష్ట్రపతి ఎన్నిక రోజున వోటింగు కేంద్రాన్ని సందర్శి స్తున్న రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి

శ్రీమతి ఇందిరాగాంధీ, న్యూఢిల్లీలో భారత అధ్యక్ష, ఉపాధ్యక్ష ఎన్నికలప్పుడు, తన వోటు నివ్వడానికి బ్యాలెట్ పత్రములను తీసుకుంటున్న దృశ్యము





ప్రధానన్యాయమూర్తి శ్రీ కె. ఎన్. వాంచూ సమక్షంలో డాక్టర్ జాకిర్‌హుస్సేన్ తృతీయ భారత అధ్యక్షుడుగా ప్రమాణస్వీకారము చేయుచున్నారు. పదవీ విరమణ చేసిన ద్వితీయ భారత అధ్యక్షుడు డా. రాధాకృష్ణన్ ప్రక్కనే ఉన్నారు

---

నూతన భారత ఉపాధ్యక్షుడు శ్రీ వి. వి. గిరి ప్రమాణస్వీకారానంతరం రాజఘాట్‌లోని మహాత్మాగాంధీ సమాధిపై పూలదండను ఉంచుతున్నదృశ్యము



# మన రాష్ట్రపతి డా. జాకిర్ హుస్సేన్



మనది లౌకికరాజ్యం. మన దేశనాయకులు మొదటినుంచీ సెక్యులరిజానికి ఇచ్చిన ప్రాధాన్యం మనకు బాగా తెలుసు. మొన్న రాష్ట్రపతి ఎన్నికల్లో ఎవరిని విజయం వరిస్తుందని ప్రపంచమంతా ఎంతో ఆసక్తితో ఎదురుచూసింది. డాక్టరు జాకిర్ హుస్సేన్ నెగ్గారని తెలియగానే అది ఆయన వ్యక్తిగత విజయంగా భావించబడలేదు మనం నమ్మిన కొన్ని విలువలకు కొన్ని అందమైన ఆదర్శాలకు అది ఘన విజయంగా భావించబడింది. ఇలా అనడంవల్ల డా॥ జాకిర్ హుస్సేన్ ప్రత్యర్థులను కించపరచే ఉద్దేశం ఏమీలేదు. అయితే ఒకమైనారిటీవర్గానికి చెందిన మనీషి అత్యున్నత పదవిని అలంకరించాడంటే దాని అర్థం మనదేశంలో ప్రజాస్వామ్యం మూడుపువ్వులూ ఆరుకాయలుగా వున్నదని.

డాక్టరు జాకిర్ హుస్సేన్ ఫిబ్రవరి 8 వ తారీకున 1897 లో హైదరాబాదులో ఒక మధ్యతరగతి పఠాన్ కుటుంబంలో జన్మించారు. వారి జనకులు న్యాయవాద వృత్తిలో వుండేవారు. జాకిర్ హుస్సేనుకు ఎనిమిదేండ్లు నిండకముందే కుటుంబం

ఉత్తరప్రదేశ్ వెళ్ళిపోయింది. ఆలీఘడ్ విశ్వవిద్యాలయంలోనూ, బెర్లిన్ విశ్వవిద్యాలయంలోనూ ఆయన చదువుకున్నారు. ఆయన డాక్టరేటు బెర్లిన్ విశ్వవిద్యాలయం నుండి పొందారు.

భారత స్వాతంత్ర్య పోరాట సమయంలో ఎందరో మహానుభావులు ఎన్నో గొప్ప గొప్ప త్యాగాలు చేశారు. కులమత వివక్షత లేకుండా అందరూ ఉద్యమంలో పాల్గొన్నారు. ఆ సమయంలో ఎందరో జాతీయవాదులైన ముస్లిములుకూడా ఎనలేని కృషీ త్యాగమూ చేశారు. మౌలానా అబుల్‌కలం ఆజాద్, డా॥ జాకిర్ హుస్సేన్ ఆ కోవకు చెందినవారు.

భారతదేశ పద్ధతుల్లో భారతీయాత్మ సరిగ్గా ప్రతిఫలించే రీతి విద్యావిధానం వుండాలని గాంధీజీ ఆశించారు. 1937 లో ఏర్పాటైన ప్రాతిపదిక జాతీయ విద్యా సంఘానికి డా॥ జాకిర్ హుస్సేన్ అధ్యక్షులుగా వ్యవహరించారు. 1938 నుండి పదేళ్లు ఆయన సేవాగ్రాంలోని హిందూస్థానీ తాల్మి సంఘానికి సారథ్యం వహించారు.

మనదేశంలోని ప్రముఖ విద్యావేత్తలలో ఆయన వొకరు. కళాశాలల్లో మాతృభాషలో విద్యగరపాలని ఆయన అభిప్రాయం. ఢిల్లీలోని జమియామిల్లియా ఉపాధ్యక్షులుగా ఆయన 22 ఏళ్ళు ఉన్నారు. ఈ కాలంలో ఆయన ఉర్దూ భాషాభివృద్ధికి బాగా తోడ్పడ్డారు. ఆలీఘడ్ విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులుగా ఆయన ఎనిమిదేళ్ళు ఉన్నారు.

1957 లో ఆయన బీహార్ గవర్నరుగా నియమింపబడ్డారు. 1962 మేలో ఆయన భారత రిపబ్లిక్‌కు ఉపరాష్ట్రపతి అయ్యారు. రాజ్యసభ ఛైర్మన్‌గా ఆయన కార్య నిర్వహణ శ్లాఘనీయమైనది. ప్రతిపక్ష సభ్యులుకూడా ఆయన నిష్పాక్షికతకూ హుందాతనానికీ ఎదుటివారి హృదయాన్ని అర్థం చేసుకునే గ్రహణశక్తికీ జోహార్లు అర్పించారు.

1954 లో డా॥ జాకిర్ హుస్సేనుకు పద్మవిభూషణ బిరుదు ప్రదానం జరిగింది. 1963 లో ఆయన భారతరత్న అయ్యారు. డా॥ జాకిర్ హుస్సేన్ పేరు అన్ని దేశాల్లో సుపరిచితం. విద్యారంగంలో నేమి, ప్రెస్ కమిషన్లోనేమి, రాజ్యసభలో నేమి ఆయన చేసిన కృషీ సేవా చిరస్మరణీయమైనవి. మనం కంటున్న ఎన్నో కలలు ఇంకానెరవేరాలి. మూడు ప్రణాళికలు అమలు జరిగినా సామాన్యుడి జీవితం మారలేదు. చెప్పుకోదగ్గగా, రానున్న అయిదేళ్ళలో జీవిత ప్రమాణాలు పెరుగుతాయని ఆశిద్దాం.

భారతదేశం సహనానికీ, ఉత్తమ సంప్రదాయాలకూ పుట్టినిల్లు. మన సెక్యులరిజానికి జయపతాక నేడు జాకిర్ హుస్సేను.ఆయన పరిపాలనాకాలంలో సామాన్యుని జీవితం శోభాయమానంగా ఉండాలని మా అకాంక్ష — ఆయనకు మా శుభాకాంక్షలు.

# ఏ తప్పు అయినా ఒక్కసారి చేయండి

పాలగుమ్మి విశ్వనాథం




రైలు ఆగటంతోనే, ఓ చిన్న థర్డుక్లాస్ కంపార్టుమెంటులో, బిలబిల మంటూ జొరబడ్డారు ఆ పన్నెండుగురూ. అంతా ఒకేరకమైన నీలపురంగు స్పోర్టింగ్ కోట్లు తెల్లని నిక్కర్లు తొడుక్కున్నారు. కోటు పై జేబు మీద ఫుట్‌బాల్ బంతి

బొమ్మ ఉంది. బంతి కిందభాగంలో అర్ధ చంద్రాకారంగా తెల్లటి అక్షరాలతో 'మెర్రీ టైగర్స్' అని వ్రాసిఉన్నది. మెర్రీకంపెనీ ఫుట్‌బాల్‌టీమ్ అది. మరుసటి రోజు ఉదయంనుంచీ ప్రారంభం అయే టోర్నమెంట్‌లో పాల్గొనడానికి ఆ టీమ్ వెళుతోంది. కంపార్టుమెంట్‌లో తలుపుకి అడ్డంగా రాములు నించుని 'ఇది రిజర్వుడ్ కంపార్టుమెంట్' అని లోపలికి ఎవరినీ రానివ్వకుండా అడ్డేస్తున్నాడు.

"రాములుగాడు గోలులో నుంచుని బంతులు ఆపేస్తున్నట్టు గుమ్మంలో నుంచుని జనాన్ని ఆపేస్తున్నాడు." అన్నాడు ఆ టీమ్‌కి కెప్టెన్ అయిన రహీమ్.

"రేపు ఫీల్డులో మనుషుల్నే ఆపుతాడో లేక బంతుల్నే ఆపుతాడో చూడాలి," అన్నాడు ఫుల్‌బాక్ పూర్ణయ్య.

"నువ్వు దద్దమ్మవి అయి, బంతి నా దాకా రానిస్తే, ఆ పైసంగతి నేను చూసుకుంటాలే," అన్నాడు తలుపు దగ్గరనుంచే, రాములు.

"ఏరా రాములూ! ఇన్నేళ్ళలోనూ, నీ దగ్గరకి ఎన్నిసార్లు వచ్చిందిరా బంతి," అన్నాడు రహీమ్.

"రాములుగాడు ఏ మేచ్‌లో చూసినా, గోలులో పోలుకి జారబడి, రాత్రి ఎటు కేసి వేటకి వెళ్లడమా అని తీరుబడిగా ఆలోచిస్తుంటా," డన్నాడు లెఫ్ట్ ఫార్వర్డు సుబ్బయ్య. ఇంతలో రైలు కదిలింది. 'రిజర్వుడ్' అని అచ్చువేసిన కాగితాలు రెండు తీసి కంపార్టుమెంట్ రెండు పక్కలా అంటించేశాడు, సెంటర్ ఫార్వర్డు పిచ్చయ్య.

"ఆ కాగితాలు ఎక్కడ సంపాదించావురా," అన్నాడు లెఫ్ట్ అవుట్ సు

"మనకి ఉండవలసినచోటుల్లో ఫ్రెండు అట్టిపెట్టానులే," అంటూ జేబులోంచి ఓ తాళం తీసి రెండు తలుపులూ తాళం తిప్పేశాడు పిచ్చయ్య. "అదేం పనిరా? ఈ పెట్టె అంతా మనం ఒక్కళ్లమే కంట్రాక్టు పుచ్చుకున్నామా?" అన్నాడు రైట్ ఇన్ సత్యం.

"ఆఁ చెప్పొచ్చేవులే! రాత్రంతా ఈ పెట్టెలో జాగారం చేసి, రేపు ప్రొద్దుట ఫీల్డులో నిలబడాలా? మీ అందరికోసం ఈ ఏర్పాటు అంతా చేస్తే పైగా నీతులు చెపుతున్నావా?" అన్నాడు పిచ్చయ్య.

"అవునుకాని మనకి ఈ థర్డుక్లాస్ కర్మ ఏమిట్రా! మునుపు సెకండ్ క్లాస్ కంపార్టుమెంట్ ప్రత్యేకంగా మనకి ఇచ్చేవారు. మునుపు రోజుకి 5 రూపాయలు బేటా ఇచ్చేవారు. ఇప్పుడు 2 రూపాయలు కోసేశారు," అన్నాడు రైట్ అవుట్ రంగారావు.

"పూర్వం ఈ ఏర్పాట్లన్నీ పెద్దదొర స్వయంగా చూసేవాడు. ఎకానమీడ్రైవ్ అంటూ మేనేజర్ ఇవన్నీ కోసేశాడు," అన్నాడు రహీమ్.

"మనం పెద్దదొరతో ఇవన్నీ చెపితే?" అన్నాడు సుబ్బయ్య.

"మనకి స్వతంత్రం వచ్చిందిగా! విదేశీ కంపెనీలు ఒక్కొక్కటే పెత్తనం ఇక్కడి వాళ్లకి అప్పగించి, తెల్లవాళ్ళు వెళ్ళిపోతున్నారు. అందుచేత మనదొర ఈ విషయాలేమీ పట్టించుకోడం లేదు. పూర్వం ఫుట్‌బాల్ కోసమే ఉద్యోగాలిచ్చేవారు. రోజూ ప్రాక్టీసు చేస్తూంటే, దొర స్వయంగా వచ్చి చూచేవాడు.

ర్నమెంట్సు ఉంటే ఒక నెల ముందు
ంచీ వేరే పనేమీ ఉండేది కాదు. ఇప్పు
డుతే సాయంత్రం 5 గంటలదాకా పని
ంసి అప్పుడు మాచ్ ఆడవలసి వస్తోంది.
ఒకగంట పర్మిషన్ ఇవ్వడానికి కూడా
గొడవ చేస్తున్నారు. ఈ ఫుట్ బాల్ ఆడే
వాళ్ళవల్ల ఇన్ని గంటల పని నష్టం
అవుతోందని లెక్కలు తయారు చేస్తున్నా
రట కొందరు. పెద్దదొర వెళ్ళిపోయాక
మన మొహం చూసేవా డెవడైనా
ఉంటాడో ఉండడో! ఏమైనా సరే ఈ
టోర్నమెంట్ గెలిచి తీరాలి. మన దొర
పేరుతో ఉన్న రోలింగ్ షీల్డు ఈ సంవత్సరం
కూడా మనం గెలిస్తే ఎప్పటికీ మనదే
అయిపోతుంది. మనం బయలుదేరేముందు
పెద్దదొరే పిలిచి చెప్పాడు– రెండునెల్లో
తన దేశం వెళ్ళిపోతాట్ట, ఫైనల్సు
చూడడానికి వస్తానన్నాడు," అని
చెప్పాడు రహీమ్, బయట మబ్బు కమ్మి
చల్లటి గాలి వస్తోంది. పాసింజర్ ఎక్కడా
తొందర లేకుండా ఖండగతిలో నడు
స్తోంది. "పేకలు తియ్యండిరా," అన్నాడు
రహీమ్. జోడుపేకలు జోడించి రమ్మీ
మొదలెట్టారు. గోల్ కీపర్ రాములు
"నా దగ్గర డబ్బులు లేవ్రా," అంటూ
సంచీలోంచి ఓ తెలుగు డిటెక్టివ్ నవల
తీసి చదువుతూ కూర్చున్నాడు. పేకాట
జోరుగా నడుస్తోంది. వేరుశనక్కాయ
తొక్కలు కుప్పలుగా చేరి ఎవరి కాలన్నా
పడగానే చప్పుడు చేస్తున్నాయి. స్టేషన్లు
వస్తున్నాయి, పోతున్నాయి. రెండు
గంటలు ఏకటాకీని నడిచింది ఆట. "వచ్చే
స్టేషన్‌లో ఖాళీగా ఉన్నవాళ్లు వెళ్ళి
కాఫీలు పట్టండ్రా," అని పురామాయించి
రహీమ్ తిరిగి ఆటలో పడ్డాడు. తర్వాత
స్టేషన్ వచ్చి ఎంతసే పయిందో తెలియ
లేదు పేకాటలోవాళ్ళకి. సూరి, సత్యం
వెళ్లి ఫలహారాలూ, కాఫీ తేవడంతో ఆట
ఆగింది. "రాములు ఎక్కడరా, కను
పించటం లేదు," అన్నాడు అటూ ఇటూ
చూస్తూ రహీమ్ నాకు తెలియదంటే
నాకు తెలియదన్నారు అంతా. రైలుకూత
వెయ్యడంతోటే కిటికీలలోంచి తలలు
పెట్టి బయటకు చూశారు అంతా. రాములు
కదులుతోన్న రైలు తలుపు తీసి ఓ 20 ఏళ్ల
అమ్మాయిని లోపలికి ఎక్కించి, ఆ
అమ్మాయి తాలూకు ట్రంకు పెట్టె లోప
లికి తోసి, అప్పటికే వేగం ఎక్కువ అవు
తూన్న రైలులో ఓ ఎగురు ఎగిరి లోపలికి
వచ్చాడు. లోపల బల్లలమీద ఎవరన్నా
చోటిస్తారేమో అని కాసేపు చూసి, తన
తాలూకు ట్రంకుపెట్టె మీద చతికిలబడి,
అందరివేపూ చిరునవ్వులు విసిరింది ఆ
అమ్మాయి. పేకాట నిల్చిపోయింది.
కొందరు రహీమ్ చూడకుండా ఆమెకు
సమాధానంగా చిరునవ్వు నవ్వారు.
రహీమ్ ఆ అమ్మాయివేపు చూడకుండా
రాములు కేసి చూస్తున్నాడు. రాములు
మొహం తిప్పేసి ఇంకో వేపు చూస్తు
న్నాడు. "రాములూ ఇల్లారా!" అని
పిల్చాడు రహీమ్. రాములు పిల్లిలా
వెళ్ళి పక్కన కూర్చున్నాడు.

"ఎవ రీ పిల్ల ?"

"అదే రహీమ్ భాయ్ .... మా వాళ్ల
తాలూకు...." నీళ్లు నమిలాడు రాములు.

"మీవాళ్ల పిల్లా! ఇది రిజర్వుడ్
కంపార్టుమెంట్ అని తెలియదూ? వచ్చే
స్టేషన్‌లో ఆ అమ్మాయిని ఆడవాళ్ల

పెట్టెలో ఎక్కించిరా," అన్నాడు రహీమ్ నిదానంగా. ఆ అమ్మాయి ఒక్కసారి తూర్పునుంచి పడమరదాకా మూతి విరిచింది. రాములు బ్రతిమాలుతున్నట్టు రహీమ్‌కేసి చూశాడు. "ఏం చూస్తావ్రా! కలపండి పేక," అని గద్దించాడు రహీమ్. ఉలిక్కిపడి చేతిలోని పేక కలిపి ముక్కలు పంచాడు రంగారావు. ఆట సాగుతోంది. కాని ఏదో పరీక్షలకోసం చదువుతోన్నట్టు ఉంది గాని, కేరింతాలు కొడుతూన్న పేకాటలా లేదు. పక్క స్టేషన్ రాగానే రాములుకేసి చూశాడు రహీమ్. ఆ అమ్మాయిని వెంటబెట్టుకొని వెళ్ళి ఇంకో పెట్లో ఎక్కించి వచ్చాడు రాములు.

"ఎక్కడ పట్టావురా ఈ పిట్టని," అన్నాడు రంగయ్య.

"మనవాణ్ణి అడివిలో వదిలేసినా సరే, అయిదు నిమిషాల్లో అమ్మాయిని పట్టుకొస్తాడు," అన్నాడు సత్యం. "చేతకాని దద్దమ్మలు," అన్నాడు రాములు ఉడుకుమోతుతనంగా. రహీమ్ నవ్వుతూ అతనికేసి చూశాడు. "అంతా పాడుచేశావ్ రహీమ్ భాయ్! మనం వెళ్ళే ఊరికి పై ఊరే వెడుతోందిట. మనతోపాటే దిగిపోయి, మనం వెళ్ళిపోయాక దాని ఊరు పోతానంది. చేసిన ఏర్పాటు అంతా చెడగొట్టివేశావ్! ఈ నాల్గురోజులూ ఏదో అందరికీ కాలక్షేపంగా ఉంటుం దనుకున్నాను," అన్నాడు రాములు. "ఉన్న కాలక్షేపం చాల్లేద్దూ. మనలో చాలా మంది తప్పుడుపనులు చేసినవాళ్ళమే అనుకో; కాని దేనికైనా సమయం సందర్భం వుండాలి. పైగా ఏదైనా తప్పుడుపని చెయ్యడం అంటూ వస్తే మనకున్న పెద్ద సమస్య ఏదైనా విడిపో తెరిపినబడాలి. అప్పుడు ఏ చెడ్డపని చేసి దీనికోసం చేశానని సమాధానమనా చెప్పుకోవచ్చు మనస్సుకి. అంతే అవకాశం వచ్చినప్పుడల్లా అడ్డమైన పన్లూ చేస్తుంటే దిగజారి పోవడం తప్పదు," అన్నాడు రహీమ్.

"అయితే నువ్వెప్పుడైనా తప్పుపనులు చేశావా?" అని అడిగాడు రాములు.

"నే నేమిటి! చాలామంది చేసిఉంటారు ఎప్పుడో ఒకప్పుడు," అని సమాధానం ఇచ్చాడు రహీమ్.

"నా ఉద్దేశం, నువ్వు చెప్పిన అర్థంలో, అంటే ఒక ప్రయోజనం కోసం, తప్పుపని చేశావా?" అని నిక్కచ్చిగా అడిగేడు రాములు.

"చేశాను," అన్నాడు జంకకుండా రహీమ్.

"ఏమి టదీ? మాకు చెప్పాలి;" అంటూ అంతా రహీమ్ చుట్టూ చేరారు.

"నేను చెపుతాను. కాని, మీరుకూడా ఒక్కొక్కళ్లు, వాళ్లు చేసిన పెద్ద తప్పుపని, వున్నదున్నట్టు చెప్పాలి. దీనికి మీరంతా ఒప్పుకుంటే, నేను, నే చేసిన తప్పుడు పని చెప్తాను," అని అడిగాడు రహీమ్.

ఒకళ్ళిద్దరు 'సరే' అన్నారు నీరసంగా. ఒకళ్ళిద్దరు ముందుకు రావడంతో మిగతా వాళ్లు ధైర్యంగా 'సరే' అన్నారు.

"అయితే వినండి! నేను చెప్పేదంతా మీ లోపలే ఉంచుకుంటామని హామీ ఇస్తే జరిగినదంతా ఉన్నదున్నట్టు చెపుతాను. లేకపోతే కొంత మినహాయించవలసి వస్తుంది," అని ఆగాడు రహీమ్.




"మేం ఎవ్వరికీ చెప్పం, ఒట్టు," అన్నారు అంతా.

"అయితే కథలోకి వస్తున్నా" అన్నాడు అందరికేసీ చూస్తూ. ఒక్క నిమిషం వేరుసెనక్కాయల చప్పుడు ఆగిపోయింది. జతల కళ్లూ, చెవులూ అతని కేసి తిరిగాయి.

"మూడు పువ్వులు ఆరు కాయలుగా, మూడుముక్కల ఆటలో ఆస్థి అంతా హారతి కర్పూరం చేశేసి, మా నాన్న పరలోకానికి ప్రయాణం కట్టాడు.

"అరే! రహీమ్‌భాయి తెలుగుసామెతలుకూడా మిలాయిస్తున్నాడే," అన్నాడు వెంకన్న.

"పుట్టింది గోదావరిజిల్లా, పెరిగింది గోదావరిజిల్లా, చదువు తెలుగుబడిలో, స్నేహితులంతా తెలుగువాళ్లు-ఇంకెక్కడి ఉర్దూ! ఉల్టా సీదా అయింది ఏనాడో!" ఉన్నాడు రహీమ్.

"ఒరే వెంకన్నా! రేపు ఫీల్డులో ఎదటి వాళ్ళ కాళ్ళకి మాటిమాటికీ అడ్డుపడు గానీ, ఇప్పుడు మాటమాటకీ అడ్డుతగల," కన్నాడు మూర్తి చిరాగ్గా.

"ఇంక నోరు విప్పనులేరా," అంటూ వెనక్కి తగ్గాడు వెంకన్న.

రహీమ్ తిరిగి ఆరంభించాడు. "అప్పుడు ఉద్యోగం చేయవలసిన అవసరం వచ్చింది మొదటిసారిగా. నా యోగ్యతలతో ఏ ఉద్యోగం దొరుకుతుంది నాకు. ఒకరకం బ్రతుకు బ్రతికిన ఊళ్ళోనే తల వంచుకుని బ్రతకడానికి మనస్సు ఒప్పక, హైదరాబాద్ చేరి, ఓ దూరపు బంధువుల ఇంట్లో మకాం పెట్టి తిరగడం ఆరంభించాను ఉద్యోగానికి. నాకున్న 'క్వాలిఫికేషన్' అల్లా ఆరడుగుల శరీరం, సుమారైన విగ్రహం. ఇవి చూసి ఎవడైనా ఉద్యోగం ఇవ్వాలి గాని, అంతకు మించి

ఏ విషయంలోనూ, నాకు తెలిసిచచ్చిందేమీ లేదు. మొత్తానికి ఈ క్వాలిఫికేషన్సుతోటే ఉద్యోగం దొరికింది, ఓ జోళ్ళ షాపులో సేల్స్‌మన్‌గా. అది మెయిన్ రోడ్‌లోకల్లా పెద్ద షాపు. క్రింద అంతా మగవాళ్ల జోళ్ల సెక్షన్, పైన అంతా లేడీస్, పిల్లల సెక్షన్. నేను చేరిన మూడు నెలలకి లేడీస్ సెక్షన్‌కి బదలాయించారు.

"గొప్ప ఛాన్సు కొట్టావు రహీమ్ భాయీ!" అనేసి చటుక్కుని సూరంకేసి చూశాడు వెంకన్న, అడ్డువచ్చినందు కేమన్నా అంటాడేమోనని సూరి రహీం కేసి చూస్తూ.

"ఆడవాళ్ళ కాళ్ళకి జోళ్ళు నువ్వే తొడిగేవాడివా ?" అని అన్నాడు.

"నా ఉద్యోగమే అదిగా !"

"వాళ్ళు పాదాలు ముట్టుకోనిచ్చేవారా ?" అంటూ సందేహాన్ని వెలిబుచ్చాడు రంగారావు.

"కొందరు వాళ్ళంతట వాళ్ళే తొడుక్కునేవారు. ఒక్కొక్క మేడమ్ అది తన పని కాదన్నట్టు కాలు అందిచ్చేది జోడు తొడగడానికి"

"వాళ్ళ కాళ్ళు నువ్వు ముట్టుకుంటే వాళ్ళకి కిచకిచలు పెట్టవూ?" అంటూ కిసుక్కుమని నవ్వాడు గోలుకీపరు రాములు.

"వాళ్ళకి జోడు తొడుగుతూ ఏమేమి మాట్లాడేవాడివి?" అంటూ కొంటెగా చూశాడు సుబ్బయ్య.

"ఇవాళ మీరు ఏ ప్రశ్నలన్నా అడగచ్చు. లైసెన్సు ఇచ్చాను, ఇవాల్టికి. జోళ్ళ షాపులో నాపాత్ర ఎల్లా ఉండేదో చెపుతా. మేడమ్ వచ్చి స్ప్రింగ్ ఛైర్‌లో కూర్చునేది, ఎదురుగా ఉన్న నిలువుటద్దంలోకి చూసుకుంటూ — నాకేసి అయినా చూడకుండా ఆర్డరిచ్చేది ఒక్కొక్కతె మేడమ్. నా ముఖం మీద మాత్రం సాయంత్రందాకా చిరునవ్వు పెర్మనెంట్‌గా ఉండేది. నాలుగైదురకాల జోళ్ళ పెట్టెలతో ప్రత్యక్షమై, నాపాఠం ఒకటి ఉండేది. అది ఏకరవు పెట్టేవాడిని. 'మేడమ్! ఇవి లేటెస్టు మోడల్సు-అజంతా హెయిర్‌స్టయిల్సుతో మాచ్ అయేట్లు, మాకంపెనీ ఆర్టిస్టుల డిజైన్లతో, వారి పర్యవేక్షణ క్రింద తయారుచేయించిన జోళ్లు. ఇది హంస గమన ! ఇది మందయాన ! ప్రత్యేకంగా షికారు వెళ్ళేప్పుడు వేసుకోడానికై తయారు చేయబడ్డాయి !' ఇల్లా ఏకరవు పెట్టేవాడిని — ఒక్కొక్క జోడునీ ఒక్కొక్క పేరుతో పిలుస్తూ మనుష్యుల్ని బట్టి పాఠానికి కొంచెం చిలవలు పలవలూ చేర్చేవాణ్ణి. గొంతు ఒక్కొక్కసారి మార్దవంగానూ, ఒక్కొక్కసారి ఆశ్చర్యంగానూ మార్చి. మా మద్రాస్ బ్రాంచిలో ఈమోడల్ introduceచేశాము.మర్నాటి సాయంత్రానికి షోకేస్లో ఉంచడానికి ఒక్కజతకూడా లేకుండా ఎగరేసుకు పోయారు. ఎవరనుకున్నారు ? .... ఫిలిం స్టార్స్,".... అరే! మాడమ్‌కి ఈ పేటరన్ నచ్చిందే! ఇల్లాంటి పేటరన్ ఎవరు వాడతారో తెలుసా ? ... సినీతార ....నీరద'

ఇల్లావచ్చిన కస్టమర్సుని ఖుషామత్ చేసి, ఏదోఒకటి కొనకుండా మాత్రం వెళ్ళనిచ్చేవాడిని కాను. స్కూలురోజుల్లో నాటకాల్లో వేసిన అనుభవం, జోళ్ళ షాపులో ఈ మొనోయాక్టింగ్‌కి ఉపయోగపడింది.ఇల్లా

కకాలం సాగేప్పటికి ఈ ఉద్యోగం విసుగుపుట్టడం ఆరంభించింది.

''అల్లాంటి ఉద్యోగంమీద విసుగా!''అని గొంతులు ఒక్కసారి ఆశ్చర్యాన్ని కటించాయి.

''అవును;ఆఉద్యోగంమీద విరక్తిపుట్టింది. అంతవరకు నా జీవితంలో [వాన, వరద అల్లాంటి అవాంతరాలు ఏవో వస్తేతప్ప, సాయంకాలం నాల్గుగంటలు అయేప్పటికి ఫుట్ బాల్ ఫీల్డులో ఉండవలసిందే! ఈ ఉద్యోగంలో చేరాక సాయంకాలం అంతా ఇక్కడ షైదు. నాలుగుగంటల య్యే సరికి, నాకాళ్ళు ఊరికే కొట్టుకునేవి. జోళ్ళతాలూకు అట్టపెట్టెల్ని తంతూండే వాణ్ణి—కష్టమర్సు లేకుండాచూసి. కాని చేసేపనిలో ఉత్సాహం కల్పించుకోకపోతే సుఖం లేదని, మనస్సు మరల్చడానికి అనేక ప్రయత్నాలు చేసేవాడిని. కొంతసేపు కష్టమర్సు ముఖాలు చూసి, వాళ్ళ పాదాలసైజు ఊహించుకుని. వాళ్ళు చెప్పకుండానే జోళ్ళు తెచ్చేవాడిని. కొన్నాళ్ళు వాళ్ళ పాదాలుమాత్రమే చూసి, వాళ్ళముఖాలు ఇల్లా ఉంటాయి అని.ఊహించుకుని తర్వాత ముఖంపైకెత్తి చూసేవాణ్ణి. కొన్నాళ్ళు కేవలం వాళ్ళు ధరించినదుస్తులు. అలంకరించుకునే విధం, ముదరరంగులు, లేతరంగులు కట్టేవాళ్ల మనస్తత్వాలూ, అభిరుచులూ - ఇవన్నీ ఊహించుకుంటూ కాలం గెంటెయ్యడానికి ప్రయత్నించేవాడ్ని.

''ఇల్లా ఉండగా ఒక ఆదివారం పోలీసు గ్రౌండుకి వెళ్ళాను. అక్కడ పోలీసు టీమ్‌కి ఇంకో టీమ్‌కి ఫ్రెండ్లీమాచ్ జరుగుతోంది. పోలీసుటీమ్ మొదటి హాఫ్ లోనే మూడుగోల్సు కొట్టింది. ఆ రెండవ టీమ్ ము[రేకంపెనీ టీమ్‌ట. ఆమాచ్ చూడడానికి కంపెనీదొర, అతనికూడా కంపెనీ మానేజర్ ఓయువకుడూ వచ్చారు. ఆట అయిందాకా అక్కడే ఉన్నాను. 'ఆ ఓడిపోయిన టీమ్‌లో నేను ఉండిఉంటేనా! ఫలితం ఇంకోలా ఉండిఉండేది' అనుకున్నాను. ఆ ఫారిన్‌కంపెనీలో నా కెవడిస్తాడు ఉద్యోగం! ఏమో ఆదొరకి ఫుట్ బాల్ అనిన ఇష్టంట. ఆకంపెనీలో ఉద్యోగం ఎల్లాగైనా సంపాదించాలని కోరిక పుట్టింది. కోరిక కోరికగానే ఉండిపోయింది—జోళ్ళషాపులో రోజులు వెళ్ళిపోతున్నాయి.

''రోజూ షాపు మూసివేసిన తరువాత టాంక్‌బండ్ మీద అటునించి ఇటు ఓసారి తిరిగి ఇంటికి పోవడం అలవాటైంది. ఓ రోజు సాయంకాలం చీకటి పడినతర్వాత టాంక్‌బండ్ మీద నడుస్తున్నాను. ఆలోచనలు నన్ను వదిలి గుర్రాలమీద స్వారీ చేస్తూపోతున్నాయి అన్ని వేపులా. ఇంతలో ఎదురుగా ఓ యువతీ, యువకుడూ కబుర్లు చెప్పుకుంటూ వస్తున్నారు. మెర్క్యురిలైట్ కాంతి క్రిందికి వచ్చిన వారిపై నాదృష్టి పోయింది. కాసేపటికి లైట్‌కీ లైట్‌కీ మధ్యఉన్న మసకచీకట్లో కలిసిపోయారు. ఆ యువకుణ్ణి ఎక్కడో చూచినట్టు గుర్తుంది.ఆయువతినిమాత్రం మాషాపులో ఎప్పుడూ చూచినట్టు గుర్తులేదు. మా షాపులోకి వచ్చిన ప్రతికస్టమర్ ముఖం ఇంచుమించు నాకు గుర్తే. ఆ యువకుణ్ణి ఎక్కడో చూశాను! చటుక్కుని గుర్తుకి వచ్చింది. ఆవేళ పోలీస్ గ్రౌండ్‌లో ఫుట్ బాల్ మాచ్ చూడడానికి వచ్చిన,

ముద్రేకంపెనీ దొరతోకూడా వచ్చిన ఆకంపెనీ మానేజర్. ఇతన్ని ఎలాగైనా పడితే ఆకంపెనీలో ఉద్యోగం సంపాదించవచ్చని ఆలోచన మెరిసింది. తర్వాత అతని విషయమై కొంత భోగట్టా చేశాను. అతనిపేరు మధుబాబు అనీ, ఇంకా వివాహం కాలేదనీ, రోజూ సాయంకాలం అతనితో షికారు కెళ్ళే అమ్మాయిని పెళ్ళి చేసుకోవాలని అనుకుంటున్నాడనీ, ఆ అమ్మాయి పేరు అమృతమనీ, ఆ అమ్మాయి ఇల్లు ఫలానాచోట అనీ, అతని ఇల్లు ఫలానాచోట అనీ, అతనంటే కంపెనీ దొరకి గురిఅనీ ఇల్లాంటి కొన్ని వివరాలు సేకరించా. కాని ఆ మధుబాబుని వశం చేసుకునే కార్యక్రమం ఎల్లా ఆరంభించాలో తెలియక తికమక పడుతున్న పరిస్థితుల్లో, ఒక రోజున మాషాపులోని లేడీస్ సెక్షన్ లోకి ప్రత్యక్షమైంది అతనితో షికారు తిరిగే ఆ అమ్మాయి అమృతం. నామనస్సుకి ఆలోచనలన్నీ కలిసిపోయి ఒకటే ఆలోచన అయింది. ఈ అమ్మాయిని ఏలాగైనా మెప్పించి, మధుబాబుకి రికమెండ్ చేయించుకుంటే, ముద్రే కంపెనీలో పాగా వెయ్యవచ్చుననే ఆశారేఖ వెలిగింది. లేడీస్ సెక్షన్‌లో ఆరు నెలల అనుభవంతో, సేల్స్‌మన్‌గా నాపై నాకు కొంతనమ్మకం కలిగింది. నా మాటలు సంగీతంలా వినే కొంతమంది ఆడవాళ్ళు, అక్కర్లేక పోయినా ప్రతినెలా వచ్చి ఏదో జోడు కొనుక్కుపోతుంటారనే విషయం నాకు తెలియంది కాదు. ఇవాళ 'నా మొనో ఆక్టింగ్' ఇంకా బాగా చేద్దామనుకున్నాను. మామూలు పాఠాన్ని మార్చేశాను. నాలుగైదు రకాల డైలాగులు అప్పుడే మనసులో రూపొంద

మేడమ్‌కి గుడ్ ఈవినింగ్ చెప్పి ఐదు

జోళ్ళతో ప్రత్యక్షమై నాఉపన్యాసం

ఖించాను. 'మేడమ్! మొన్న ఇం

నేషనల్ ఫెయిర్‌కి వెళ్ళి మాకంపెనీ

స్టులుకొత్తకొత్త మోడల్సుపట్టుకొచ్చా

రకరకాల దుస్తులతో మాచ్ అయే కొ

పాటరన్సు ఎన్నో వచ్చాయి. ఆడవాళ్ల సాయింకాలం బీచ్ ఇసకలో నడవడానికి ఒకజోడు, కొండమీదకి షికారు వెళ్ళినప్పుడు ఒకజోడు, ఆటలాడేటప్పుడు ఒకరకంజోడు, రంగు రంగుకీ ఒకజోడు, ఋతువు ఋతువుకీ ఒకజోడు మా కంపెనీ కూడ అన్నిరకాల జోళ్ళనూ సృష్టించడానికి ప్రయత్నాలు చేస్తోంది...' ఆమె నిలువుటద్దం మీదనుంచి దృష్టి నావేపు త్రిప్పింది. నా వాక్ప్రవాహం ఇంకిపోయింది. ఆ జోళ్ళషాపులో నా ఆరునెలల సర్వీసులో నాకేసి అల్లా ఎవరూ చూడలేదు. ఆమెచూపులు నా ఆలోచనల రెక్కల్ని కత్తిరించివేశాయి. నన్ను ఓ పురుగుని చూసినట్టు చూస్తూ '5, 5½, 6 సైజుల్లో షూస్ కావాలి. క్రేప్ సోల్ ఉండాలి. ఉన్న అన్ని రంగుల్లోనూ చూపించు,' అంది ఠాటీగా. 'ఎస్ మేడమ్!' అంటూ ఆరడుగుల మనిషిని మూడడుగులు ముడుచుకుపోయి, ఆమె చెప్పిన సైజులు తెచ్చి ఒక్కొక్క పెట్టె తెరచి, జోళ్ళు బయటికి తీసి ఎదురుగ్గా పెట్టాను. ఆమె ఏదో ముగికివాసన చూస్తున్నట్లు ముక్కు పైకెత్తి, ఒక్కొక్కటీ పక్కకు నెట్టివేస్తూ, మిగిలిన రకాలు తెమ్మంది. ఒక అరగంట అయేసరికి షాపులో సగంజోళ్లు నేలపై పరచిఉన్నై.

చివరికి కొంతసేపటికి ఓజోడు సెలక్టుచేసి. రెండు పదిరూపాయల నోట్లు నా మీదికి విసిరింది. నేను కింద కెళ్ళి బిలు చిల్లర పట్టుకొచ్చేలోపున, కొత్తజోడు ఉన్న



పెట్టెను చేత్తో పట్టుకుని కూర్చునిఉంది. నేను ఇచ్చిన బిల్లు చిల్లర తీసుకుని, 'థాంక్సు మేడమ్!' అంటున్న నాకేసి అయినా చూడకుండా టకటకమని మెట్లు దిగి వెళ్ళిపోయింది. నాకు ఒక్కసారి నీరసం వచ్చేసింది. కింద పరచిఉన్న జోళ్ళను పై రాక్సులోకి జేరవేసి, ఇంక ఆవాల్టికి పని చెయ్యడానికి మనస్సు లేక, పర్మిషన్ అడిగి బయటికి వచ్చేశాను. అనుకున్న పథకం తలకిందులైంది. మర్నాడు షాపు కెళ్ళి నిరుత్సాహంగా కూర్చునిఉన్నాను. ఇంతలో ఒక కష్టమర్ వచ్చి 6వ సైజు లేడీస్ షూ తెమ్మంది, అలవాటు ప్రకారం నాలుగైదు రకాల జోళ్ళతో వచ్చాను. ఆవేళమాత్రం పాఠం అప్పచెప్పలేదు. ఒక పెట్టెతెరచి ఆమెముందు పట్టేసరికి, ఎడంకాలిబూట్ చిన్నది, కుడి కాలి బూట్ పెద్దదీ ఉంది. తొందరగా ఆ పెట్టెతీసి పక్కన పెట్టి, 'ఇలాంటి పొరబాటు ఎప్పుడూ జరుగలేదే' అనుకున్నాను. వచ్చిన కష్టమర్ ఏదోజోడు తీసుకుని వెళ్ళిపోయింది. నిన్న ఆ అమృతం వచ్చి

నప్పుడు షాపుఅంతా క్రిందకి దింపించిందిగా! ఆ గందరగోళంలో ఓ సైజుజోడు ఇంకో సైజు పెట్టెలో పెట్టేనేమో అనుకున్నాను. ఆపెట్టెకి ఒకబూట్ 5½ సైజు, రెండవది 6 సైజు ఉంది. రెండూ ఒకేరంగులో ఉన్నాయి. రెండింటికీ క్రేప్ సోల్ ఉంది. నిన్న అమృతం చేసిన హంగామాలో తనకి మతిపోయి చెరోకాలికి, చెరోసైజు జోడు పెట్టెలో పెట్టి ఇచ్చెయ్యలేదు కదా! కాని జోడు తనే తొడుక్కుంది. నేను బిల్లు, చిల్లర పట్టుకొచ్చేలోపున పెట్టెలో తనే సర్దుకుంది! సుడిగాలిలా తిరిగివచ్చి, 'రెండుకాళ్ళకి రెండుసైజులివి ఇస్తావురా' అంటూ మొహంమీద కొట్టదుగదా అనుకుని బిక్కుబిక్కుమంటూ సాయంత్రం దాకా చూస్తున్నాను. కాని అమృతం రాలేదు. ఆవేళ కొత్తజోడు తియ్యలేదేమో అనుకున్నాను. మర్నాడూ రాలేదు. ఇల్లా ఓ వారంరోజులు చూశాను అమృతంకోసం. ఆమె దర్శనం ఇవ్వలేదు. రెండు సైజులజోళ్ళు ఉన్న ఆపెట్టెని వేరే దాచాను, మేనేజర్ కళ్ళ బడకుండా. ఇంతలో గిర్రున వారంతిరిగింది. శనివారం షాపు మూసివేశాక టాంక్ బండ్ వేపు వెళ్ళాను. ఎదురుగా మెర్క్యురీ లైట్ క్రిందికి వచ్చారు మధుబాబూ, అమృతం. నేను చీకట్లోకి తప్పుకున్నాను. "రేపు ఊరికి వెళ్ళి రెండు మూడు రోజుల్లో వచ్చేస్తాను," అంటున్నాడు మధుబాబు. నా పక్కనించి వెళ్ళిపోయారు వాళ్ళు. ఒక్కక్షణం నిర్ఘాంతపోయాను – "ఏమి టోకరా ఇచ్చావ్ అమృతం," అనుకున్నాను.

"ఏం చేసింది? ఏం చేసింది?" అని అడిగాయి ఆత్రంగా అన్ని గొంతులూ.

"చివరిదాకా వింటే మీకే తెలుస్తుంది లెండి," అంటూ రహీమ్ తిరిగి చెప్పడం ఆరంభించాడు.

"టైఫాయిడ్ జ్వరంకి తలమీద ఐస్ పెడితే జ్వరం దిగజారిపోయినట్టు నా దిగులంతా ఒక్కసారి దిగజారిపోయింది. ఈల వేసుకుంటూ హోటల్‌కి పోయి, నాకు నేనే పార్టీ ఇచ్చుకున్నాను. రెండోఆట సినిమాకి వెళ్ళాను; ఇంటికి వచ్చి గుర్రుపెట్టి నిద్ర పోయాను. తెల్లవారి లేచేప్పటికి మనసు తేలికపడింది. పూర్వంరోజుల్లో ఉండేలాటి ఉత్సాహంతిరిగివచ్చింది. స్నానంచేసి, పెట్టె అడుగున దాచిపెట్టిన, మిగిలిఉన్న ఒక్క మంచిసూటూ వేశాను. హోటల్‌కి పోయి సుష్టుగా టిఫిన్ తిని, కాఫీతాగి, సిగరేట్ ముట్టించి, టెలిఫోను బూత్‌లోకి వెళ్ళి అమృతం ఇంటికి ఫోన్ చేశాను.

పదకొండు జతలకళ్ళు ఆశ్చర్యంతో ఒక్కసారి మెరిసాయి. అన్ని గొంతుకలు ఆత్రంగా 'ఆఁ' అని తిరిగి మొయ్యడం మరచిపోయాయి.

"ఇక్కడినుంచే చెయ్యకూడని పని ఆరంభము అవుతుంది జాగ్రత్తగా వినండి" అని ఒక నిమిషం ఆగాడు రహీమ్ ఎఫెక్టుకోసం. చుట్ట అంటిద్దామని, తీసిన అగ్గిపుల్ల చేతనే పట్టుకుని, అంటించడం మర్చిపోయి, వట్టి చుట్ట నమిలేస్తున్నాడు సుబ్బయ్య. రహీమ్ ఆరంభించాడు.

"అమృతం ఇంటికి టెలిఫోన్ చేశాను. ఆమె లైన్‌మీదకి వచ్చి బద్ధకంగా, 'ఎవరూ' అంది.

"'మధు మీకు ఒకకబురు అందచెయ్యమన్నాడు' అన్నా. మధు పేరు వినడం

ేశే ఆమె గొంతులో బద్ధకం పోయి కొత్త ఉత్సాహం వచ్చింది. 'మధు ఊరికి వెళ్ళి ఉండాలే' అంది.

" 'ఊరికి వెడుతుంటేనే స్టేషన్‌లో కలిశాను,' అని రెండో అబద్ధం ఆడాను. 'మీరు ఎవరో తెలుసుకో వచ్చా' అంది ఆమె కొంచెం సందేహంగా. 'చూశాక మీకే తెలుస్తుందిగా! ఓ గంటలో మీ ఇంటికి వస్తున్నా' అని సమాధానం కోసం ఎదురు చూడకుండా ఫోన్ పెట్టేశాను.

"కొంపతీసి, కొంపకి పోలేదుకదా!" అన్నాడు సుబ్బయ్య అంటించని చుట్టని గబగబా నమిలేస్తూ.

"ఓగంట అటూ ఇటూ తిరిగి అమృతం ఇంటికి వెళ్లాను. నా కోసం ఎదురు చూస్తోం దనుకుంటాను. లోపలికి రమ్మని వీధిగదిలో కుర్చీ చూపించింది. ఇంటో ఇంకెవరన్నా ఉన్నారేమో నని నా గుండెలు ఒక్కసారి పీచుపీచు మన్నాయి. 'ఏమయితే అది అవుతుంది, మహాఅయితే కాస్త వీపు చెడుతుంది. అంతేకదా' అని కాస్త మొండితనం వచ్చింది. ఎదురుగా కుర్చీలో ఆమె కూర్చుంది. 'మీరు మధు దగ్గరనుంచి వచ్చారా?' అంది ఆమె.

" 'లేదు,' అన్నా సహజమైన గొంతుతోనే.

" 'అయితే ఎవరు మీరు?' అంది ముఖంలో ఒక్కరవ్వ కళ తగ్గి.

" 'ఈ వేషంలో నన్ను మీరు పోల్చుకోలేకపోవచ్చును. కాకపోయినా నన్ను ఒక్కసారే చూశారు మీరు. అందుచేత గుర్తు ఉండకపోవచ్చు. నేను రీటా షూ కంపెనీ, మెయిన్‌రోడ్ బ్రాంచిలో లేడీస్ సెక్షన్‌లో సేల్స్‌మన్ - రహీమ్ అంటారు నన్ను.'

" 'ఏం కావాలి నీకు?' అంది ముఖం గంభీరంగా పెట్టి, ఇందాకటినుంచీ 'మీరు' అంటున్నందుకు నాలిక పీక్కుంటూ.

" 'ఉద్యోగం కావాలి.' అన్నా.

" 'ఇందాక టేలిఫోన్లో అబద్ధం ఎందుకు ఆడావ్?' అంది, కుర్చీలోంచి లేస్తూ.

" 'అవసరం ఉందికనక అబద్ధం ఆడవలసి వచ్చింది.' అన్నా.

" 'ఏమిటా అవసరం,' అంది విసురుగా.

" 'ముఖ్రేకంపెనీలో ఏదైనా ఉద్యోగం. మీరు మధుబాబుతో చెపితే ఆపని జరుగుతుంది,' అన్నా.

" 'ఆపని నేను చెయ్యకపోతే?'

" 'అప్పుడు ఈప్రపంచంలో ఇద్దరు దురదృష్టవంతులు ఉంటారు,' అన్నా వేదాంత ధోరణిలో గొంతు పెట్టి.

" 'ఎవరా ఇద్దరూ,' అంది.

" 'ఒకటి నేను, రెండు-మీరూ' అన్నాను తాపీగా.

కోపంతో ఆమె గొంతు వణికిపోయింది. 'రాస్కెల్!' అంటూ కుడికాలు షూ ఊడదియ్యబోయింది.

" 'కుడికాలుజోడు అల్లా వదిలిపెట్టి, ఎడంకాలిజోడు విప్పండి. అది కాస్త బరువుగానూ,రవ్వంత వెడల్పుగానూ, నా చెంపకి సరిపడా ఉంటుంది,' అన్నాను నవ్వుతూ. ఆమె ఒకక్షణం కొయ్యబారింది. నాకు జాలివేసింది.కాని విషయం ఇందాకా వచ్చాక ఆపడం ఎల్లా? 'కూర్చోండి. మీ రహస్యం తెలిసిపోయింది నాకు.' అన్నా.

"ఆమె ముఖం ఎర్రబడి పోయింది.

'ఏమిటి నా రహస్యం?' అంది ఆవేశాన్ని ఆపుకోడానికి ప్రయత్నిస్తూ.

"'ఆవేళ జోళ్లు కొనడానికి వచ్చి ఎంత గమ్మత్తు అయిన పనిచేశారు! నన్ను వెర్రి వెధవని చేసి, నాచేత షాపులో జోళ్ళన్నీ నేలమీద పరిపించి, నానాహంగామా చేసి, బిల్లు తేవడానికి క్రిందకి వెళ్ళిన సమయములో. రెండుకాళ్ళకీ రెండు సైజుల జోళ్ళని పెట్టెలో పెట్టేసుకుని, నేను వచ్చేప్పటికి ఏమీ ఎరగనట్టు కూర్చుని, బిల్లు, మిగిలిన చిల్లర తీసుకుని, నా కళ్ళల్లో దుమ్ముగొట్టి వెళ్లిపోయారే!'"

"ఏమిటిరా ఈ గొడవ అంతా; నాకు తెలియటంలేదు," అన్నాడు వెంకన్న.

"ఓరి వెర్రి వెంకయ్యా! ఆ అమృతానికి, ఒక కాలుకి కొంచెం వాపు ఉంది. కుడి కాలుకి సరిపోయే బూటు. ఎడమకాలుకి బిగుతు అవుతుంది. ఎడమకాలు సైజు తీసుకుంటే కుడికాలుకి వదు లవుతుంది. అందుచేత అమృతం ఏం చేసిందంటే, నన్ను గాభరా పెట్టి దగ్గరకు రాకుండా చేసి, ఏ కాలికి ఏసైజు సరిపోతుందీ తొడిగి చూసుకుంది. అంటే కుడికాలుకి 5½ సైజు, ఎడంకాలికి 6 సైజు ఒకే రంగులో సెలెక్టు చేసి, ఒక పెట్టెలో పెట్టేసి, మిగిలిపోయిన 6 వ సైజు కుడికాలు జోడూ, 5½ సైజు ఎడమకాలిజోడూ ఇంకో పెట్టెలో పెట్టి అక్కడ వదిలేసి గప్‌చిప్‌గా వెళ్లిపోయింది. జోళ్ళు విడివిడిగా ఒక్కొక్క కాలికీ అమ్మరుగా. సైజుల్లో 5½ కి 6 కి పరీక్షగా చూస్తేనే గాని తేడా చప్పున తెలియదులే. పైగా చీర క్రిందదాకా జీరాడుతోనే ఉంటుందిగా."

"మరి వారంరోజు లైనతర్వాత నువ్వెలా కనిపెట్టావా?" అన్నారు అంఒక్కసారి.

"చెప్పాక్కదూ, ఆ శనివారం రాత్రి టాంకుబండ్‌మీద నా కెదురుగా వచ్చారు వాళ్లిద్దరూ అని. నేను చీకట్లోకి తప్పుకుని చూస్తున్నాను. నా దృష్టి సరాసరి ఆమె జోళ్ళమీదికి పోయింది. సరిగ్గా షాపులోన వదిలేసిన జోళ్లూ ఇవీ అప్పచెల్లెల్లా ఉన్నయి. నాకు అనుమానం వచ్చింది. అప్పుడే నడిచివెళ్లిన బూట్ల అడుగులు ఇసకలో అల్లాగే ఉన్నయి. క్రిందవంగిచూశాను. ఎడమకాలి బూటుగుర్తు రవంత పెద్దదిగా ఉంది. 'అమ్మ! ఎంత టోకరా ఇచ్చావే అమృతం,' అనుకున్నా."

"ఎందుకు అల్లా చేసిం దంటావ్" అన్నాడు రంగారావు.

"ఈ డబ్బున్నవాళ్ళలో కొందరికి రకరకాలైన జబ్బులు ఉంటాయిలే! నిజానికి అదో జతా, ఇదో జతా కొని, తనకి కావలిసినవి ఉపయోగించుకొని మిగతావి విసిరెయ్యవచ్చు. కాని తన తెలివితేటలూ, ప్రజ్ఞా అంతా చూపించడం ఎల్లా! సరే తర్వాత ఏం జరిగిందో చెపుతాను. 'నన్ను బ్లాక్ మెయిల్ చెయ్యడానికి వచ్చావా? పోలీసుల్ని పిలుస్తాను,' అంది చల్లారి పోతున్న కోపాన్ని తిరిగి తెచ్చుకోడానికి ప్రయత్నిస్తూ.

"'ఈ విషయం మనలో మనం తేల్చుకోలేకపోతే, ఎల్లాగా పోలీసులదగ్గరకే వెడుతుంది. నువ్వు చేసిన పనికి నా ఉద్యోగం పోయింది. నావల్ల ఒక జతజోళ్ళు పనికి రాకుండా పోయాయని, నన్ను పనిలోంచి తీసివేశారు,' అన్నా, అన్యాయం జరిగి




నట్లు మొహంపెట్టి. అప్పటినుంచీ ఆవిడను మీరు అనడం మానేశాను.

" 'అయితే డబ్బు కావాలా,' అంది కొంత ఆదుర్దాగానే.

" 'నాకు డబ్బు కాదు ముగ్రేకంపెనీలో ఉద్యోగం కావాలి,' అన్నా.

" 'జోళ్ళ షాపులో పనిచేసేవాడికి ఫారిన్ కంపెనీలో ఉద్యోగం ఎల్లా వస్తుంది? నీకు క్వాలిఫికేషన్లుఏమిటి? నీకుడిగ్రీఉందా? అధమం టైపు, షార్టుహాండ్ అన్నా వచ్చునా-అంటూ 'క్వాలిఫికేషన్' అన్న మాటని నామీద ఉమ్మేసినట్లు అంది.

"చిర్రుమంది ఒక్కసారి నాకు. తమాయించుకుని అన్నాను. 'నాకున్న మొదటి క్వాలిఫికేషన్, ముగ్రేకంపెనీ మేనేజర్‌కి కాబోయే భార్య అమృతాన్ని తెలిసుండడం.'

" 'స్కౌండ్రల్' అంది. నేను వినిపించుకోలేదు. ఇంక టైపు, షార్ట్‌హాండ్ వచ్చునా అంటావా? అవి నాకు రావు. అన్ని విషయాలూ, అందరికీ రావాలని ఎక్కడ ఉంది!'

" 'మహాత్మా గాంధీకి మద్దెల వాయించడం రాదన్నారు ఎవరో! అయితే ఆయన గొప్పతనం తగ్గిందా?'

" 'మహాత్ముడికీ నీకూ పోలిక తెచ్చుకుంటావా రోగ్,' అంది.

" 'ఒకటి రెండు విషయాల్లో నాకుండే గొప్పతనం నాకుంది. నా ఈ ఆరడుగుల శరీరంతో ఫుట్‌బాల్ ఫీల్డులో నుంచున్నా

నంటే, అప్పుడు తెలుస్తుంది, నాలో గొప్ప తనం ఎక్కడ ఉందో. ముద్రేకంపెనీదొరకి ఫుట్ బాల్ బాగా ఆడేవాళ్లంటే ఇష్టంట. నేను గనక ఆ టీమ్‌లో ఉంటే, ఫుట్ బాల్ షీల్డు ఆ కంపెనీలో పెర్మెనెంట్‌గా ఉండి పోతుంది. నాలాంటి గొప్ప ఆటగాడిని తీసుకువచ్చిన కీర్తి మధుబాబుకు దక్కు తుంది. దొర దృష్టిలో అతని గౌరవం పెరుగుతుంది. ఇంక నా విషయం అంటావా నాకు ఫుట్ బాల్ అంటే ప్రాణం. ఈ కంపెనీలో చేరితే నా స్వప్నం ఫలించినట్టు అవుతుంది. అందుచేత నాకీ ఉద్యోగం దొరకటం, నీకు మధుబాబు దొరికి, నువ్వు అమృతమధువు కావడం జరిగి, మనకి ఉభయతారకంగా ఉంటుంది — నేను చెప్పి నట్టు చేస్తే.'

" 'నా కేమైనా ఆజ్ఞలు ఇస్తున్నావా?' అంది మండిపడుతూ.

" 'ఆమాటమీద అభ్యంతరం ఉంటే వేరే మా ర్గం లేదన్నా వాడదాం,' అన్నా శాంతంగా.

" 'నువ్వు చెప్పినట్లు చెయ్యకపోతే.'

" 'నాకు ఉద్యోగం పోవడం, జోళ్ళ షాపులో నువ్వు చేసిన మోసం – ఇదంతా మధుబాబుకి తెలుస్తుంది,' అన్నా ధీమాగా.

" 'మధు నీ మాటలు నమ్ముతాడా!'

" 'నమ్మకపోయినా అనుమానమన్నా పడే అవకాశం ఉంది. పైగా నాకు పెద్దగా పోయేది ఏమీలేదు. ఏమన్నా ఉంటే పోవడానికి! నీ విషయంలో మాత్రం ముద్రేకంపెనీకి కాబోయే డైరెక్టర్ మధుబాబును మిస్ అయే రిస్కు పోలేదు,' అన్నా.

" 'నువ్వు నీచుడివి 'అంది. 'హమ్మయ్య తెలుగులో తిడితే ప్రాణం లేచివచినట్లుంది' అంటూ జేబులోంచి ఓ కాగితం తీసి నా ఎడ్రసు వ్రాసి ఇచ్చి '15 రోజులలో నాకు పిలుపు వస్తుందని నమ్ముతున్నాను.' అని లేచి వీధిగుమ్మం దగ్గరికి వచ్చేసరికి, ఓ పేపరువెయిట్ నన్ను దూసుకునిపోయి పక్కని ఉన్న ఫ్లవర్ పాట్‌ని బద్దలు కొట్టింది."

"తర్వాత ఏమైంది ?" అన్నాడు సుబ్బారావు.

"తర్వాత ఏమైంది! మిగతా విషయాలు మామూలుగా జరిగిపోయాయి. 10 రోజుల్లో నన్ను ఇంటర్వ్యూకి రమ్మని ముద్రే కంపెనీ దగ్గరనుంచి పిలుపు వచ్చింది. పెద్దదొర చూశాడు. రెండు మూడు మాచేస్ లో నా ఆట చూశాక, లేబర్ సూపర్‌వైజర్ అని ఏదో పేరుపెట్టి నాకు ఖాయమైన ఉద్యోగం ఇచ్చేశాడు."

రహీమ్‌భాయ్! ఈ ముద్రేకంపెనీ ఎక్కడి దయ్యా?" అంటూ రహీమ్ కళ్ళల్లోకి చూస్తూ అడిగాడు సూరి.

"ఆరోజుల్లో ఉండేదిలే నీకు తెలియదు," అన్నాడు రహీమ్ సూరికేసి చూడకుండా.




"నాకు తెలియదూ! అని ఫక్కున నవ్వాడు సూరి." అంతా ఉన్నదున్నట్టు చెపుతానని పేర్లుమాత్రం మార్చేశావా నాతండ్రీ! ఒరే వినండ్రా! మన రహీమ్ ఖాయిపంచేశాడంటే మెర్రీకంపెనీని ముర్రే కంపెనీక్రింద. మేనేజర్ సాధన్‌బాబుని మధుబాబుక్రిందా, ఆయన భార్య అరవిందని అమృతంకిందా మార్చేశాడు," అన్నాడు సూరి.

"ఆఁ, అల్లాగా అన్నారు," అంతా దీర్ఘంగా.

"ఏడిశారు పడుకోండి. ఆలస్యమైంది. రేపుప్రొద్దుటే లేచి మాచ్ ఆడాలి," అని ముసుగుతన్ని పడుకున్నాడు రహీమ్.

"నా స్వంత విషయాలు చెప్పమని రహీమ్ అడగటం మర్చిపోయాడు- అమ్మయ్య." అనుకుంటూ వెంటనే నిద్రపోయాడు సూరి.




వైశాఖమాసంలోని ఒకనాటి మిట్టమధ్యాహ్న సమయంలో, గ్రామంలోని వృద్ధ ప్రౌఢ తరుణ స్త్రీ లందరూ గ్రామపొలిమేరలోని పవనానది రేవుదగ్గర చేరారు. ఇంతమంది స్త్రీలు ఒకచోట కూడటం జరిగితే, అక్కడ బయలుదేరే కోలాహలం ఏ స్థాయిలో వుండేదీ, ఎవరైనా తేలిగ్గా వూహించవచ్చు. అందరూ గడబిడగా మాట్టాడేస్తున్నారు. నదిలో దిగి స్నానాలు చేసేవాళ్ళూ, బిందెలు తోమేవాళ్ళూ, బట్ట లుతికేవాళ్ళూ – అంతా గొడవగా కబుర్లాడుతున్నారు.

రేవుఒడ్డున ఉతికిన వస్త్రాలు ఆరవేస్తున్న సుగుణాబాయి అనే ఒక ప్రౌఢాంగన, అల్లంతదూరంలో జుట్టు ఆరబెట్టుకుంటున్న మరో ప్రౌఢ గోపికాబాయితో, "చూశావుటే, గోపీ! ఇంత పోయేకాలం ఎన్నడైనా మనం ఎరుగుదుమా? ఆడముండలు చదవటం రాయటం! ఎందుకా చదువులు? వుద్యోగాలు చేసి ఊళ్ళు తగలెట్టటానికా?" అన్నది పెద్ద గొంతుతో.

గోపికాబాయి 'ఉస్' అంటూ సంజ్ఞ చేస్తూ సుగుణాబాయి దగ్గిరకు వచ్చి, "అంత పెద్దగా అరవకే. రాధాబాయి పెద్దకోడలు పార్వతి వూసేగా నువ్వు చెప్పేది? అమ్మప్పా! కాస్త చటవటం ఒచ్చని దాని కెంత అహం! చూడబోతే మింగ మెతుకులేదు. ఆ మధ్య, దాని పిల్లలిద్దరూ ఆకలో అని వీధిలో ఏడుస్తూ కనబడితే, యింటికి తీసుకుపోయి యింత అన్నం పెట్టాను - అంతే; ఆ చదువుల సరస్వతి ఎక్కణ్ణుంచో వూడిపడినట్టు బ్రహ్మరాక్షసిలా ఇంటిముందు ప్రత్యక్షమై, నన్ను నానా మాటలూ అని, పిల్లలిద్దర్నీ రెక్కలుపట్టుకుని బరబరా యీడ్చుకుపోయింది. నమ్ము నమ్మకపో, సుగుణా! ఆ రోజునుంచీ నే దాని పేరెత్తితే ఒట్టు," అన్నది.

సుగుణాబాయి ఏదో అనబోయేంతలో, దాపులనే బిందెలు తోముకుంటున్న యశోదాబాయి, యీ సంభాషణ అంతా శ్రద్ధగా ఆలకించి, చప్పున బిందె వదిలి లేచి, వాళ్ళదగ్గిరకు వచ్చి, "చదువుకున్న ప్రతి ఆడదీ పార్వతిలా అహంకార్తై పోతుందంటే నేను నమ్మనే. దాని తోడుకోడలు లక్ష్మిని, పోయిన మార్గశిర మాసంలో మామగారి తద్దినానికి వచ్చినప్పుడు చూశారుగదా? ఆ పిల్లా బాగా చదువుసంధ్యలు నేర్చిందే! అయితే ఏం? ఎంత మర్యాదా, ఎంత అణకువా, ఎంత కలుపుగోలుతనం! గర్వం అన్నమాటే ఆ పిల్ల ఎరగదంటే నమ్మండి," అన్నది.

"నువ్వన్న మాటల్లో కొంత నిజం వున్నదే అనుకో, వదినా! సరేకాని, ఆ లక్ష్మి యింతవరకూ అత్తవారింటికి కాపురానికి రాలేదేం?" అని ప్రశ్నించింది సుగుణాబాయి.

"తినటానికేం వుందని యిక్కడికి రావాలే అది, పిన్నీ!" అంటూ ఉమాబాయి నిండు నీళ్ళబిందెను, వాళ్ళపక్కన ఎత్తి కుదేసి, "లక్ష్మి బావ సదాశివరావుకు కానీ సంపాదన లేదుగదా? ఇక ఆ మొగుడు వినాయకరావు సంగతి ఊరంతా ఎరిగిందే. అన్నివిధాలా వట్టి మూఢుడు. ఎక్కడా అనకండి; లోగడ మామగారి తద్దినానికి వచ్చినప్పుడు లక్ష్మి వంటిమీది నగలన్నీ, అత్త రాధాబాయి లాక్కున్నదట. అందుకనే లక్ష్మి తండ్రి దాన్ని అత్తవారింటికి పంపనని శపథం పట్టాడట!" అన్నది.

ఇంతలో పార్వతిఅత్తగారు · రాధాబాయి, బిందె బుజాన పెట్టుకుని నదికి వస్తూ కనిపించింది. ఆమెను చూస్తూనే రేవులోని అమ్మలక్క లందరూ కనుసన్నలు చేసుకుని ఎవరిపనుల్లో వారు నిమగ్నులై పోయారు. రాధాబాయి ఉస్సురుస్సురంటూ వచ్చి బిందెను మెట్లమీద పెట్టి తోమసాగింది. యశోదాబాయి ఆమెను సమీపించి. "పిన్నీ! యింత పొద్దెక్కి ఏటి కొచ్చావేం ? ఇప్పటిదాకా ఇంటిపనితోనే సరి పోయిందా ?" అని అడిగింది.

"ఇంటి పనా ? ఛస్తున్నాననుకో! ఆ పెద్దకోడలు ఇంతవరకూ నిద్ర లేవలేదు. వారితోపాటు నేనూ పోయినా బావుండేది. నాకు ఇంతలో చావురాదు," అంటూ కళ్ళనీళ్ళు పెట్టుకున్నది, రాధాబాయి.

"పిన్నీ! నా మాట విని పార్వతిని కొన్నాళ్ళపాటు పుట్టింటికి పంపు. నీ చిన్న కోడలు లక్ష్మి నెందుకు తీసుకురాకూడదూ ? లక్ష్మి నిజంగా లక్ష్మే!" అన్నది యశోదాబాయి.

"దాన్ని తీసుకురావాలంటే నాకు మరీ భయంగావుందే, యశోదా! అది పార్వతి కన్నకూడా ఎక్కువ విద్య నేర్చిన పిల్ల. ఇక మా వినాయకరావును చూద్దామా- వాడు వట్టి వెర్రి వెంగళప్ప; సంసార విషయాలే పట్టించుకోడు. ఎప్పుడూ ఊళ్ళో తిరుగుతూ అడిగినవా రందరికీ అడ్డమైన చాకిరీ చేస్తుంటాడు. మొన్నగా మొన్న వ్యాసభట్టుగారి మేనల్లుడు చనిపోతే, ఆ శవాన్ని మా వినాయకుడు మోశాడట. వెంకోజీపంత్ పినతండ్రి భార్య కాశీయాత్రకు పోతుంటే, ఆవిడ వెంటేసు కెళ్ళే సామానంతా నెత్తి కెత్తుకుపోయి, ఆవిణ్ణి రైలెక్కించి వచ్చాడట! ఇలాంటి తెలివి మాలినవాడు సంసారం ఏం నడుపుకోగలడు ?'' అన్నది రాధాబాయి.

యశోదాబాయి నవ్వుతూ, "వినాయకు డేం తెలివితక్కువవా డనుకోకు పిన్నీ! కోడల్ని తీసుకురా; వాడు ఇల్లొదిలి వీధిలోకి పోతాడేమో చూద్దువుగాని," అన్నది.

రాధాబాయీ, యశోదాబాయీ ఆ తరవాత ఆ కబుర్లూ యీ కబుర్లూ మాట్లాడు కుంటూ నీళ్ళబిందెలు బుజాని కెత్తుకుని గ్రామంలోకి బయలుదేరారు. యశోదాబాయి తమ ఇల్లు సమీపించగానే, "ఉంటాను, పిన్నీ! నే చెప్పిన సంగతి మరిచేవు. ఎప్పటికైనా నీ కక్కర కొచ్చేది చిన్నకొడుకూ, చిన్నకోడలే. నామాట నమ్ము," అని హెచ్చరించి ఇంట్లోకి వెళ్ళిపోయింది.

రాధాబాయి తన చిన్నకోడల్ని గురించి ఆలోచిస్తూ, ఇంటిగుమ్మం సమీపిస్తూనే, తన పెద్దకోడలు పార్వతి నిద్రలేచిన సూచనలకై, వీధి చావడికేసి పరికించి

చూసింది. ఆవిడింకా నిద్రలేచినట్టు లేదు. రాధాబాయి విసుక్కుంటూ వంటగదిలోకి వెళ్ళి బిందె దించి, "పిల్లా! పిల్లా!" అంటూ కేకపెట్టింది. జవాబులేదు.

రాధాబాయి కోపంతో బుసలుకొడుతూ పోయి, తన కోడ లుండే గది తలుపు కొంచెంగా నెట్టి, లోపలికి తొంగిచూసింది. పార్వతి గదిలో ఒకచింకిచాపపై పడు కుని గుర్రుపెడుతూ నిద్రపోతున్నది. అది చూస్తూనే రాధాబాయికి వళ్ళు మండి పోయింది. ఆమెకు చిన్నతనంనుంచీ కాస్తకూ కూస్తక్కూడా పెద్దనోరు చేసుకుని బడబడ వాగే అలవా టున్నది. ఎవరితో కలహించినా, మరుక్షణంలోనే అదంతా మరిచిపోయి నవ్వుతూ మాట్లాడే తత్వంకూడా ఆమెలో వున్నది.

"కొంచెంకూడా బుద్ధిలేదు. తిండికి తిమ్మరాజూ, పనికి పోతరాజూ. అంతా నా కర్మ. దీన్ని కోడలుగా తెచ్చుకున్నది దేవతార్చనపెట్టెలా దులిపి ఒకమూల కూచోబెట్టటానికి గామాలు! అయినా అడుక్కుతినే వంగడంలో పుట్టినదాన్ని కొడుక్కు చేసుకుంటే..."

రాధాబాయి మాట ముగించకముందే, పార్వతి దఢాలున తలుపు తెరుచుకుని బయిటికి వచ్చి, "ఎవరు, మా తండ్రా అడుక్కుతినేవాడు? ఈ కొంపా, ఇందులో వుండేవాళ్ళూ, ఎంత ఐశ్వర్యంలో తులతూగిపోతున్నారో తెలుస్తూనేవుందిగా! పేరుకు ఒంటి అంతస్తుమేడ; గదుల్లో పట్టపగలే ఎలుకలూ, పందికొక్కులూ విహారం చేస్తున్నాయి. కూలిన గోడలు కూలగా, కూలిపోతున్నవాటిలో మర్రి, రావి మొక్కలు వేళ్ళూని మహావృక్ష లవుతున్నాయి. కొంపలో ఎక్కడ చూసినా దుమ్ము, చెత్త, సాలీళ్ళు, బొద్దింకెలు... ఛీ ఛీ యిదీ ఒక ఇల్లేనా? దరిద్రగొట్టు గుడిశెకన్నా హీనం," అనేసింది, కాళ్ళతో నేలను తాటిస్తూ.

పార్వతి మాటలు వింటూనే రాధాబాయి వున్నచోటనే కూలబడి పెద్దపెట్టున ఏడ్వసాగింది. ఆ వృద్ధురాలు అంతకన్న చేయగలిగిం దేమీ లేదు. పార్వతికి మాత్రం అత్తగారి ఏడుపు మరింత కోపం తెప్పించింది. బిడ్డ లున్న కొంపలో, మిట్టమధ్యాహ్నసమయాన అత్తగారు గొంతెత్తి ఏడ్వడం ఆమెకు అమంగళంగా కనిపించింది. దానితో ఆవిడ విసురుగా అత్తగారి దగ్గిరకు వచ్చి, "ఇదుగో, నా మాట వినండి. వేళకానివేళ ఏడుస్తూ కూచోవటం నే సహించను. వారిని ఇంటికి రానివ్వండి... దీని కేదో కట్టుదిట్టం చేయకుండా, నే నీ యింట్లో గుక్కెడు నీళ్ళ యినా తాగను," అని పంతం పట్టింది.

"నన్నీ ఇంట్లోంచి బయిటికి గెంటించాలనా నీ ప్రయత్నం? సరే, అలాగే చెయ్యి. నాకు నీ బాధయినా తప్పిపోతుంది," అన్నది రాధాబాయి.

"నే నన్నమాటల్లో ఆ అర్థం వుందా? ఈ గడుసు ముసలిదాని మాటలు వినండి," అంటూ పార్వతి అరవసాగింది. దానితో రాధాబాయి రెచ్చిపోయి కోడలి మీదికి దూకింది. జుట్లు జుట్లు పట్టుకుని యిద్దరూ కలియబడి కొట్టుకోసాగారు. పార్వతి భర్త సదాశివరావు వీధివాకిలిని సమీపిస్తూ, లోపల జరుగుతున్న భయంకర పోరాటం, ఆ కేకలూ వింటూనే నిలువునా కంపించిపోయాడు. అతడు పిల్లిలా చడీ చప్పుడూ లేకుండా పడమటింటిలోని తన గదికేసి వెళ్ళిపోయాడు. కాని, రాధాబాయి కొడుకును చూసింది. ఆమె పెద్దగా రోదిస్తూ, కోడలిమీద నేరాలు చెప్పసాగింది. పార్వతికూడా ఒక్కసారి భోరుమని భర్తదగ్గిరకు పోయి, నేలమీదపడి దొర్లసాగింది. సదాశివరావు పెద్దచిక్కులో పడిపోయాడు. ఒకవైపున కన్నతల్లి, రెండోవైపున ధర్మపత్ని. అతడు కొద్దిక్షణాలపాటు రాయిలా నులకమంచంమీద మాటా పలుకూ లేకుండా కూచుని, తరవాత చప్పున మంచంమీంచి లేచి, భార్యను గట్టిగా కోప్పడసాగాడు. పార్వతి ఆ మాటలతో మరింతగా ఏడుస్తూ, పక్కగదిలో నిద్రిస్తున్న పిల్లలదగ్గిరకు పోయి, వాళ్ళను లేపి వెంట తీసుకుని వీధిలోకి పోయింది.

పార్వతి ధైర్యం, ఆశ ఏమిటంటే: తనభర్త వీధిలోకి వచ్చి తనను పుట్టింటికి పోవద్దని బతిమాలి తిరిగి గృహంలోకి తీసుకువెళతా డని. కాని సదాశివరావు ఆ పని చేయలేదు. దానితో పార్వతిలో మరింత క్రోధావేశం పెరిగి, ముందువెనకలు ఆలోచించకుండా ఆమె, మరో వీధిలో వున్న శూద్రగృహానికి పోయి, ఆ ఇంటా విణ్ణి వెంటబెట్టుకుని తన పుట్టింటికి బయలుదేరింది.

ఇక్కడ సదాశివరావు తల్లికి ఎంతో వినయంగా మంచిచెడ్డలు చెప్పసాగాడు: "అమ్మా, పెద్దదానివి నీవైనా ఏదోవిధంగా సరిపెట్టుకుపోవాలి. మన అవస్థ ఎలా ఉన్నదో నీకు తెలియంది కాదుగదా? ఇవ్వాళ గడిస్తే, రేపటిమాటేమిటన్న దుస్థితిలో మనం వున్నాం. ఆ కష్టాలకు తోడు యీ గృహకలహా లేమిటి?''

కొడుకు మాటలు రాధాబాయికి మరింత దుఃఖం కలిగించినై. అతడు భార్యను వెనకవేసుకుని, తప్పంతా తనదే అన్నట్టు మాట్లాడుతున్నాడని ఆమె భావించింది. దానితో ఆమె రోదనం తారస్థాయి నందుకున్నది.

ఆ సమయంలో ఆమె రెండవకుమారుడు వినాయకరావు, పొద్దుటినుంచీ గాలికి వూరంతా తిరిగి, భోజనంవేళకు ఇల్లు చేరి, వీధిలోనుంచే, "అమ్మా! అమ్మా!" అంటూ కేకలు ప్రారంభించాడు. ఇంట్లోంచి జవాబులేదు; ఎవరూ వీధితలుపు తెరవలేదు. వినాయకరావు పిల్లిలా వెళ్ళి తలుపు నెట్టి చూశాడు, లోపల గడియ వేయకపోవటంతో అది బార్లా తెరచుకున్నది. అతడు లోపల ప్రవేశించగానే, అన్న



సదాశివరావు అతణ్ణి సమీపించి, "అమ్మ, వంటింట్లో వున్నది. మీ వదినే అమ్మా పోట్లాడుకున్నారు. వదిన జగ్గునీ, రాముణ్ణీ తీసుకుని పుట్టింటికి వెళ్ళిపోయింది,'' అని చెప్పాడు మెల్లిగా.

"అలాగా! వదినె ఎంతోదూరం వెళ్ళివుండదు. నే వెళ్ళి పిలుచుకువస్తాను," అంటూ వినాయకరావు బయలుదేరబోయేంతలో, సదాశివరావు అతణ్ణి వారిస్తూ, "ఆ గయ్యాళిముండని చావనీ. అమ్మ యింతవరకూ భోజనం చెయ్యలేదు. చాలా పొద్దుపోయింది. నువ్వూ ముందు భోజనం చెయ్యి. ఆ పిశాచాన్ని తీసుకొచ్చేందుకు వెళ్ళే సంగతి నిదానంగా ఆలోచిద్దాం,'' అన్నాడు.

వినాయకరావు వంటగదిలోకి వెళ్ళేసరికి, రాధాబాయి ఏడ్చి ఏడ్చి సొమ్మసిల్లి నిదరబోతున్నది. వినాయకుడు ఆమెను సమీపించి, "అమ్మా, అమ్మా!" అంటూ పిలిచాడు. ఆ పిలుపుకు రాధాబాయి త్రుళ్ళిపడిలేస్తూ, ఎదట కొడుకు కనబడగానే, "చచ్చినవెధవా! ఊరంతా తిరిగి యిప్పుడొచ్చావా? పో యిక్కడ్ణించి," అన్నది.

"రెండుజాముల పొద్దుపోయిందమ్మా! ఆకలిగా వుంది, ముందు అన్నం పెట్టి తరవాత నీ యిష్టం వచ్చినట్టు తిట్టు," అన్నాడు వినాయకరావు దీనంగా ముఖం పెట్టి.

పుత్రుడి మాటలతో రాధాబాయికి కోపం ఉపశమించింది. ఆమెకు మూర్ఖుడూ,

అజ్ఞానీ అయిన చిన్నకొడుకంటే ఎంతో ప్రేమ. ఆమె అతడికీ, సదాశివరావుకూ విస్తళ్ళు వేసి, అన్నం వడ్డించింది. సదాశివరావు అయిష్టంగానే వచ్చి విస్తరిముందు కూచున్నాడు. ఇద్దరూ భోజనాలు ముగించి చేతులు కడుక్కుంటూవుండగా, పొరుగింటావిడ హడావిడిగా వచ్చి, రాధాబాయితో,"చూశావా, అత్తా! నీ కోడలు చేసిన ఘనకార్యం. పడమటివీధిలో వుండే శూద్రుల యిళ్ళకు పోయి, ఇళ్ళపనులు చేసి బతికే సఖూబాయిని తోడు తీసుకుని, నీ కోడలు పుట్టింటి కెళ్ళిపోయిందట. గ్రామంలో అందరూ ఒకేయిదిగా చెప్పుకుంటున్నారు," అని చెప్పింది.

రాదాబాయి తిరిగి శోకాలు మొదలెట్టింది, "నా జగ్గూ, రాముడూకూడా వెళ్ళిపోయారు. ఇంటికి కళే పోయింది. ఒరే శివుడూ, ఆతప్పంతా నాదే; ఇక ఎన్నడూ దానితో పోట్లాడను. ఇప్పుడే బయలుదేరిపోయి పార్వతినీ, పిల్లల్నీ తీసుకురా,'' అని కొడుకును తొందరపెట్టసాగింది.

''ఇప్పుడు కాదులే, రేపు ఉదయం పెందరాళే బయలుదేరిపోతాను...అయినా నేవెళ్ళటం బావుండదు. ఏరా, వినాయకా! నీ వెళ్ళి మీ వదిన్ని తీసుకురాకూడదా?" అన్నాడు సదాశివరావు.

వినాయకుడు వణికిపోతూ, ''అన్నా! నన్ను మాత్రం మీ అత్తగారింటికి పొమ్మనకు. మీ మామగారంటే నా కసలే భయం. పొద్దున్నే నీ వెళ్ళిరా, యింటి పనులన్నీ నే జాగ్రత్తగా చూసుకుంటాను; సరేనా?" అన్నాడు.

తమ్ముడి మాటలకు సదాశివరావు నవ్వి, "ఎంత మంచిమాటన్నావురా, వినాయకా! ఇక్కడ యింటిపనులు నువ్వు చూడగలిగితే, యింక నా క్కావలసిందేముంది? ఎంతదూరం అయినా వెళ్ళిరాగలను," అన్నాడు.

వినాయకరావు కొద్దిసేపు ఏదో ఆలోచిస్తూ కూచుని, అంతలో గంజాయి సంగతి గుర్తుకు రాగా, ఎగిరి లేచినిలబడి తన గదికేసి పరిగెత్తాడు.

## 2

సదాశివరావు మామగారైన రామచంద్రపంత్ సహస్రబుధే నివశించేది ఒక చిన్న బస్తీ అక్కడ మునిసిపాలిటీ, పోలీసు స్టేషనూ వగైరా వున్నాయి. రామచంద్రపంత్ వయసులో వుండగా రైల్వే కంట్రాక్టులు చేసి బాగా ధనం ఆర్జించాడు. ఇప్పుడాయన వయసు డెభై అయిదేళ్లు. మనిషి స్థూలకాయుడు, ఆజానుబాహువు, పచ్చని శరీరకాంతి. మెడలో బంగారు తొడుగులున్న రుద్రాక్ష మాల ధరిస్తాడు. ఆయన అష్టాంగయోగసిద్ధుడనీ, పట్టణం వెలుపల వున్న చండికా

దేవి అతడికి ప్రసన్నురాలనీ, ఆ దేవి అప్పుడప్పుడూ రాత్రిళ్లు ఆలయం విడిచి, అతడికి దర్శనం యిస్తూంటుందనీ చాలామంది చెప్పుకుంటూంటారు.

రామచంద్రపంత్ భార్య గతించి పదేళ్ళయింది. అతడికి యిద్దరు పుత్రులూ, యిద్దరు పుత్రికలూ. పెద్దవాడు నారాయణరావు చనిపోయి ఆరునెల్లయింది. రెండవవాడైన మాధవరావు కంట్రాక్టుపను లన్నీ చూసుకుంటున్నాడు. పంత్ పెద్దకుమార్తె గంగ బాలవితంతువు, రెండవదైన పార్వతి, సదాశివరావు భార్య.

గంగ పుట్టినింటనే వుంటుంది. గృహంలో ఆమె మాటకు తిరుగులేదు. మనిషిలో దర్పం, మాత్సర్యం, అహంబావాలపా లధికం. ఎవరి సుఖాన్ని చూసి ఓర్వలేదు. 'లోకంలోని స్త్రీజన మంతా తనలాగే అనాథ లైతే ఎంత బావుండును,' అనుకుంటుం దామె, అప్పుడప్పుడూ. ఆమె ప్రోద్బలంమీదే రామచంద్రపంత్, తన పెద్దకొడుకు నారాయణరావు మరణించగానే, అతడి భార్యను రెండేళ్ళ కుర్ర వాడితో సహా ఆమె పుట్టినింటికి పంపేశాడు. ఇక రెండవకుమారు డైన మాధవ రావు భార్య మనోరమమీద గంగ చెలాయించే అధికారం అంతాయింతా కాదు.

సదాశివరావు సూర్యోదయంతోనే బయలుదేరి సాయంకాలానికల్లా మామగారి ఇల్లు చేరాడు. అత డొచ్చేసరికి పంత్ వీధి అరుగుమీద నిలబడివున్నాడు. అల్లుడు వచ్చి నమస్కరించగానే, ఎంతో ముభావంగా, "బావున్నావా !" అని మాత్రం అడిగి, అరుగు దిగి వీధిలోకి వెళ్ళిపోయాడు.

సదాశివరావు ఇంట్లోకి ఓమారు తొంగిచూసి, ఎవరూ కనబడకపోయేసరికి అరుగుమీద ఓ మూలగా వున్న చాప తెచ్చుకుని, పరుచుకూర్చున్నాడు. ఇంతలో బూట్లు కిర్రుకిర్రు మనిపిస్తూ, పంత్ రెండవకొడుకు మాధవరావు బయటికి వచ్చి, సదాశివరావును చూసి ఆశ్చర్యపోతూ, "ఓహో, ఎవరు వారు ? సదాశివరావా? దారి తప్పి వచ్చినట్టుందే!" అన్నాడు.

"ఏదో అందర్నీ ఓమారు చూసిపోదామని వచ్చాను," అన్నాడు సదాశివరావు వినయంగా.

"మామీద యింత అనుగ్రహమా? దానికేంగాని బావా, అసలు సంగ తేమిటో చెప్పు, వినాలనివుంది," అన్నాడు. మాధవరావు మందహాసం చేస్తూ.

"మీ చెల్లెలు ఏదో కోపంలో బయలుదేరి వచ్చింది. తిరిగి తీసుకుపోదామని వచ్చాను," అన్నాడు సదాశివరావు నంగిగా.

"తీసుకుపోయి, గొంతు కేడుకో వేసి చంపాలని కాదుగదా?" అన్నాడు మాధవ రావు పళ్ళు బిగించి.



ఆ ప్రశ్న వింటూనే సదాశివరావు ముఖం కోంపతో ఎర్రనైంది. అతడు కళ్లెర్ర చేసి బావమరిదికేసి చూస్తూ, "మేం దరిద్రులమనా, యింతచులకనగా మాటాడుతున్నారు?" అన్నాడు.

ఆ మాటలతో మాధవరావు కొంచెం తగ్గి," దరిద్రులైనంతమాత్రాన ఎవరూ భార్యల్ని నానాహింసలూ పెట్టరు. సరే, ఆ సంగతులకేం; నే నిప్పుడు అవసరం అయిన పనిమీద బయిటికి పోవలసివుంది," అంటూ మాధవరావు చేతికర్రను వయ్యారంగా తిప్పుకుంటూ వీధికేసి నడిచాడు.

సదాశివరావు అవమానంతో భగ్గుమని మండిపోతూ, లేచి బయలుదేరబోయేంతలో, అతడిపిల్లలు జగన్నాథుడూ, రాముడూ లోపలినుంచి పరిగెత్తుకుంటూ వచ్చి, చేతులతో అతడి మెడని చుట్టివేశారు. ఇంతలో దాసీ ఒకతె వచ్చి అతడితో, "తమర్ని లోపలికి రమ్మంటూన్నారు," అని చెప్పింది.



సదాశివరావు కొంచెం స్థిమితపడి ఇంట్లోకి వెళ్ళాడు. గంగ అతడికి పీటవేసి కూర్చోగానే," ఏం నాయనా? ఇంత హడావిడిగా బయలుదేరివచ్చావేం?" అని అడిగింది.

"దానిని తీసుకుపోదామని వచ్చాను," అన్నాడు సదాశివరావు చిరుకోపంగా. ఆ సమయానికి పార్వతి అక్కడికి వచ్చింది. గంగ తన చెల్లెలికేసి ఓరచూపులు చూస్తూ, "విన్నావా? నీ వీపుమీది దెబ్బలు మానినయ్యా?" అని అడిగింది.

పార్వతి భర్తను సమీపించి, "ఇప్పుడు తీసుకుపోవటానికి వచ్చారా? నిన్న ఇల్లువిడిచి వచ్చేప్పుడు, వుండమని మాటమాత్రమైనా అనలేకపోయారేం?" అని ప్రశ్నించింది.

ఈ సిగ్గుమాలిన ప్రశ్నలు నన్నడక్కు.'' అన్నాడు సదాశివరావు కోపంగా.

"నేను సిగ్గుమాలినదాన్నా? అవును, లోకంలోవున్న మర్యాదంతా మీ ఇంట్లోనే మూల్గుతున్నది. మా వంశమంతా సిగ్గుమాలిన వంశమే. అంతమర్యాదస్థులైన మీరు

యీ సిగ్గుమాలినదాన్ని తీసుకుపోయేందు కెందు కొచ్చారు ?" అన్నది పార్వతి చేతులు తిప్పుతూ.

సదాశివరావు పీటమీదినుంచి లేచి, "ఛీ, నీతో మాట్లాడటమే బుద్ధితక్కువ," అంటూ వాకిలికేసి బయలుదేరేంతలో గంగ అతడికి అడ్డం వచ్చి, "దీపాలుపెట్టే వేళ, యిప్పుడా ప్రయాణం ? ఈ రాత్రికి వుండి, రేపు ఉదయానే వెళ్ళిపోదువు గానిలే," అన్నది.

సదాశివరావు ఆలోచనలో పడ్డాడు. భార్యనూ, పిల్లల్నీ వెంటపెట్టుకుపోకుండా వెళితే, తల్లి తిరిగి శోకాలు ప్రారంభిస్తుంది. ఇక్కడ వీళ్ళేమో అందరూ తన పట్ల అమర్యాదకరంగా ప్రవర్తిస్తున్నారు. ఏమిటి చేయటం ?

గంగా, పార్వతీ గదికి ఒకమూలగా చేరి గుసగుసలు ప్రారంభించారు. ఇంతలో పధ్నాలుగేళ్ళ బాలిక మాధవరావు ప్రధమకళత్రం పోగా, ఏడాదికిందటే వివాహ మాడిన సదాశివరావు పినతల్లికుమార్తె మనోరమ, అతణ్ణి సమీపించి, "అన్నా ! మా ఇంట్లో అందరూ బావున్నారా ?" అని ప్రశ్నించింది.

సదాశివరావు జవాబు చెప్పబోయేంతలో, గంగ గర్జిస్తూ అక్కడికి వచ్చి, "సిగ్గు మాలినదానా, యింతకాలం గడిచినా నువ్విక్కడ బతుకుతున్నావో, చచ్చావో కూడా తెలుసుకునేందుకు రాని ఆ తల్లిదండ్రుల యోగక్షేమాలసంగతి నీ కెందుకు ? పో, నీ పని చూసుకో," అని కసిరించి. మనోరమ వెలవెలపోయి అక్కణ్ణించి వెళ్ళిపోయింది.

తనఅక్క గంగ, మనోరమ నెన్ని హింసలపాల్జేస్తున్నదో మాధవరావుకు తెలియదు. గంగ చూస్తూండగా మనోరమ తన భర్తగదిలోకి పోగూడదు, అత డితో మాట్లాడగూడదు, వడ్డన చేయకూడదు - ఇలాంటి కఠిననియమా లెన్నో ఆ బాలికమీద ప్రయోగించింది గంగ.

రాత్రి అందరూ భోజనాలు చేసినతరవాత సదాశివరావువెంట పార్వతికూడా గదిలోకి ప్రవేశించింది. సదాశివరావుకు తన భార్యతో మాట్లాడటం ఏమాత్రం యిష్టంలేదు. పుట్టింటి అండ చూసుకుని ఆమె తనమీద మరింతగా తిరుగబడి మాట్లాడవచ్చు. కాని, పార్వతి అలాంటి వేమీ చేయక, సదాశివరావు పడుకోగానే అతడి కాళ్ళొత్తుతూ, విసనకర్రతో విసరసాగింది. సదాశివరావుమాత్రం ఏమీ మాట్లాడక మౌనం వహించాడు.

కొద్దికాలం గడిచింది. పార్వతి వుండబట్టలేక, "ఏం నామీద అంతకోపమా?" అని అడిగింది.




“కోపమా ? ఎవరిమీద ? నీమీదా ?” అంటూ సదాశివరావు నిస్పృహగా తలాడిస్తూ, “నీమీద కోపం వుండిమాత్రం నిన్ను నే నేం చేయగలను? మీ అక్క గంగ లాంటిది నీకూ ఒక ఆడబిడ్డ వున్నట్టయితే, నీ వింత బరి తెగించేదానివి కాదు.” అన్నాడు.

పార్వతి ఆ మాటలకు కిలకిల నవ్వుతూ, సదాశివరావుమీద వాలిపోయి, “ఆ గడుగ్గాయి గంగసంగతి యిప్పు డెందుకు ? నామీద మీ కేం కోపం లేదుగదా ?” అంటూ ప్రణయసంభాషణలు ప్రారంభించింది.

అదేగృహంలో మరోప్రక్క నున్న గదిలో మాధవరావు తన భార్య అయిన మనోరమకోసం ఎదురుచూస్తున్నాడు. అతడికి నిద్రపట్టటంలేదు. మనోరమ ఎంత సేపటికీరాదు. ‘తన యీ చిన్నభార్యకు తనమీద ఏమీ ప్రేమలేదా ?’ అన్న అనుమానం అతడి కకలిగింది. తను ఆమె సౌందర్యం చూసి మోహితుడై, తొందరపడి వివాహ మాడానేమో అనుకుంటూ అతడు బాధపడసాగాడు. ఆ సమయంలో గదితలుపు నిశ్శబ్దంగా తెరుచుకున్నది. మనోరమ వాకిటిదగ్గిరే నిలబడి బయటికి మరోమారు తొంగిచూసి, తన ఆడబిడ్డ గంగ ఆ ప్రాంతాల లేదని దృఢపరుచుకుని, పిల్లిలా అడుగులో అడుగు వేసుకుంటూ వచ్చి, భర్తమంచాన్ని సమీపించింది.

మనోరమ ప్రవర్తన మాధవరావుకు చాలా కోపం తెప్పించింది. ఎందు కావిడ దొంగలా ప్రవర్తిస్తుంది? మనోరమ వచ్చి మంచంమీద కూర్చోగానే, మాధవరా వామెకేసి తిరిగి, "నీ ప్రవర్తన నాకు చాలా ఆశ్చర్యం, కోపంకూడా కలిగిస్తూం టుంది. నిన్ను నే నెంతగానో ప్రేమిస్తున్నాను. నీ సుఖంకోసం నే నెన్నో త్యాగాలు చేశాను. కాని, నువ్వు......"

మనోరమ, అతడిమాటలకు అడ్డొస్తూ, చిన్నగొంతుతో. "కొంచెం మెల్లిగా మాట్లాడండి, ఎవరైనా వింటారు," అన్నది.

భార్యమాటలు మాధవరావుకు ఎంతో అసహ్యం కలిగించినై. అతడు ముందు వెనుకలు ఆలోచించుకుండా చప్పున మంచంమీంచి లేచి రివ్వున గదిబయటికి వచ్చేశాడు. మనోరమ భర్తప్రవర్తన చూసి నిర్విణ్ణురాలయింది. ఏం చేయాలో ఆ క్షణంలో ఆమెకు తోచిందికాదు. మాధవరావు నిశ్శబ్దంగా వీధితలుపు తెలిచి, దగ్గరకు వేసి, వీధివెంట బయలుదేరాడు. పైన ఆకాశంలో పూర్ణచంద్రుడు; వీధి నిర్మానుష్యంగా వున్నది. అతడు త నెక్కడికి పోతున్నదీ ఆలోచించకుండానే నాలుగువీధులూ తిరిగి, కొంతసేపటికి వారకాంత లుండే వీధిలో ప్రవేశించాడు. అక్కడ ఒక భవంతిముందున్న పూలచెట్ల మధ్యనుంచి, మధురమైన జావళీపాట అతడి చెవులబడింది. మాధవరావు ఆగి, అటుకేసి తలతిప్పాడు. మరునిముసంలో పూలచెట్లలోనుంచి ఒక అపూర్వ సౌందర్యరాసి లేచినిలబడింది. మాధవరావు మంత్రముగ్ధుడిలా ఆమెకేసి నడిచాడు. అదొక దుర్ముహూర్తం. ఆ క్షణంనుంచే మాధవరావు పతనం ప్రారంభమైంది; మనోరమ కష్టాలు యినుమడించినై. వీ టన్నింటికీ గంగ పైశాచిక ప్రవృత్తే, ప్రత్యక్ష పరోక్ష కారణంకూడా.

* * * *

వారంరోజులు గడిచినై. పార్వతి అత్తవారింటికి వచ్చేసంగతి ఎటూ తేల్చక, అంతా తన తండ్రీ సోదరుల యిష్టం అన్న ధోరణిలో మాట్లాడసాగింది. సదాశివ రావు మామగారిదగ్గిర యీ విషయం తెస్తే, ఆయన ముఖం ముడుచుకుని, "ఇవన్నీ నన్నడుగుతా వెందుకు? కుటుంబభార మంతా వహించేవాడు, మాధవ రావు. నేను సంసారవిషయా లేమీ పట్టించుకోవటం లేదు; నేను సర్వసంగ పరి త్యాగిని," అనేశాడు.

తప్పనిసరై సదాశివరావు బావమరిదిదగ్గిర పార్వతి విషయం ప్రస్తావించాడు. అతడు నిండుగా నవ్వి, "మా చెల్లెలు అక్కడేం సుఖపడుతుంది? న న్నడిగితే, మీకూ అక్కడేం సుఖంలేదు. ఉద్యోగం లేకపోయె, కానీ సంపాదన లేకపోయె,




అక్కడుండి ఎలా బతకటం? నీ సంగతి బాగా ఆలోచించి ఒక నిర్ణయం చేసేశాను. ఇప్పుడు నేను చేస్తున్న కంట్రాక్టుపని చాలా లాభసాటిగా వుంది. నేనొంటరిగా ఆ పనులన్నీ చూసుకోవటం కష్టమవుతున్నది. రేపటినుంచీ నువ్వూ నాతోపాటు వచ్చి ఆ పనులు చూస్తూండు. కష్టపడి ఆ లగూబిగూలు నేర్చుకున్నావంటే, నీకు నా కంట్రాక్టులో భాగం యిస్తాను," అన్నాడు.

బావమరిది యిలా అనేసరికి, సదాశివరావు తన్మయుడై పోయాడు. కంట్రాక్టు పనుల్లో వచ్చే లాభాల్లో తనకు వాటా రావటమే జరిగితే, తన దరిద్రం తీరిపోతుంది. ఇంటిదగ్గిర వుండి చేసేపని ఏమీలేదుగదా? ఇలా అనుకుని సదాశివరావు బావమరిది సూచనకు ఇష్టంగా తలాడించాడు. ఆ మరసటిరోజునుంచీ అతడివెంట తిరగసాగాడు. తను అత్తగారింటికి వచ్చినపని అతడు పూర్తిగా మరిచిపోయాడు. తను బావమరిది వ్యాపారంలో భాగస్థుడుగా చేరినసంగతి తల్లికి రాయకపోగా, అసలు క్షేమసమాచారాలైనా ఆమెకు తెలియపరచలేదు.

నెలరోజులైనా తన పెద్దకొడుకు కోడలిని వెంటబెట్టుకొని రాకపోయేసరికి, అక్కడేదో పుట్టి మునిగిందనుకుని రాధాబాయి తన చిన్నకొడుకు వినాయకరావును అన్నదగ్గిరకు పంపింది. ఆ అమాయకుడు పట్నం చేరి, రామచంద్రపంత్ ఇంటికి వచ్చి, ఆ లోగిలీ, ఆ అలంకరణలూ చూసి భయపడిపోయి, ఇంటి పెద్దనౌకరు రాముడు నివశించే తాటాకుల చావిడిలోకి పోయి కూర్చున్నాడు. ఆ సమయంలో రాముడక్కడ లేడు. వినాయకరావు ఏమీ తోచక తల గోక్కుంటూ అటూ యిటూ చూసేంతలో, ఆతడికి చూరులో గంజాయి తాగే చిలుము కనిపించింది. 'అమ్మా! బతికిపోయా'ననుకొంటూ, అతడు చిలుమూ, దానిపక్కనేవున్న గంజాయిసంచీ తీసి,

చిలుములో దాన్ని దట్టించసాగాడు. అంతలో రాముడు గబగబా అక్కడికి వచ్చి, "ఏయ్ ! ఎవరు నువ్వు ? ఏవిఁటా దొంగపని ?" అని గద్దించి అడిగాడు.

ఆ ప్రశ్నకు వినాయకుడు అదిరిపడి, "నేను దొంగనుకాదు, వినాయకరావుని," అన్నాడు.

"వినాయకరావా ? ఏం పనిమీద వచ్చావ్ ?" అన్నాడు రాముడు.

"అమ్మ పంపింది – అన్నయ్యను తీసుకురమ్మన్నది."

"ఏవిఁటా వెధవమాటలు? ఇక్కడ నీ కన్నయ్యా ఎవరు ? నేనా ?" అన్నాడు రాముడు మండిపడుతూ.

"మా అన్నయ్య సదాశివరావు."

సదాశివరావు పేరు వింటూనే రాముడు అదిరిపడి, "ఏంటీ, మీరు సదాశివరావు బాబుగారి తమ్ములా ? అట్టా చెప్పరేం. ఆ చిలుం యిట్టా యివ్వండి, దమ్ము నే తయారుచేసియిస్తా," అంటూ చిలుం తీసుకుని గంజాయినింపి, వినాయకరావు చేతి కిచ్చాడు.

సదాశివరావు ఇంట్లోనుంచి బయటికివెళుతూ, నౌకరు యింట గంజాయి పీలుస్తూ కూర్చునివున్న తమ్ముణ్ణి చూసి, "అరే వినాయకా! ఎప్పుడొచ్చావ్," అని ప్రశ్నించాడు.

"ఇదే రావటం అన్నా. అమ్మ, నిన్నూ వదినెనీ పిల్లల్నీ తీసుకురమ్మన్నది," అన్నాడు వినాయకుడు, గట్టిగా గంజాయి దమ్మొకటి లాగి.

సదాశివరావు తమ్ముణ్ణి సమీపించి, భుజం తట్టి, "వినాయకా! మన దరిద్రం తీరిపోయేరోజు వచ్చిందిరా. నా కిక్కడ ఉద్యోగం దొరికింది," అని చెప్పాడు.

"ఉద్యోగం దొరికిందా ! భలే. నీకు ఉద్యోగం దొరికిందిగనక నువ్విక్కడే వుండు. వదినా, పిల్ల లేంచేస్తారు – వాళ్ళను నేను మనింటికి తీసుకుపోతాను," అన్నాడు వినాయకరావు ఉత్సాహంగా.

"అది కుదరదురా వినాయకా! నీవు ఇంటికెళ్ళి అమ్మతో నాకు ఉద్యోగం దొరికిందనిచెప్పు. చాలా సంతోషిస్తుంది. కుటుంబానికి నాభారం, పిల్లలభారం తగ్గినా తగ్గినట్టే," అన్నాడు సదాశివరావు.

"అవునన్నా...భారం తగ్గినా తగ్గినట్టే. ఈ సంగతే అమ్మతో చెపుతాను. భలే సంతోషిస్తుందిలే," అంటూ వినాయకరావు, చిలుమును వడిసిపట్టి గట్టిగా ఒక సారి పీల్చి, ఖాళీచిలుమును రాముడిచేతి , కిస్తూ "ఇకనే వెళతానన్నా; వచ్చినపని అయిపోయిందిగా ?" అంటూ సదాశివరావు పిలుస్తున్నా, ఆగకుండా, వీధిలోకి నడిచాడు.

## 3

వినాయకరావు ఇంటికి తిరిగివచ్చి, సదాశివరావుకు ఉద్యోగం దొరికిందనీ, అత్తగారి ఇంటిదగ్గిరే వుండిపోతా నన్నాడనీ తల్లికి చెప్పాడు. రాధాబాయి యీ వార్త విని శోకాలు ప్రారంభించింది. వినాయకరావుకు తల్లి ఎంతుకు దుఃఖిస్తున్నదో అర్థం కాలేదు. ఇరుగుపొరుగువా ళ్ళొచ్చి ఆమెను సముదాయించ చూశారు. కాని, ఆమె ఏడుపు మానలేదు. రెండుమూడురోజులు ఇలాగే గడిచినై. వినాయకరావు యిక వుండబట్టలేక, "అమ్మా! నువ్వెందు కెప్పుడూ ఏడుస్తూ కూర్చుంటావ్? నే నేం చేస్తే నీకీ విచారం పోతుంది? చెప్పు చేస్తాను," అన్నాడు.

"నాకు విచారం కాక సంతోషం ఎలా కలుగుతుందిరా వినాయకా! నాకు తెలుసు, పెద్ద కొడుకూ, కోడలూ, మనవళ్లూ ఇక యీ గడప తొక్కరు. ఊళ్ళో వాళ్ళంతా, నేను వాళ్ళను వేధించి, ఇంటినుంచి తరిమేశానని చెప్పుకుంటున్నారు. చావ సిద్ధంగా వున్న నేనూ, అమాయకుడివైన నువ్వూ యీ యింట్లో యింకెంత కాలం వుండగలం. నువ్వు మీ మామగారింటికి పోయి, నీ పెళ్ళాన్నయినా తీసుకు రాగలిగితే యిల్లు మళ్ళీ కళకళ లాడుతుంది. నీ పెళ్ళాం లక్ష్మి; నిజంగా లక్ష్మేరా నాయనా!" అంటూ రాధాబాయి మళ్ళీ దీర్ఘాలు మొదలెట్టింది.

తల్లిమాట పూర్తయేలోపలే వినాయకరావు తన గదిలోకి వెళ్ళి, గుడ్డలు మార్చుకుని, చెప్పులు తొడుక్కుని బయిటికి వచ్చి, "అమ్మా! నువ్వు చెప్పేది లక్ష్మిని తీసుకురమ్మని, అంతేగా? ఇదుగో యిప్పుడే బయలుదేరి మామగారి ఊరు పోతున్నాను. సరేనా?" అన్నాడు.

రాధాబాయి కొడుకును కావిలించుకుని, "వెళ్ళిరా నాయనా!" అని దీవించి, మనసులో, 'వీడు నిజంగా వినాయకుడేనా? ఎంత చోద్యం! ఆ నిద్రమత్తూ, సోమరితనం ఏమయింది?' అనుకుని చాలా ఆశ్చర్యపడింది.

ఆ రోజు సాయంకాలంవేళకు వినాయకరావు మామగారి గ్రామం చేరాడు. తీరా వెళ్ళింతరవాత అతడికి మామగారి ఇంటికి వెళ్ళడానికి భయంవేసింది. మామగారు బాగా సంపన్నుడు, గ్రామ దేశముఖ్. వాళ్ళంతా బాగా చదువుకున్న నాగరికులు. వాళ్ళ కట్టూ బొట్టూ మాటతీరూ వేరు. తన భార్యకూడా బాగా చదువుకున్న మనిషి. తను అంతగా చదువుసంధ్యలురాని పల్లెటూరి అమాయకుడు; బీదవాడు. అలాంటి పరిస్థితుల్లో త నెలా సరాసరి మామగారింటి కెళ్ళి, భార్యను పంపమని అడగటం...

గ్రామపు పెద్దవీధివెంట యిలా ఆలోచిస్తూ నడుస్తున్న వినాయకరావుకు హఠాత్తుగా తమ వూరువాడైన ఒక దుకాణాదారు గుర్తుకు వచ్చాడు. అతడు తన

కుగ్రామం వదిలి ఈ వూళ్ళో చిల్లరకొట్టు పెట్టుకుని బాగా సంపాయించుకుంటున్నాడు. ముందు తనతని దుకాణానికి పోయి కొంచెం విశ్రాంతిగా ఏమిజేస్తే బావుంటుందో ఆలోచించుకోవా లనుకున్నాడు వినాయకరావు.

అతడు దుకాణందగ్గిరకు వెళ్ళేసరికి, దుకాణందారు ఎవరికో వెచ్చాలిస్తున్నాడు. వినాయకరావు ఒక పక్కగా నిలబడ్డాడు. పనవగానే దుకాణంవాడు, తల తిప్పి వినాయకరావుకేసి చూసి, "అరే! వినాయకరావుగారా? ఎప్పుడు రావటం? రండి రండి, కూర్చోండి!" అంటూ దుకాణానికి వెనకవున్న ఖాళీప్రదేశంలో చాప పరిచి అతణ్ని కూచోబెట్టి, "బాగా అలిసిపోయినట్టున్నారే .. ఆ అలవాటు మానుకో లేదుగదా? సరే," అంటూ వెనుదిరిగి, దుకాణంలో ఒకపక్కగా నిలబడివున్న పద్నాలుగేళ్ళ కుర్రవాడితో, "ఒరే, బాలకృష్ణా! అలా బెల్లంకొట్టిన రాయిలా నిల్చుంటావేం? వీ రెవరనుకున్నావ్? మన గ్రామ దేశముఖ్‌గారి అల్లుడు. చిలుం తయారుచెయ్యి – ఊఁ త్వరగా," అని ఆజ్ఞాపించాడు.

బాలకృష్ణుడు మాంచి చురుకైన కుర్రకుంక. వాడు క్షణాలమీద చిలుం శుభ్ర పరిచి, గంజాయి దట్టించి, కొబ్బరిపీచు నలిపి వుండగా చుట్టి, కాల్చి వినాయకరావు దగ్గిరకు పట్టుకొచ్చాడు. వినాయకరావు ఆత్రంగా చిలుము తీసుకున్నాడు. బాలకృష్ణ కాల్చిన కొబ్బరిపీచువుండను సుతారంగా చిలుముపైన పెట్టాడు. వినాయకరావు తృప్తిగా రెండుదమ్ములు లాగి, దుకాణాదారుతో, "నీకు చెప్పకపోవటం ఎందుకు? నా భార్యను తీసుకుపోయేందు కొచ్చాను. తప్పక తీసుకుపోతాను. అయినా మామ గారు పంపుతా రంటావా?" అన్నాడు నిస్పృహ కనబరుస్తూ.

"ఎందుకు పంపరూ?" అంటూ దుకాణంవాడు వినాయకరావుకు ధైర్యం చెప్పి, అప్పుడే దుకాణంముందు కొచ్చిన ఒకడితో, "ఒరే భీముడూ! వీ రెవరో గుర్తు పట్టగలవా?" అంటూ వినాయకరావును చూపించాడు.

భీముడు కళ్ళు చిట్లించి, వినాయకరావుకేసి ఓ తృటికాలం చూచి, చేతు లెత్తి దణ్ణంపెడుతూ, "ఇనాయికబాబుగోరు! గుర్తుపట్టలేకేం? బాబుగో రెప్పు డొచ్చారు? ఇక్కడ కూకున్నారేం?" అని ప్రశ్నించాడు.

"వచ్చి ఘడియకూడా కాలేదులేరా. మీ యింటికే వస్తున్నారు. దేశముఖుగారు ఇంట్లో వున్నారా?" అనడిగాడు దుకాణదారు.

"ఇంటోనే వున్నారు. అల్లుడుగోరు నీ దుకాణంలో కూచోవడం ఏటి? ఛ ఛ. యిప్పుడే ఎళ్ళి బాబుగోరికి చెపుతా," అంటూ భీముడు, దుకాణందారు వేసే కేకలు వినిపించుకోకుండా వీధివెంట పరిగెత్తాడు.

పొద్దుగుంటకల్లా వినాయకరావు మామగారు నానాదేశముఖ్, భీముణ్ణీ యింకా నలుగురైదుగురు నౌకర్లనూ వెంటబెట్టుకొని, అల్లుణ్ణి ఇంటికి తీసుకుపోయేందుకు దుకాణందగ్గిరకు వచ్చాడు. మామగార్ని అంతదూరాన చూస్తూనే వినాయకరావు దుకాణదారుతో, కాస్త తోడుగా వుండేందుకు బాలకృష్ణను తనవెంట పంపవలసిందిగా కోరాడు వినాయకరావు వట్టి అమాయకుడన్న సంగతి దుకాణంవాడికి బాగా తెలుసు. బాలకృష్ణబోటి చురుకైన కుర్రాడు వెంట వుండటం, కొత్తచోట వినాయకరావు కెంతైనా సహాయం అనుకొని, అతడు కుర్రవాణ్ణి వినాయకరావు వెంట పంపాడు.

నానా దేశముఖ్ గ్రామంలో ఐశ్వర్యవంతుడేగాక, ఎంతో ధార్మికుడూ, పరోప కారపారీణుడూ, ధర్మపరుడూ అన్న పేరుకూడా గలవాడు. ఆయన అల్లుణ్ణి సకల మర్యాదలతో ఇంటికి తీసుకుపోయాడు. దారిలో వినాయకరావు కుటుంబక్షేమసమా చారా లన్నీ అడిగి తెలుసుకున్నాడు.

ఆ రాత్రి గ్రామంలోని ముత్తయిదువులు చాలామంది నానాదేశముఖ్ యింటి కొచ్చారు. ఇన్నాళ్ళతర్వాత నానా అల్లుడు లక్ష్మిని తీసుకుపోవటానికి వచ్చాడని తెలిసి, గ్రామస్తు లందరూ పరమానందం చెందారు. యీనాటితో లక్ష్మి కష్టాలు తొలగినై అని యింటికొచ్చిన ముత్తయిదువులందరూ సంతోషించారు. కాని, ఇంట చేరిన స్త్రీజనంలో వరసఅయినవాళ్ళు కొందరు, "దారి తప్పి వచ్చారా మరిది గారూ ?" అనీ, "మా లక్ష్మి కేం తెచ్చారూ ?" అనీ తమాషాగా ప్రశ్న లడగటం ప్రారంభించేసరికి, వినాయకరావు బెంబేలుపడిపోయాడు. బాలుడైన బాలకృష్ణుడు మాంచి మాటకారిగనక, వినాయకరావుతరఫున ఆ ప్రశ్న లన్నిటికీ జవాబు లివ్వ సాగాడు. అక్కడ చేరినవా రందరికీ అతడు, వినాయకరావు మా అన్న అని నిస్సంకోచంగా చెప్పేశాడు.

రాత్రి బాగా పొద్దుపోయింతరవాత, ఇంటికొచ్చిన పేరంటాళ్ళంతా వెళ్ళిపోయారు. అప్పుడు లక్ష్మి, వినాయకరావు వున్నగదికి వచ్చింది. భార్య ఏం ప్రశ్నిస్తుందో, ఏమని జవాబు చెప్పాలో అని వినాయకరావు గుండెలు పీచు పీచు మంటున్నాయి. పైగా, గంజాయి పీల్చి అప్పటికి శానాగంటలు గడిచిపోయింది. అతడి మనస్సు గంజాయి చిలుముచుట్టూ గిరికీలు కొట్టసాగింది.

తన భర్త అమాయకత్వం, దుర్వ్యసనాలసంగతీ లక్ష్మికి బాగా తెలుసు. కాని, భర్తగా అతడు ప్రత్యక్ష దైవం. ఆమె గదిలో వెలుగుతున్న దీపం కొంచెం తగ్గించి, భర్త మంచందగ్గిరకు వచ్చి చూసి, అతను మేల్కొని వున్నట్టు గమ నించింది. కాని, వినాయకుడామెన్ను పలకరించలేదు. లక్ష్మి ఒక్క క్షణకాలం



భర్త పలకరిస్తాడేమో అని అలాగే నిలబడి, అతడు మౌనంగా వుండిపోవటంతో, "ఏమండీ, యింటిదగ్గర అంతా కులాసాగా వున్నారా?" అని అడిగింది.

"ఊఁ." అన్నాడు వినాయకరావు మంచంమీద ఒకపక్కకు జరుగుతూ.

లక్ష్మి మంచంమీద కూర్చుని, "ఏం అలా వున్నారు? పాపం, చాలా దూరం నడిచివచ్చారుగదా! ఈ సంగతి చెప్పండి. యింతకాలం నన్ను తీసుకుపోయేందుకు రాలేదేం!" అన్నది లక్ష్మి.

వినాయకరావు నిజం చెప్పెయ్యటమా, మానటమా అని కాసేపు తర్కించుకుని, చివరకు. "లోగడ నువ్వు మా యింటికి వచ్చినప్పుడు, నీ నగలు తీసుకుని అమ్మి, ఆ డబ్బు ఖర్చుచేశాం గదా. ఆ నగలు తిరిగి నీకు చేయించకుండా, ఇంటికి తీసుకు రావటం బావుండ దనుకున్నాం.' అన్నాడు.

లక్ష్మి చిన్నగా నవ్వి, "ఈ స్వల్పానికి న న్నెంతకాలం పుట్టింట వుంచారండీ! మా నాయనగారు ఎప్పుడో నాకు మళ్ళీ నగలు చేయించారు." అన్నది.

వినాయకరావు ఆదుర్దాగా, "అయితే రేపు నా వెంట బయలుదేరి వచ్చేప్పుడు ఆ నగలుకూడా మేళ్ళో వేసుకొస్తావా?" అని ప్రశ్నించాడు.

"ఇ దేం ప్రశ్న? మీరు చాలా చమత్కారంగా మాట్లాడతారండీ! ఈ నగలు మనవి. మన ఇంటి కొచ్చేప్పుడు తేకుండా యిక్కడ వొదిలి వస్తాననుకున్నారా? మన ఇంటి కర్చులకు అవసరం అయితే, వీటినికూడా ఉపయోగించుకోవచ్చు." అన్నది లక్ష్మి.

ఆమాటలకు వినాయకరావు చాలా విస్మయం చెందాడు. భార్య అన్న మాటల్లో ఏదైనా గూడార్థం వున్నదేమో అన్న అనుమానం అతడి కక్కలిగింది. ఎంత ఆలోచించినా బుర్ర వేడెక్కటం తప్ప, అతడి కేమీ అంతుపట్టలేదు. ఒక్క గంజాయి పట్టు దొరికితే ఎంతబావుండును,'' అనుకుంటూ అతడు భార్యమాటే మరచి, మంచంమీద అటూయిటూ పొర్లసాగాడు. భర్త అలవాట్లు బాగా ఎరిగివున్న లక్ష్మి, గదిలోకి వచ్చేముందే చిలుము సిద్ధం చేసివచ్చింది. ఆ కారణంవల్ల ఆమె చిరునవ్వునవ్వుతూ లేచివెళ్ళి చిలుము తెచ్చి భర్త చేతి కిచ్చింది. వినాయకరావు చిలుము వెలిగించి బలంగా ఒక దమ్ము లాగి తన్మయుడై పోయాడు. ఆ క్షణంలో అతడికి భార్య అంటే వున్న బెదురూ, భయం అంతా పోయింది.

* * * *

నాలుగురోజుల తరువాత ఒక మంచిముహూర్తం చూసి నానాదేశముఖ్, కూతురు లక్ష్మిని అత్తవారింటికి ప్రయాణం చేయించాడు. వియ్యపువారి యింటి పరిస్థితులు తెలిసినవాడు గనక, ఆయన కుమార్తెతోపాటు ఆరునెల్లవరకూ దమ్మిడీ ఖర్చు పెట్టకుండా గృహానికి సరిపడా సంబారాలు రెండు బళ్ళమీద వేయించాడు. ఈ నాలుగురోజులూ "అన్నా, అన్నా!" అంటూ కుర్రవాడు బాలకృష్ణ, వినాయక రావువెంట తిరిగాడు. ఆఖరిక్షణంలో వినాయకరావు దుకాణంవాణ్ణి అడిగి, ఆ కుర్ర వాణ్ణి తనగ్రామం తీసుకుపోయేందుకు ఒప్పించాడు.

చిన్నకొడుకూ, చిన్నకోడలూ యింత ఆర్భాటంగా బళ్ళు కట్టించుకుని యింటి కొస్తారని రాధాబాయి అనుకోలేదు. అస లామెకు వియ్యంకుడు తన కోడల్ని పంపుతా డన్న నమ్మకంకూడా లేదు. కానీ, జరిగింది చూసి ఆమె బ్రహ్మానందం చెందింది. కోడల్ని గుర్రబ్బండీనుంచి స్వయంగా చేయిపట్టుకుదించి, "మా లక్ష్మివే, మాఇంటి మహాలక్ష్మివే!'' అంటూ కావిలించుకుని ఆనందభాష్పాలు రాల్చింది.

లక్ష్మి, బాలకృష్ణా కలిసి వారంరోజులకల్లా ఇంటి రూపురేఖలే మార్చేశారు. దుమ్మూ దూగరా, సాలెగూళ్ళూ, గోడల్లో మొలిచిన మర్రీ రావీ మొక్కలూ పీకి వేసి, గోడలూ, ఇల్లూ మెత్తించి వెల్లవేయించారు. సంసారవిషయాలు పట్టిం చుకోకుండా, ఊరువెంట తిరుగుతూ, వాళ్ళకూ వీళ్ళకూ అడ్డమైనచాకిరీ చేసిపెట్టే

వినాయకరావు ఇంటిపట్టునే వుండి, కుటుంబవిషయాల్లో కొంచెం కొంచెమే శ్రద్ధ చూపసాగాడు.

కాలం గడుస్తున్నది. వినాయకరావులో చాలా మార్పు వచ్చింది. అత డిప్పుడు పూర్వంలాగా గంజాయికోసం తపించిపోవటంలేదు. ఒకోసారి వరసగా వారం రోజులపాటు చిలుము ముఖం చూడకుండానే వుండగలుగుతున్నాడు. కాని, అత డికి ఏ పనీ చేతకాదు; దమ్మిడీ సంపాయించే శక్తికూడా లేదు.

తండ్రి తనతోపాటు పంపిన సంబారాలన్నీ క్రమంగా తరిగిపోతూండటం చూస్తూన్న లక్ష్మి, మ రొకటిరెండు నెలల్లో అన్నీ అయిపోయింతరవాత సంసారము గడపటం ఎట్లా అన్న ఆలోచనలో పడింది. ఆమెకు తండ్రినుంచి మరోసారి సహాయం పొందడం యిష్టంలేదు. ఆమె బాగా ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చింది. ఆ నిర్ణయం అమలు జరగాలంటే ముందు అత్తగారు అంగీకరించాలి. ఆమేగదా కుటుంబానికి పెద్ద.

ఒకరోజున లక్ష్మి అత్తగారితో కుటుంబపరిస్థితి అంతా చెప్పి, "ఇలా తింటూ కూర్చుంటే సంసారం గడవదు, బావగార్నుంచి మనం ఎలాంటి సహాయం యాచించటం బావుండదు. పైగా, ఆయనే కుటుంబంతో అత్తగారింట నివశిస్తూ బావమరిదికి కంట్రాక్టుపనుల్లో సహాయపడుతున్నాడుగదా. అందువల్ల ఆయన స్వతంత్రంగా మన కెలాంటి సహాయం చేయలేడని నా అనుమానం. మీ రనుమతిస్తే, ఒకటి చేద్దాం అత్తయ్యా!" అన్నది.

"ఏమిటమ్మా. అది? చెప్పుతల్లీ," అన్నది రాధాబాయి.

"మరేంలేదు, అత్తయ్యగారూ! నా నగ లమ్మి ఆ డబ్బుతో ఏదైనా వ్యాపారం చెయ్యటం తప్ప, సంసారం గడిచేందుకు మరోమార్గంలేదు. నగలమ్మితే కనీసం రెండువేల రూపాయి లొస్తయ్. ఆ డబ్బుతో మనం పంటకాలంలో యాభై అరవై పుట్ల ధాన్యం కొని, మూడునాలుగునెలల తరవాత అమ్మితే కొంత లాభం చేసుకోవచ్చు. అంతేకాక చేసేవాళ్ళు లేక బీడుగా వున్న మన నాలుగుకుంట్ల పొలం కొంత దావుచేయించి, ఏ మొక్కజొన్నో, కందో, చామదుంపో నాటేస్తే— అదీ నాలుగు డబ్బులు తెస్తుంది," అంది లక్ష్మి.

చిన్నకోడలి ఆలోచనకు రాధాబాయి నిర్ఘాంత పోతూ, "నగ లమ్ముకోవటమే నలుగురిలోనూ తలవంపులుగా వుంటుంది. సరే, అట్లా వుంచు; ఆడవాళ్ళం మనకు యీ ధాన్యవ్యాపారం, వ్యవసాయం ఏం తెలుసు? వినాయకుడు చూడబోతే...



యిప్పుడిప్పుడూ కొంచెం దారిలోకి వస్తున్నా — ఈ పనులన్నీ చక్కబెట్టగల వ్యవహారజ్ఞానం వాడి కెక్కడిదీ ?" అన్నది.

అంతలో బాలకృష్ణ అక్కడికి వచ్చాడు. లక్ష్మి అతడికి తన ఆలోచనలన్నీ ముందుగానే చెప్పింది. అతడు లక్ష్మిని

వదినా అనీ, రాధాబాయిని అమ్మఅనీ పిలుస్తూ, కుటుంబంలో ఒకడుగా మసులుకుంటు న్నాడు. అతడు వస్తూనే, రాధాబాయితో "వదినె ఆలోచనలన్నీ నాకు తెలుసు. నేను నాలుగైదేళ్ళు వచారీదుకాణంలో పనిచేసివున్నవాణ్ణి. నాకు వ్యాపారం మెలుకు వలు తెలియనివికావు. చిన్నతనంలో మానాన్న బతికుండగా ఆయనతోపాటు పొలం వెళ్ళి చాతైనంతలో ఆపనులుకూడా చేస్తూండేవాణ్ణి. వినాయకరావన్నా, నేనూ కలిసి వ్యాపారం వ్యవసాయంకూడా చేయగలం. మీ రేం భయపడమా కండి," అనేశాడు ధీమాగా.

కోడ లెంతో నచ్చచెప్పినమీదట రాధాబాయి, నగ లమ్మి వచ్చినడబ్బుతో ధాన్య వ్యాపారం చేయటానికీ, వున్న నాలుగుకుంట్ల పొలంలో వ్యవసాయం ప్రారంభించ టానికీ అంగీకరించింది. లక్ష్మి ఆమర్నాడే ఎరిగిన ఒక కంసాలిద్వారా తన నగ లమ్మి, అవచ్చిన డబ్బుతో ముప్ఫైపుట్ల ధాన్యం కొని, ఇంట్లోవున్న కొట్లలో నిల్వచేయించింది. వినాయకరావూ, బాలకృష్ణా కలిసి ఇద్దరు ముగ్గురు కూలీల సాయంతో పొలంలో వున్న జిల్లేడు మల్లేడు మొక్కలు తవ్వించేసి, చక్కగా దున్నించి, తొలకరివానలు పడగానే, కొంతభాగంలో జొన్నా, తతిమ్మాదాంట్లో కూరపాదులూ పెట్టించారు.

## 4

మామగారి ఇల్లు చేరిన సదాశివరావుకూ, అతడి భార్యాపుత్రులకూ, ఆ ఇంట తిండితిప్పలైతే ఒకమాదిరిగా గడుస్తున్నయ్యే కాని, గౌరవమర్యాదలూ, ఆదరణా పూర్తిగా లేకుండాపోయినై. బావమరిది మాధవరావు వేశ్యాలంపటుడైపోయి, కంట్రాక్టుపను లన్నీ సదాశివరావుపైన పెట్టి, డబ్బుకు సంబంధించిన లావాదేవీలు మాత్రం తనచేతిలోనే వుంచుకుని, విచ్చలవిడిగా ఖర్చుపెట్టేస్తున్నాడు. తండ్రి రామచంద్రపంత్ కొడుకును తిరిగి మంచిమార్గంలో పెట్టాలనిచూచి, అతడిచేత నానామాటలూపడి, అవమానంతో, దిగులుతో ఒకనెల్లాళ్ళు మంచంపట్టి కాలధర్మం చెందాడు. దానితో బాలవిధవ గయ్యాళిగంగ ఇంటి పెత్తందారై, మాధవరావుభార్య మనోరమనూ, సొంతచెల్లెలు పార్వతినీ నానాహింసలూ పెట్టసాగింది. మాధవరావు ఎప్పుడైనా దారితప్పి వేశ్యాగృహాలనుంచి యింటి కొస్తే, అతడితో ఆమె మనో రమమీద లేనిపోని నేరాలన్నీ కల్పించిచెప్పేది. మాధవరావుకు తన భార్యమీద ప్రేమ లేకపోయినా, ద్వేషంమాత్రం లేదు. ఆకారణంగా అతడు తన అక్కతో కార్యతరపున వాదించిచూశాడు. గంగ జుట్టు పీక్కుని, తల బాదుకుంటూ, "నాకు

భర్త పోయాడు, తండ్రీ పోయాడు; పుట్టింట చేరి ఈనాడు తమ్ముడివల్ల అవమానాలు పడవలసివస్తున్నది," అంటూ శోకాలు ప్రారంభించేది.

గృహపరిస్థితి చూసి మరింతగా విసిగిపోయిన మాధవరావు భార్యను కొన్నాళ్ళు పుట్టింట వుండిరమ్మని పంపాడు. మనోరమ తల్లిదండ్రులది వినాయకరావు వుండే గ్రామమే; ఆమె వినాయకరావు పినతల్లి కుమార్తె కూడా.

ఉన్నట్టుండి ఒకనాటి ఉదయం వురమకుండా పిడుగుపడ్డట్టు, సదాశివరావు మామగారి ఇంటి నౌకరు రాధాబాయి యింటికి ఒక దుఃఖవార్త మోసుకొచ్చాడు. అదేమిటంటే, పోలీసులు మాధవరావునూ, సదాశివరావునూ అరెస్టుచేసి బొంబాయికి తీసుకుపోయారు. కారణం, వాళ్ళిద్దరూ, ఎవరో యిచ్చిన వెయ్యిరూపాయల చెక్కును, పదివేలుగా అంకెలు ఫోర్జరీచేసి బ్యాంకులో మార్చి ధనం అపహరించారు.

రాధాబాయి నిర్విణ్ణురాలై నోట మాటా పలుకూ లేకుండా కొంచెంసేపు నిలువు గుడ్లు వేసుకుచూసి, మూర్ఛపోయింది. లక్ష్మి ఆమెకు శైత్యోపచారాలు చేసి, స్పృహ రాగానే, "అత్తయ్యా! మీ రేం అంతగా భయపడకండి. నే నివ్వాళే మీ అబ్బాయిని వెంటబెట్టుకుని బొంబాయి వెళతాను. అక్కడ ప్రసిద్ధి కెక్కిన బారిష్టరు శ్రీధరపంతులు మా మేనమామే. బావగార్నీ, ఆ మాధవరావునూ శిక్షపడకుండా వదిలించుకువచ్చే బాధ్యత నాది. మనోరమకుమాత్రం, యీ సంగతు లేవీ తెలియ నివ్వకండి," అని ధైర్యం చెప్పి, సాయంత్రం రైలులో, భర్త వినాయకరావును వెంటబెట్టుకుని బొంబాయి వెళ్ళింది.

రాకరాక వచ్చిన తన మేనకోడల్నీ, ఆమె భర్తనూ చూసి బారిష్టరు శ్రీధర పంతులు చాలా సంతోషించాడు. ఆమె చెప్పిన సంగతంతా విని, "ఉఫ్, యిదెంత పని! రేపీపాటికి ఆ యిద్దర్నీ బెయిల్‌మీద బయటికి రప్పిస్తాను. కేసు సంగ తంటావ్? మనం వకాల్తా తీసుకున్న కే సేదీ మన పక్షం కాకుండాపోయింది లేదు,'' అనేశాడు.

కాని, మర్నాడు కోర్టుకు వెళ్ళి కేసు వివరాలు చూడగానే, శ్రీధరపంతులు గతుక్కుమన్నాడు. దొంగచెక్కుతో బ్యాంకును మోసం చేశారన్నదానికి అవసరం అయిన సాక్ష్యాధారాలన్నీ పోలీసుల దగ్గిర వున్నవి. రెండు రోజుల తరవాత మేజిస్ట్రేటు ఇద్దరు ముగ్గురు బ్యాంకు ఉద్యోగుల్నీ, మాధవరావుకు చెక్కు యిచ్చిన వాణ్ణీ విచారించి, కేసును సెషన్సుకోర్టుకు పంపాడు. ఆ కారణంగా శ్రీధర పంతులు బెయిల్‌మీద సదాశివరావునూ, మాధవరావునూ విడిపించాలని చేసిన ప్రయత్నం ఫలించలేదు.

సెషన్సుకోర్టులో కేసు విచారణకు వచ్చేలోపల శ్రీధరపంతులు సాక్షులనూ, జ్యూరర్లనూ మంచి చేసుకుని, తడపవలసినచోట చేతులు తడిపి, ముఖస్తుతితో కొందరికి మైకం తెప్పించి, విచారణరోజున పరస్పరవిరుద్ధమైన సాక్ష్యాలూ, వాఙ్మూలాలు యిప్పించి జడ్జి కేసు కొట్టేసేలా చేయగలిగాడు. కాని, నిర్దోషులని తీర్పు రాగానే, అంతవరకూ మామూలుగా వున్న మాధవరావు ఒక్కసారిగా కళ్ళనీళ్లు పెట్టుకుని, చేతులెత్తి జడ్జికీ, జ్యూరర్లకూ నమస్కరిస్తూ, తను చెక్కును ఫోర్జరీ చేసినమాట యదార్ధమనీ, సదాశివరావుకు ఆ సంగతి ఏమీ తెలియదనీ, అతడు ఆ చెక్కు మామూలుదే అనుకుని బ్యాంకులో మార్చి, తనకు డబ్బు తెచ్చి యిచ్చాడనీ - చెప్పేశాడు.

మాధవరావు యిలా చెప్పేసరికి జ్యూరీలు తమ అభిప్రాయం మార్చుకుని, అతడు దోషి అన్న నిర్ణయానికి వచ్చారు. జడ్జీ మాధవరావుకు పన్నెండు నెలల కఠినశిక్ష విధించి, సదాశివరావును నిర్దోషి అని విడుదలచేశాడు.

* * * *

రామచంద్రపంత్ మరణం - ఆ తరవాత ఆరునెలలైనా గడవకుండా మాధవరావు ఫోర్జరీనేరం చేసి జైలుకు పోవటంతో, గంగా, పార్వతులు రాధాబాయి గృహానికి వచ్చేశారు. సదాశివరావే, మనిషిని పంపి వారిద్దరినీ ఇంటికి పిలిపించాడు. పార్వతిని చూసి సంతోషించకపోయినా, రాధాబాయి తన మనవళ్లు జగ్గూ, రాముడూ రావటంతో పరమానంద పడిపోయింది.

కొన్నాళ్ళపాటు గృహంలో ఏ కల్లోలం లేకుండానే గడిచిపోయింది. లక్ష్మి ప్రారంభించిన ధాన్యవ్యాపారం బాలకృష్ణా, వినాయకరావూ సమర్ధవంతంగా నడుపుతున్నారు. మంచి లాభాలు వస్తున్నై. సదాశివరావుకూడా వ్యాపారంలో తమ్ముడికి తోడుపడుతున్నాడు. ఎవరికీ ఎలాంటి ఆర్ధికచిక్కులూ లేవు.

గయ్యాళి గంగకు మాత్రం యీ ప్రశాంత గృహవాతావరణం నచ్చలేదు. లక్ష్మికి యింట్లో అందరూ చూపే గౌరవమర్యాదలు ఆమె హృదయాన్ని భగ్గుమనిపించినై. తన చెల్లెలు పార్వతిద్వారా వేరుపడటం బావుంటుందని సదాశివరావుకు చెప్పించింది.

"ఎందుకు వేరుపడాలి? ఒకవేళ వేరుపడినా మనకు వచ్చే ఆస్తిపాస్తు లేమున్నై. ఈ వ్యవసాయం, వ్యాపారం అంతా లక్ష్మిది; ఆమే ప్రారంభించింది. ఇప్పటికీ ఆమె చేతిమీదుగానే నడుస్తున్నై. వచ్చే లాభాలన్నీ ఆమెవీ, వినాయకుడివీ!" అని యీసడించేశాడు సదాశివరావు, భార్యను.

ఈ సంగతి చెల్లెలిద్వారా విని గంగ భగ్గుమన్నది. "లక్ష్మిని సర్వనాశనం చేయకపోతే, నేను బాలవిధవ గంగనేకాదు! రామచంద్రపంత్‌సహస్రబుధే జ్యేష్ఠ పుత్రికనేకాదు," అని ఆమె మనసులో ప్రతిజ్ఞ చేసుకున్నది.

మర్నాటి ఉదయానికల్లా గంగ తనప్రతిజ్ఞ నెరవేర్చుకునేందుకు చేయవలసిన నీచకార్య మేదో చేసేసింది. సదాశివరావు పుత్రులు- జగన్నాథుడూ, రాముడూ అన్నం తింటూనే కళ్ళు తేలవేసి, మాటా మంతీ లేకుండా పడిపోయారు. ఇది చూసి, ఇంట్లో అందరూ గాభరాపడిపోయారు. రాధాబాయి శోకించసాగింది. బాలకృష్ణ గ్రామంలోకి పరిగెత్తి, సంగతి చెప్పి, వైద్యుణ్ణి పిలుచుకొచ్చాడు. వైద్యుడు ఏదో మందు నీళ్ళల్లో కలిపి పిల్లలిద్దరి గొంతుల్లోనూ పోయించాడు. పావుగంట తర వాత యిద్దరూ స్పృహకు వచ్చి వాంతి చేసుకున్నారు. అన్నంమెతుకులతోపాటు, కుంకుడుగింజంతటి నల్లని పదార్థంకూడా బయటపడింది. వైద్యుడు ఆ పదార్థాన్ని పరీక్షించి, కళ్ళెర్రచేసి, "ఇది నల్లమందు! ఎవరో పిల్లలకు అన్నంలో దీన్ని కలిపిపెట్టారు. ఎవరు వాళ్ళు?" అని ప్రశ్నించాడు.

ఈ ప్రశ్న వింటూనే అందరూ నిశ్చేష్టులయారు ఎవరినోటా మాట పెగల లేదు. కొంచెం ఎడంగా నుంచుని యిదంతా గమనిస్తున్న గంగ పెదాలపై చిరు నవ్వు కదుల్లాడింది. ఆమె పైటచెంగును విసురుగా తిప్పుతూ, ముందుకువచ్చి, "ఇంతకుముందు పిల్లలకు అన్నం పెట్టింది లక్ష్మి," అంటూ అరిచి, ''అవునా?'' అంటూ లక్ష్మికేసి చూసింది.

"అవును; జగ్గుకూ, రాముడికీ నా చేతులతోనే స్వయంగా వడ్డించాను," అన్నది లక్ష్మి. ఆమె ముఖం వెలవెలపోయింది.

మరదలు అలా అనగానే, సదాశివరావు కోపంతో వణికిపోయాడు. అతడి ముఖం కందగడ్డలా అయింది. అతడు కీచుగొంతుతో, ''నా భార్యా, వదినెగారూ లక్ష్మికి అపకారం చేసివుండవచ్చు! కాని నేనూ, నా బిడ్డలూ ఆమెకు ఎలాంటి అపకారం చెయ్యలేదే? ఆమె యింత ఘోరం ఎందుకు చేసినట్టు?' అన్నాడు.

బావ మాటలు లక్ష్మి హృదయాన్ని శూలాల్లా తాకినై. ఆమె కన్నీళ్ళు పెట్టు కుని లేచి తన గదిలోకి వెళ్ళిపోయింది. "అంతా దొంగఏడుపు. అదృష్ట ముండి బిడ్డ లిద్దరూ బతికి బయటపడ్డారు," అంటూ గంగ కేకలు పెట్టింది.

రెండు మూడు రోజుల తర్వాత సదాశివరావు, భార్యా వదినె గార్ల ప్రోద్బ లంతో, వేర్లు పడేందుకు సిద్ధమయాడు. కుటుంబం రెండుగా చీలిపోవటం, లక్ష్మి కేమాత్రం యిష్టంలేదు. అత్తగారూ, భర్తా తను నేరస్తురాలు కాదని నమ్మినా,



ఊళ్ళో కొందరు గంగ ఆడిన అబద్ధాలు నమ్మారు. ఈ పరిస్థితుల్లో తను నిర్దోషురాలని రుజువయ్యే వరకూ, తను పుట్టినింట వుండటమే మేలని లక్ష్మి నిర్ణయించుకున్నది. తన కారణంగా అన్నదమ్ములు ఎందుకు వేరుపడాలి?

లక్ష్మి తన నిశ్చయాన్ని అత్తకూ, భర్తకూ చెప్పి ప్రయాణమయింది. రాధాబాయి కోడల్ని వెళ్ళ వద్దని కళ్ళనీళ్ళు పెట్టుకుని బతిమాలింది. కాని, ఆమె,

"అత్తయ్యా! ప్రస్తుతానికి నన్ను పుట్టింటికి వెళ్ళనివ్వండి. సత్యాన్ని ఎవరూ దాచలేరు. బావగారు ఏనాటికైనా వాస్తవం ఏమిటో తెలుసుకుతీరుతారు. ఆ విధంగా నా నిర్దోషిత్వం రుజువైననాడు, నేను తిరిగి యిక్కడికి వస్తాను,'' అన్నది. వినాయకరావు భార్యమాటలు బలపరిచాడు. లక్ష్మి పుట్టింటికి బయలుదేరింది, ఎవరు ఎంతగా వారించినా వినక. బాలకృష్ణుడుకూడా ఆమె వెంట ప్రమాణమయ్యాడు.

ఒక సంవత్సరం గడించింది. ఈ మధ్యకాలంలో వినాయకరావు భార్యను చూసేందుకు రెండుమూడుసార్లు మామగారింటికి వెళ్ళివచ్చాడు. ఇప్పుడు ఇంట్లో పెత్తనమంతా గంగది. ఆమె రాధాబాయిమీదకూడా అప్పుడప్పుడూ అధికారం చలాయించచూస్తున్నది. సదాశివరావు వ్యాపారవిషయాల్లో లోగడంత శ్రద్ధ చూపించటం లేదు. వినాయకరావుకు వదినె పార్వతి ప్రవర్తనా, ఆమె అక్క గంగ నిరంకుశ ధోరణీ సహించటం దుర్భరం అయిపోతున్నది. ఈ స్థితిలో అతడు ఇంట్లో ఎవరికీ చెప్పకుండా ఎటో వెళ్ళిపోయాడు. రాధాబాయి కొడు కేమయాడో అని భయాందోళనలు పడసాగింది.

హఠాత్తుగా ఒకనాటి ఉదయం వినాయకరావు, మాధవరావును వెంటబెట్టుకుని ఇంటికి తిరిగివచ్చాడు. సంవత్సరం శిక్ష పూర్తికాగానే మాధవరావు జైలునుంచి విడుదల అయ్యాడు. అతడు గ్రామంలోనే వున్న భార్యను చూసేందుకు ముందుగా వెళ్ళకుండా సదాశివరావు ఇంటికి వచ్చి, అతడితో, "బావా! వినాయకరావు చెప్పగా మీ గృహపరిస్థితు లన్నీ తెలుసుకున్నాను. మా అక్క గంగసంగతి నీకు తెలియ దేమో! ఆవిడకు నల్లమందు అలవాటున్నది. జగన్నాధుడికీ, రాముడికీ ఆ రాక్షసే మందు పెట్టిందని నా నిశ్చితాభిప్రాయం. రహస్యంగా గంగ వుండే గదిలో, ఆమె పెట్టే బెడా వెతికి చూడు, నల్లమందు దొరుకుతుంది," అని చెప్పాడు.

ఆ సమయంలో గంగా, పార్వతు లిద్దరూ ఏటికి నీళ్ళ కెళ్ళారు. సదాశివరావు బావమరిది చెప్పినదానికి తలాడించి, గంగ నివశించే గదిలోకి వెళ్ళి, నాలుగైదు నిమిషాల తర్వాత చేతిలో ఒక చిన్న డబ్బీ పట్టుకుని. మాధవరావూ, వినాయకుడూ వున్న చోటుకు వచ్చాడు. అతడి ముఖం వెలవెల పోతున్నది. కాళ్ళూ చేతులూ వణుకుతున్నవి. మాధవదావు డబ్బీ మూత తీసి చూసి, మాట్లాడకుండా దాన్ని వినాయకరావు చేతి కిచ్చాడు.

"వినాయకా! నేను గంగమాటలు నమ్మి నిష్కారణంగా లక్ష్మిని నిందలపాలు చేశాను. ఇప్పుడే బయలుదేరిపోయి లక్ష్మిని పుట్టినింటినుంచి తీసుకువద్దాం," అన్నాడు ఎంతో విచారం కనబరుస్తూ, సదాశివరావు.




శిణాలకింద గంగగదిలో నల్లమందుడబ్బా దొరికినసంగతి, ఆమెకు నల్లమందు తినే అలవాటున్న విషయం గ్రామమంతా తెలిసిపోయింది. అప్పట్లో, పిల్లలకు మందుపెట్టింది లక్ష్మి అని నమ్మినవాళ్ళుకూడా యిప్పుడు గంగను దుమ్మెత్తిపోయసాగారు. భర్తద్వారా సంగతి సందర్భాలు తెలుసుకున్న పార్వతి, అక్కను నానా తిట్లూ తిట్టి, శాపనార్థాల్లోకి దిగింది. "లక్ష్మి! నా తోడుకోడలు, దేవతలాంటి మనిషి; నే నెంత అన్యాయంగా మాట్లాడాను! పదండి యిప్పుడే పోయి లక్ష్మి పక్కదికి తీసుకువద్దాం," అంటూ పార్వతి భర్తను వత్తిడిచేయసాగింది. ఇక రాధాబాయి ఆనందానికి అవధులులేవు. పోతే, ఒక్క గంగమాత్రం తనగదిలో చేరి, శోకాలు పెడుతూ, "ఎవరో నామీద నేరం వేసేందుకు, నా పెట్టెలో నల్లమందుడబ్బా పెట్టారు. వితంతువును, నేను నల్లమందు తింటానా? రామచంద్రపంత్ సహస్రబుద్ధే జ్యేష్ఠ పుత్రిక మత్తుపదార్థాల జోలికి పోతుందా?" అంటూ చెల్లెల్నీ, బావమరిదినీ, తమ్ముణ్ణీ — అందర్నీ కలిపి నానా దుర్భాషలూ ఆడసాగింది.

తిరిగి ఇంతకాలానికి ఎన్నో అవాంతరాలూ, కష్టాలూ, కడగండ్లూ గడిచి, మాధవరావూ, మనోరమా సుఖంగా కల్సుకున్నారు. సంవత్సరం కఠినకారాగారశిక్ష అనుభవించటంద్వారా, తన నేరాలూ, పాపాలూ — అన్నీ క్షాళనం ఐపోయిన వన్నాడు, మాధవరావు. మనోరమ భర్త కౌగిలిలో ఆనందాశ్రువులు రాల్చింది.

ఒక్క గంగనుమాత్రం ఇంట్లో విడిచి, తతిమ్మా అందరూ లక్ష్మిని తీసుకు వచ్చేందుకు ఆమెగ్రామం వెళ్ళారు. జరిగినదంతా విని లక్ష్మి పొందిన సంతోషానందాలు వర్ణనాతీతం. ఇక ఆమెతండ్రి నానాదేశముఖ్ మాట చెప్పనే అవసరం లేదు. ఆయన బంధువులందరికీ విందుభోజనాలు పెట్టటమేకాక. గ్రామస్తులందరికీ ఒకనాడు సంతర్పణచేసి, బ్రాహ్మణులకు సువర్ణ, గోదానాలుకూడా చేశాడు.

దేశముఖ్ ఇంట నాలుగైదురోజులు అందరికీ హాయిగా కాలం జరిగిపోయింది. మర్నాడు లక్ష్మిని వెంటబెట్టుకుని అందరూ తిరుగుప్రయాణం అయ్యే సమయంలో రాధాబాయి ఇంటినౌకరు రొప్పుతూ రోజుతూ నానాదేశముఖ్ ఇంటి కొచ్చాడు, అతడు మోసుకువచ్చింది భయంకరమైన వర్తమానం.

గంగ స్వహస్తాలతో, సదాశివరావూ, అతడి తమ్ముడు వినాయకరావూ వ్యాపారార్థం నిల్వచేసిన ధాన్యపుకొట్లకు నిప్పు పెట్టింది. ఆ పిశాచి వికటాట్టహాసం చేస్తూ, రాత్రివేళ కాగడాతో కొట్లకు నిప్పంటించటం పక్కఇంటి యశోదాబాయి చూసి, ఇరుగుపొరుగును కేకలువేసి పిల్చుకొచ్చింది. వాళ్ళు ధాన్యం అంతగా నష్టం కాకుండానే మంటలు ఆర్పగలిగారు. కాని, వాళ్ళను చూసి భయపడి గదిలో చేరి గడి బిగించుకున్న గంగ, కాలిన పైకప్పు కూలటంతో అందులో చిక్కి నిలువునా కాలిపోయింది. ఆమె శరీరం గుర్తుపట్టటానికి లేనంతగా నల్లగా కాలి మసిబొగ్గులా అయింది. గంగ ఘోరమరణవార్త విని కళ్ళనీళ్ళు పెట్టింది లక్ష్మి, మనోరమలు మాత్రమే. తతిమ్మావాళ్ళంతా ఒక రాక్షసి మరణించిందన్నంతగా సంతోషించారు.

ఆ సాయంత్రానికల్లా అందరూ గ్రామం చేరారు. మంటలవల్ల ధాన్యానికి జరిగిన నష్టం బహుస్వల్పం. పాతకొట్లూ, ఇంట్లో కొంతభాగం మాత్రం బాగా దెబ్బతిన్నవి. మాధవరావు సలహామీద మొత్తం పాతలోగిలి పడకొట్టించి, కొత్తగా అన్ని సౌకర్యాలతో ఆధునికంగా వుండే గృహం కట్టించటానికి సదాశివరావూ, వినాయకరావూ పూనుకున్నారు. ఈ పనిలో వాళ్ళకు కుడిభుజం బాలకృష్ణ.

లక్ష్మి, మనోరమల ప్రోద్బలంమీద మాధవరావు స్వగ్రామంలో, తన దుర్వ్యసనాలవల్ల పోయిందిపోగా, మిగిలిన కొద్దిఆస్తిపాస్తుల్నీ అమ్మి, బావమరిది గ్రామానికి తిరిగివచ్చి, అతడి సలహా, సహాయాలతో మళ్ళీ కంట్రాక్టుపనులు ప్రారంభించాడు.

పార్వతి తన తోడికోడలు లక్ష్మిని సోదరికన్న ఎక్కువగా ప్రేమించసాగింది. అత్త రాధాబాయికీ, ఆమెకూ తరచుగా చిన్నచిన్న కలహాలు వస్తూనేవుంటవి. కాని యివి పూర్వకాలపులాటివికావు; ఒకతరహా ప్రేమకలహాలు. విచిత్ర




మేమంటే; యీ కలహసమయాల్లో లక్ష్మి పార్వతిపక్షం వహిస్తుంది. కోడళ్ళిద్దరూ యింటిపనులు చేస్తూండగా రాధాబాయి చూస్తూ వూరుకోలేదు; తనూ ఏదో చేయబోతుంది. చిన్నమెత్తుపని చేయనీకుండా అత్తగార్ని కూర్చోబెట్టి సుఖపెట్టాలనేది పార్వతి పట్టుదల.

ఒకప్పుడు సిరిసంపదలతో తులతూగిన రాధాబాయి గృహం, మధ్యకాలంలో దరిద్రానికి ఆటపట్టు అయి, చివరకు లక్ష్మి పట్టుదలా, ఓర్పూ, ప్రజ్ఞల కారణంగా తిరిగి సిరిసంపదలలో ఓలలాడసాగింది. వృద్ధురాలైన రాధాబాయి కిప్పుడు మనవళ్ళిద్దర్నీ ఆడించి ఆనందించటం తప్ప మ రేపనీ లేదు.

———




మాలతి పుట్టింటికి వచ్చి పదిరోజులైనా కాకుండానే, వనమాలి ఆమె కోసం రావడం అందరికీ బాగానే వుంది కాని, వచ్చినవాడు నాలుగురోజులన్నా ఉండకముందే భార్యను తీసుకువెళ్తా ననడం ఎవరికీ నచ్చలేదు. మాలతి తల్లి మీనాక్షి, కూతుర్ని చాటుకు పిలిచి "అంత మాత్రం నచ్చచెప్పలేవూ మీ ఆయనకి? వచ్చేనెల్లో పండగ వస్తూండె, తొలిపండక్కు ఎట్లాగూ మీ ఇద్దరూ వచ్చి భోంచేసి బట్టలు కట్టుకుని వెళ్ళాలాయె; ఇంతలో వెళ్ళడం, రావడం దేనికీ? పండక్కు మీ అన్నయ్య వెళ్ళి ఆయన్ని పిలుచుకువస్తే, పండగయ్యాక యిద్దరూ వెళ్దురుగాని," అన్నది.

మాలతి 'సరే' నంది, కాని వనమాలి ఒప్పుకోలేదు–"నాకక్కడ తోచడంలేదంటే నమ్మవేం? నీ కిక్కడ బాగానే తోస్తూంది లాగుంది; అందుకే వుంటా, నంటున్నావు." అని నిష్ఠూరమాడాడు. మాలతి నిస్సహాయంగా భర్త వెంట బయలుదేరింది.

మాలతితండ్రి రాజారావు సంతోషించినా, మీనాక్షికిమాత్రం ఒళ్ళు మండిపోయింది, కూతురి అసమర్థతకు.

మాలతికి పెళ్లయి ఆరునెలలయింది. వనమాలితోడి సంసారం ఆమెకు చాలా హాయిగానే వున్నా, ఒక్కొక్కసారి తీగ మీద నడక నేర్చుకునే సర్కసు పిల్లలాగ ఫీలయ్యేది. తండ్రి చెప్పించిన చదువుతో, నూరిపోసిన లోకరీతులతో, జీవిత సత్యాలతో మాలతి ఇరవై ఏళ్లకే కన్యాసహజమైన హృదయలాలిత్యాన్ని కోల్పోయి, మనోదార్ఢ్యాన్ని పెంచుకుంది. ఆమె ఆలోచనలూ, ఆ వయసూ అందరి ఆడపిల్లల వూహల్లాగా ఆకాశంలో తేలిపోయేవి కావు. పాతిపెట్టిన స్థంభాల్లాగా నిజమైనవిగా, నిలిచేవిగా వుండేవి. వనమాలి సంగతి వేరు. ఆడవాళ్లు అనే ఆ అపురూపమైన భావసౌకుమార్యం అతనికి జన్మతో వచ్చిన సంపద. పిల్లగాలికైనా కదిలిపోయే చిగురుటాకుల్లాంటి దతని మనసు. అతనికి గుర్తు నిలవకముందే తండ్రి గతించడం, తల్లికి ఏకైకపుత్రుడు కావడం, రెండు తరాలకు సరిపడా ఆస్తి వుండడం అతన్ని రాటుతేలకుండా చేశాయి. పెళ్ళి చూపులకు వెళ్ళిన వనమాలి కోమలవల్లిక లాంటి మాలతిని చూసి ముగ్ధుడయ్యాడు.

నవ్వీ నవ్వని ఆమె పెదవులు వికసితా వికసితమైన గులాబిని గుర్తు తెస్తే సారళ్యం పొందాడు. బి. యస్సి. పరీక్ష అయిన వారానికే పెళ్ళయింది మాలతికి. వెంటనే అత్తవారింటికి వెళ్ళింది. వేసవికాలం, మల్లెపూలలో ముంచి తేవనేత్తాడు భార్యను వనమాలి. అతడు ప్రొద్దునా సాయింత్రం తోటపని స్వయంగా చూసుకునేవాడు. మాలతి కాస్త క్రొత్త తీరాక ఒకరోజు భర్త తోటలో వుండగా వెళ్లింది. వనమాలి సంబరంగా ఒక సంపెంగపువ్వు కోసి భార్య కిచ్చాడు. క్రమంగా ప్రతిరోజూ భర్తకు తోటపనిలో సాయం చెయ్యడం అలవాటయ్యింది మాలతికి.

ఓ రోజు గాలిపాటుకు మాలతి చీరచెంగు గులాబిముల్లుకు తగులుకున్నది. ఎవరో లాగినట్లు కాగా 'అబ్బా 'అన్నది. వనమాలి మురిపెంగా ఆమె కొంగు విడిపిస్తూ, భార్యను నిలువెల్లా పరికిస్తూ ! "మాలతీ, సుగాత్రీ," అన్నాడు తన్మయంగా. ప్రొద్దున, సాయంత్రం స్వయంగా పూలు కోసి భార్య కిచ్చేవాడు. "మాలతీ ! ఏడు వారాల సొమ్ములు యివ్వలేను కాని, ఏడు వారాల పువ్వు లివ్వగలను నీకు," అనేవాడు, తన తోటలోని రకరకాల పూలను గర్వంగా చూస్తూ. శుక్లపక్షాన ఒకనాటి సంధ్యవేళ వనమాలి తోటలోని అన్ని రకాల పూలు కోసి, భార్య కిచ్చి, 'మాల కట్టిపెట్టుకో' మన్నాడు. మాలతి పూలు కడుతుంటే కన్నార్పకుండా చూస్తూ, "పూలు కట్టడం యింకోరకంగా రాదా నీకు? రోజూ ఇల్లాగే కడతావేం?"

మాలతి తెల్లబోయింది."మీరు మరీనూ, పూలు యింకెట్లా కడతారండీ ?"

వనమాలి దిగ్గున లేచి వెళ్ళి, అల్మారాలోంచి ఒక పుస్తకం తీసుకొచ్చాడు. కాసేపు వెదికి ఓ పేజీ తీశాడు. అట్టమీద పేరు చూసింది మాలతి. విశ్వనాథవారి ఏకవీర. ఏకవీర రెండుదారాలతో బిగించినదట పూలన్నీ. ఒక దారం లాగితే మాల పెద్దదై అన్నిపూలూ కనపడతాయట. రెండోదారం లాగితే మాల

కుదించుకుని చిన్నపూలన్నీ పెద్దపూల చాటున దాక్కుంటాయట! కనిపించని పూల వాసనకు ఆశ్చర్యం కలగదూ?

మాలతి నవ్వి "ఇదంతా నిజమంటారా-కవిచమత్కృతి గాని! ఏమో! యిటు వంటి పూమాల నే నెరుగను. నా దగ్గర వున్న చేతిసంచులు మాత్రం యిట్లాగే ఒక దారానికి తెరుచుకుని, ఇంకో దారానికి మూసుకుంటాయి," అన్నది.

ఓ సాయంత్రం వనమాలి మొల్లపూలు కోసుకొచ్చి భార్య కిచ్చాడు. మాలతి మాల కడుతూ "ఇది తెలుగుపువ్వు కాదు, మద్రాసుపువ్వు," అంది మాలతి.

వనమాలి ఒళ్ళు మండి. "ఔను, మొల్ల రామాయణం అరవంలో వ్రాసింది!" అన్నాడు. అతని కోపానికి నవ్వు వచ్చింది మాలతికి. "ఔను మాలతీ! మొల్లపూలే కుందపుష్పాలు. కుందమాల నాటకం చదివావా నువ్వు? తెలిగ్గా బిడ్డను ఎత్తుకుంటే రోజూ ఒక కుందమాలను కానుకిస్తానని గంగానదికి మ్రొక్కుకుందట నెలలు నిండినసీత. వాల్మీకి, ఆశ్రమంలోని స్త్రీలకు, స్నానాలవేళ పురుషుల కళ్ల బడకుండా వరమిచ్చాడట. ఒకరోజు రాముడు ఆ దారిన వస్తుంటే స్నానం చేస్తున్న సీత భర్తను చూసిందట. ముఖం కడుక్కుని మంచినీళ్ళు త్రాగుదామని రాముడు గంగనీళ్ళు దోసిలి పట్టాడట. గంగాతరంగాలు కుందమాలను రాముని దోసిటిలోకి చేర్చాయట. ఆయనకు సీత తనూస్పర్శ గుర్తుకు వచ్చి ఒళ్ళు ఝల్లుమందట. కుందమాలను ఆశ్చర్యంగా చూస్తూ, యిట్లా పూలు కట్టడం నా సీతకు తప్ప ఎవరికీ రాదే? యి దెట్లా వచ్చిందిక్కడకు?' అనుకున్నాడట. భార్యను తల్చుకుని వాపోయాడట. అంతటి దీర్ఘ వియోగంలో కూడ భర్తకు తనమీద అనురాగం అంతరించలేదని తెలుసుకున్న సీత సంతోషాన్ని వూహించుకో!" అన్నాడు వనమాలి.

మాలతి భర్తవంక చూస్తూ అన్నది. "అన్నిటికన్నా విచిత్రం — మీ రింతటి సాహిత్యాభిలాషులూ, సౌందర్యారాధకులూ కావడం, నేను ఫిజిక్సులో డిగ్రీ తీసుకోవడం!" అన్నది.

"ఔను, నీకున్న కంఠమాధుర్యానికి మీ నాన్నగారు నీకు సంగీతం చెప్పించి వుంటే, లోకానికి సేవ చేసి వుండేవారు! ఐనా ఫిజిక్సయితే నేం, కెమిస్ట్రీ అయితే నేం, ప్రకృతి సౌందర్యంలో ఆసక్తి కలిగి వుండడానికి ఏమిఅడ్డు? ఆ మధ్య సి. వి. రామన్, గులాబిపూల రంగుల గురించి ఒక పెద్ద వ్యాసం వ్రాశారు! అందాన్ని చూడగలగాలే కాని అన్ని పూలూ అందమైనవే! ఎంకి గరికపూలు మాల కట్టేదట!" అన్నాడు వనమాలి.

పువ్వు తావిలాగ కలసిపోయిన కొడుకు కోడళ్ళను చూసి మురిసిపోయింది వనమాలి తల్లి.

సుఖం, ధనంకన్నా చంచలమైనది. రెండేళ్లు తిరక్కుండానే మాలతి నుదుటి బొట్టు చెరిగిపోయింది. స్నేహితుడు పెళ్ళికోసం ప్రయాణమైన వనమాలి పెళ్ళిల్లు చేరకుండానే రైలు ప్రమాదంలో మరణించాడు. "మామిడిచెట్టు — మాధవీలత" చందమైంది మాలతి బ్రతుకు. వనమాలి తల్లి, మీనాక్షిలో "కొడుకు పోయినా కోడలు నాకు బరువుకాదు. కాని ఒకరి




కెదురుగా ఒకరం కూర్చుని ఏడవడం కన్నా చేసేది ఏముంది? తీసుకువెళ్ళండి. మళ్ళీ చదివిస్తారో, మళ్ళీ పెళ్ళి చేస్తారో మీయిష్టం! ఎక్కడైనా అది సుఖంగా వుంటే చాలు,'' అన్నది.

మాలతి పుట్టింటికి వచ్చి ఆరునెలలైనా దుఃఖంనుంచి తేరుకోలేదు. మాలతి అన్న ప్రకాశానికి చెల్లెలి దుఃఖం భరించ రానిదిగా తయారైంది. ఏకైక పుత్రిక వైధవ్యం అసహానమయిపోయింది మీనాక్షికి. ఎన్నడూ భర్తమాటకు బదులాడని మనిషి చీటికి మాటికి భర్తమీద విసుక్కుని కోపం చల్లార్చుకోడం మొదలుపెట్టింది. రాత్రిళ్ళు రెండు గంటలదాకా చదివే కూతుర్ని, అందుకుప్రోత్సహించే భర్తనూ చూచి "ఆడపిల్లలు ఆడుతూ పాడుతూ చదివితే చాలదుటండీ? క్లాసు రాకపోతే కొంప అంటుకునే దేముంది?'' అనేది.

రాజారావు "ఎట్లాగూ చదువుతున్నది కనుక ఆ డిగ్రీకాస్తా గట్టిగానేవుండడం మంచిది. ఏరోజు ఎట్లా వస్తుందో ఎవరికితెలుసు? మాఅక్కనుచూడు. మీచెల్లెల్నిచూడు. మన పిల్లకటువంటి కష్టాలు రాకూడదు,'' అనేవాడు. రాజారావు అక్క బాలవితంతువు; జీవితమంతా రాజారావు పెద్దన్న యింట్లో వంట చేస్తూనే గడిపింది. మీనాక్షి మరిది త్రాగివచ్చి భార్యను కొడుతుంటే, ఆ యిల్లాలు పడలేక పిల్లలతోసహా వెళ్ళి పుట్టింట్లో స్థిరపడిపోయింది. "చిన్నప్పటి నుంచీ మీ మనసులో, మాటలో మీ అక్కగతి మెదలి మెదలి నా బిడ్డకు అదేగతి పట్టింది. అంతా మీ నోటిచలవే!'' అని పోట్లాడేది మీనాక్షి భర్తతో. రాజారావు కూతుర్ని జీవించడానికి తయారు

చెయ్యకుండా, జీవితాన్ని ఎదుర్కో కానికి తయారు చేశాడు. చివరకు పూర్తిగా ఓడిపొయ్యాడు. పదేళ్ళు తండ్రి యిచ్చిన శిక్షణ అంతా రెండేళ్ళ భర్త సాహచర్యభాగ్యాన, నామరూపాలు లేకుండా పోయింది. ఆడపిల్లలకోసం డబ్బేకాదు, బుద్ధి ఖర్చుపెట్టడం కూడ దండగే! కూతుర్ని యం. యస్సి. చదవ మంటే, చదవనని భీష్మించుకు కూర్చుంది. తండ్రి నయానా, భయానా చెప్పినా వినలేదు. రాజారావు కళ్ళనీళ్ళు తిరగ్గా భార్యతో "చచ్చిన పాముని మీనా! ఎందు కింకా నన్ను కొడతావు?" అన్నాడు.

మాలతిఅన్న ప్రకాశం, చెల్లెల్ని బుజ్జగించగా, బుజ్జగించగా ఒకనాడు, "అన్నయ్యా! మనింటిప్రక్క ఖాళీస్థలానికి కాస్త చుట్టూ ముళ్ళతీగ వేసేయిద్దామా? నాకు మల్లెతోట వేసుకోవాలనుంది," అన్నది. ప్రకాశం ఆశ్చర్యంగా హాయిగా యం. యస్సి. చదవకండా మల్లెతోట ఏమిటమ్మా?" అన్నాడు.

మాలతి కళ్ళనీళ్ళు ఆపుకుంటూ "అన్నయ్యా! నన్ను నాన్న, వారికి కాళ్ళు కడిగి కన్యాదానం చేశారు! యింకేమి హక్కుంది మీకు నామీద? యం. యస్సి. చదివితే పుట్టింటికి విశ్వాస పాత్రురాల నవుతాను. మల్లెతోటపెంచితే నాభర్తకి 'లాయల్టీ' చూపినదాన్నవు తాను," అంది. ప్రకాశం తనచెల్లెలు యింత గాఢంగా భర్తను ప్రేమించినదని వూహించలేదు. ఎట్లయినా ఆమె మనసు కాస్త బాగుండడమే కావలసినదని మల్లె తోట వెయ్యడానికి ఏర్పాట్లు చేశాడు. చెల్లెల్ని వెంటపెట్టుకుని నర్సరీలన్నీ తిరిగి, రకరకాల మల్లెలు, జాజులు, పారిజాతాలు తీసుకువచ్చి నాటించాడుతోటలో. రోజూ రెండుపూటలా తోటపని స్వయంగా చూడ్డంతో మాలతికి ఆకలై మామూలుగా భోంచెయ్యడం మొదలుపెట్టింది. మీనాక్షి కిదే పదివే లనిపించింది. ఆరునెల లయ్యే ప్పటికి ఒక బొడ్డుమల్లెఅంటు మొగ్గ తొడిగింది. మాలతికి పట్టరాని సంతోషం కలిగింది. మొగ్గ పెద్దదవుతుంటే రోజుకు పదిసార్లయినా వెళ్ళిచూసేది, తనగదిలోకి వెళ్ళి వనమాలి ఫోటోముందు నిలబడి, "యింకా వారంరోజు లాగు, ఇంకా నాలుగురోజు లాగు, ఇంకొక్క రోజాగు, నా మొదటి మల్లెను నీకు చూపిస్తా, నీకిస్తా,"నన్నది వేరేధ్యాస లేకుండా. అస్త మానం తోటచుట్టూ తిరిగే కూతుర్ని చూచి "రెండేళ్ళ కాపరానికి ఒకనలుసైనా కలిగి వుంటే, యింతపిచ్చన బడేదికాదు," అను కునేది మీనాక్షి కళ్ళు తుడుచుకుంటూ.

ఒకసారి ప్రకాశం ఏదో పనిమీద ఢిల్లీ వెళ్ళివస్తూ ఒక మల్లెఅంటు తెచ్చిచ్చాడు చెల్లెలికి. దాని ఆకులు క్రోటన్ ఆకుల్లాగా సైనపచ్చగా అడుగున ఎర్రగా వున్నాయి. పేరు 'నక్షత్రమల్లె' అని చెప్పాడు. తొట్టిలో నాటింది మాలతి. వారం రోజు లకే ఆకులన్నీ రాలిపోవడం, క్రొత్తచిగురు రాకపోవడం చూచి బెంగపడింది మాలతి. ప్రకాశం ఎగ్రికల్చరల్ కాలేజిలోని పేథాల జిస్టుకు చూపించాడు మల్లెమొక్కను. ఆయన పరీక్ష చేసి "దీనికి జబ్బేమీలేదు. మీరు తొట్టిలో పోసినమట్టి దానికి సరిప డదులా గుంది. యీ జాతిమల్లెకు ఏరకం మట్టి కావాలో హార్టికల్చరిస్టు నడగండి,

చెప్తారు,'' అన్నాడు. ఆ సాయంత్రం హార్టికల్చరు ప్రొఫెసరు డాక్టర్ మురారిని యింటికి తీసుకువచ్చి చూపించాడు, ఆ తోట చూసి ఆయన ''కమర్షియల్ పెంప కమా?'' అనడిగాడు. ప్రకాశం ఒంటరిగా మురారికి చెల్లెలి దీనగాథ వినిపించాడు.

మురారి శ్రద్ధ వలన నక్షత్రమల్లె చిగురు లేసింది. మాలతి సంతోషంగా ''మాస్టారూ, మీ మేలు మర్చిపోలేను,'' అంది. మురారి ఆశ్చర్యంగా ''ఏమిటమ్మా అంత సీరియస్‌గా తీసుకుంటావు. పోనీ ఆ అంటు చచ్చిపోయిందే అనుకో! దానికి బెంగపడ్డం దేనికి?'' అన్నాడు.

''అట్లా అనకండి మాస్టారూ! నేను బ్రతికుండగా ఈ తోటలో ఒక్క మల్లెమొక్క గూడ చావగూడదు,'' అంది మాలతి.

ఆ యింటి స్నేహితు డయ్యాడు మురారి. తరచు వచ్చి తోట చూసివెళ్లే వాడు. మాలతికి మల్లె అంటు త్రొక్కడం, గ్రాఫ్టు (grafting) చెయ్యడం నేర్పాడు. నక్షత్రమల్లె పూసింది. కాని రోజు నాలుగు పూలకంటే ఎక్కువ పూసేది కాదు. మురారి ఆలోచించి సమృద్ధిగా పూసే తీగమల్లెను, నక్షత్రమల్లెను కలిపి గ్రాఫ్టు చేశాడు. క్రొత్త అంటు పూతకు వచ్చి, ఆకు కనపడకుండా పూలు పూసింది. మాలతి పొంగిపోయింది. ''దీనికి ఏం పేరు పెడదాం మాస్టారూ?'' అనడిగింది.

మురారి 'అడుగు మల్లె'' అన్నాడు.

మాలతికా పేరునచ్చలేదు. ''అదేం పేరు'' అన్నది.

''ఔనమ్మా! అడుగుకు మించి ఎదగకుండా పూలుపూసేమల్లెమరి'' అన్నాడు. ఒకనాడు మురారి రెండు మల్లెజాతులను క్రాస్ చెయ్యడం చూసిన మాలతి అతడు వెళ్ళిం తర్వాత మరి రెండు జాతులు తను క్రాస్ చేసి, మర్నాడు మురారి రాగానే ఆ సంగతి చెప్పింది. మురారి నవ్వి, ''నువ్వు చేసింది దండగ పని!'' అన్నాడు.

''అదేమిటి మాస్టారూ?'' అంది మాలతి.

''ఔను మాలతీ! మల్లెల్లో నాలుగయిదు రకాల్లో తప్ప గింజ పట్టదు. గింజపట్టని జాతుల్ని నువ్వు క్రాస్‌జేసి ఏమి లాభం? నువ్వు గ్రాఫ్టు చెయ్యడం బాగా నేర్చుకో'' అన్నాడు. మాలతి కష్టపడి చేసిన ప్రయోగాల్లో ఒక్కటిమాత్రం ఫలించింది. జాజిపువ్వు, మొల్లపువ్వు కలిపి చేసిన చెట్టు బ్రతికి మొగ్గ తొడిగింది. జాజి కన్నా చిన్నపువ్వు, మొల్లకన్నా పెద్ద పువ్వు. రెండు పరిమళాలు జోడించుకుని పువ్వు పూసింది. ఆ అంటుకు మాలతి ''వనప్రియ'' అని పేరు పెట్టింది. మురారి కళ్ళు చెమ్మగిల్లాయి. ''యింత గాఢమైన అనురాగాన్ని పొందగల్గిన నీ భర్త ఎంత అదృష్టవంతుడో, అంతటి అనురాగాన్ని అనుభవించలేకపోయినందుకు అంతటి దురదృష్టవంతుడు?'' అన్నాడు. మాలతి గాలి తాకిన లతలాగా కదిలిపోయింది. ''మాస్టారూ! ఒకనిజం చెప్తాను మీకు-కన్ఫెషన్ అనుకోండి. నా భర్త నన్ను ప్రేమించారు; ఆరాధించారు. ఆయన వున్నపుడు నేను చూపింది కేవలం కృతజ్ఞత. పెళ్ళయినపుడు నా మనసు రాయి కన్నా భిన్నమైనది కాదు. లోకంలో దాంపత్యమే నిజం. అందులో స్నేహ సౌహార్దాలు సహజం. కాని ప్రేమ చాల అరుదైన దనుకున్నాను. ఒక్కో సారి

ఆయన నాకోసం పడే ఆరాటం, నాకు అర్థం లేనిదిగా, విసుగ్గా అనిపించేది. కాని ఆయన కళ్ళలోని ఆరాధన, వేడుకలు చూస్తే కలతా, జాలీ పొంగివచ్చేవి నాకు. నా కిష్టంలేని ఎన్నో పనులు నోరు మూసుకుని చేసేదాన్ని ఆయన సంతృప్తికోసం! ఆయన నిద్ర బోయేటప్పుడు నామీద నాకు అసహ్యం కలిగేది-'ఎందు కింత బానిసగా తయారవుతున్నా నని!' మళ్ళీ తెల్లవారి లేస్తే వారి కళ్ళు నన్నూ, నా మనసునూ జయించేవి. క్రమంగా వారి సాహచర్యంలో నా హృదయం కరిగిపోయింది. నాకు ప్రేమించడం అంటే ఏమిటో తెలిసివచ్చింది. ప్రేమ పొందడం కన్నా ప్రేమించడం ఎంత బాగుంటుందో తెలిసింది. సరిగ్గా ఆ తరుణంలోనే వారు నాకు లేకుండా పోయారు. కరిగిన నా హృదయం మళ్ళీ ఘనీభవించలేదు. బ్రతికుండగా ప్రేమించలేకపోవడం నా దురదృష్టమో, వారి దురదృష్టమో నాకు తెలియదు పాపపరిహారంగా నా శేషజీవితాన్ని వారి స్మృతితోనే నింపుకోవాలనుకున్నాను'' అన్నది ఏడుస్తూ. పాతికేళ్ళన్నా నిండని మాలతి వైధవ్య దుఃఖం మురారి మనసును కలచివేసింది.

ఒకనాడు మురారివచ్చి అరగంటైనా, మాలతి గదిలోంచి బైటకు రాలేదు. ప్రకాశం చెల్లెల్ని పలుసార్లు పిలిచాడు. ఆమె రాలేదు. ఆశ్చర్యంగా మురారిని వెంటపెట్టుకుని ''రండి చూద్దాం. ఏం తపస్సు చేస్తోందో,'' అని వెళ్ళి చెల్లెలి గది తలుపులు దబదబా బాదాడు. కాసేపటికి మాలతి తలుపు తీసింది. ప్రకాశం, మురారి, మ్రాన్పడిపోయారు. మాలతి మాట్లాడకుండా గదిలోకి వెళ్ళిపోయింది. సరిగంచు పట్టుచీర కట్టుకుంది. జడలో మల్లెపూలు పెట్టుకుంది. నుదుట బొట్టు పెట్టుకుంది. ప్రకాశం నెమ్మదిగా తలుపులు చేరవేసి వెళ్ళిపోయాడు. మురారి మళ్ళీ నాలుగో రోజు వచ్చాడు. మాలతితో, తోటలోకి వెళ్లాడు. కాని ఆమెతో సహజంగా మాట్లాడలేకపోయాడు. మాలతి నవ్వుతూ ''మాస్టారూ! ఏమి టాలోచిస్తున్నారు? మొన్నటి నావేషం గురించా?'' అంది.

మురారి వింతగా చూచాడామె వంక. బదులు చెప్పలేదు. ''మాస్టారూ! ఆరోజు మావారి పుట్టినరోజు. వారి కిష్టమైనట్లు అలంకరించుకుని, వారి ఫోటోకు ఒకమల్లెదండ వెయ్యాడంకన్నా నేను వారి కేమివ్వగలను చెప్పండి? ఆరోజు కట్టుకున్న నెమలికరంగు చీరంటే వారికి యిష్టం. అది కట్టుకున్నరోజు 'మాలతీ, మయూరీ' అని పిలిచేవారు ముద్దుగా. వారి పుట్టినరోజున ఏడుస్తూ ఎట్లా కూర్చోను? ఎప్పుడైనా నాకళ్ళ నీళ్ళు తిరిగితే వారికి బోలెడంత కోపం వచ్చేది, చిరాకు పడిపోయేవారు! నిజం, ఆరోజంతా నేను ఏడవలేదు. నవ్వుతూ వారి ఫోటోముందు కూర్చుండిపోయాను'' అన్నది మాలతి.

మాలతికి మురారి దగ్గర గతించిపోయిన అనుభవాలు బిగ్గరగా గుర్తుకు తెచ్చుకోవడం అలవాటయింది. ''అస్తమానం నన్ను పిలుస్తుండేవాడు మాస్టారూ! ఒకసారి 'ఎందుకండీ అట్లా విసుగులేకుండా ఎప్పుడూ పిలుస్తూనే వుంటా రని' విసుక్కున్నాను. దానికి 'ఏం పిలిస్తే? నాకు నువ్వంటే యిష్టం, నీ పేరంటే యిష్టం!




నా మీద దయదలచి మీ అమ్మా నాన్నా నీకు చాలమంది తెలుగువాళ్ల లాగ ధనలక్ష్మి, గజలక్ష్మి, వెంకటలక్ష్మి అని పేరు పెట్టలేదు. నీ పేరు ఎంత బాగుంది? కాళిదాసుక్కూడ యిష్టం మాలతీ పుష్పాలంటే! ఆయన నాయికలు లోధ్రపుష్పాల పుప్పొడిని చెక్కిళ్ళ కద్దుకునేవారట. కదంబపుష్పాలు, మాలతి మొగ్గలు తల్లో ధరించేవారట. కర్ణాభరణాలుగా ధరించిన శిరీషపుష్పాల కేసరాలు ఆ ముద్దరాళ్ల చెక్కిళ్ళను తాకుతుండేవట. చేత్తో తామర పువ్వు పుచ్చుకుని ఒయ్యారంగా నడిచేవారట. మాలతీ! ఋతుసంహారం చదివావా నువ్వు? ఎన్నిరకాల చెట్లు-ఎన్ని పుష్పాలు-ఎన్ని పరిమళాలు? మన దేశంలోని ప్రకృతిసౌందర్యాన్నంతా దోచుకుని కావ్యాలు వ్రాశాడాయన,' అన్నారు.

వారికి ఊళ్ళు తిరగడం అంటే సరదా! ఎన్ని ఊళ్ళు తిరిగామో లెక్ఖలేదు. చూసిన ఒక్కొక్క వూళ్ళోనూ గుర్తుకు ఒక చీరో, గాజులో, ఆఖరికి చెప్పులైనా కొనేవారు నాకు. ఓనాడు తొమ్మిది గజాల పూనాచీర కచ్చపోసి కట్టుకోమన్నారు. కట్టుకుని వస్తే, రాళ్లకమ్మలు తీసి ముత్యాలకమ్మలు పెట్టుకోమన్నారు. ఇంకో రోజు అడ్డచారల ఢాకా చీర బెంగాలీ కట్టు కట్టమన్నారు. కాళ్లకు పారాణి పెట్టుకుని క్రొత్తచీర కట్టుకున్నాను-మురిపెంగా చూస్తూ, బల్లమీదున్న తాళాలగుత్తి తీసి నా చెంగుకు ముడివేశారు. ఇంకోరోజు తిరువనంతపురంలో కొన్న సరిగంచు పంచె వల్లెవాటు వేసుకున్నాను. జడ విప్పి జారుముడి వేసుకో అన్నారు. నా తల్లోకి

పూలు వారే కోసిచ్చేవారు మాస్టారూ! ఒకరోజు గులాబులు, ఇంకోరోజు సంపెంగలు, ఇంకోరోజు మొగలిరేకులు, మరునాడు పొగడపూలు, సాయంత్రాలు మాత్రం మల్లెలూ, జాజులే యిచ్చేవారు. ఒకరోజు సాయంత్రం జుట్టు దువ్వి క్రొత్త రకంగా ముడి వేసుకుని ఒక ప్రక్కగా కటక్ ఫిలిగ్రీ పని చేసిన వెండి తామర పువ్వు గుచ్చుకుని తోటలోకి వెళ్ళాను. వారు నన్ను చూచి వెండి పువ్వు తీసేసి అక్కడ ఒకేఒక పెద్ద మల్లెపువ్వు పెట్టారు. నేను చిన్నపుచ్చుకున్నానేమో నని నా కళ్ళల్లోకి చూస్తూ, 'మగువ తల్లోని మల్లె పువ్వును శిఖరాగ్రాన చంద్రోదయంతో పోలుస్తా డొక కవి' అన్నారు. వారికి రసగుల్లా అంటే మహా ఇష్టం మాస్టారూ! అందుకని తరచు చేస్తుండేదాన్ని. ఒకరోజు నేను వంటింట్లో వుండగా వచ్చా రాయన. విరిగిన పాలు మూట కడుతుండగా చూశారు. 'అదేమిటి, పాలు అన్నీ విరిగి పోయాయా' అనడిగారు. 'విరగలేదు, నేనే విరిచాను. పాలు విరగ్గొట్టకుండా రసగుల్లా లెట్లా వస్తయి?' అన్నాను. ఆయన బాధగా 'అమృతంలాంటి పాలు విరగ్గొట్టి చేస్తారా రసగుల్లాలు? అవెంత రుచిగా వున్నా సరే, యివి నేను తినను' అన్నారు. చూడండి మాస్టారూ! మా యింట్లో వాళ్ళకూ్కడా చెప్పని సంగతులన్నీ మీకు చెప్తున్నా. నేను వెకిలి దాన్ననీ, సిగ్గులేనిదాన్ననీ అనుకోరు గదా?" అనడిగింది మాలతి.

కాస్త ఆశ్చర్యంగా "సరేగాని మాలతీ! నాతోమాత్రం ఎందుకు చెప్పాలనిపించింది నీకు?" అన్నాడు, మురారి.

నవ్వుతూ, "నేను నిజం చెప్తే మీ రేమీ అనుకోరుగదా! యీకబుర్లే మా అమ్మకు చెప్పాననుకోండి-మాఅమ్మ సంతోషించదు, ఏడుస్తుంది. ఆ సరదాలు యీరోజు లేకుండా పోయినవన్న విచారమే ఆమె అనుభవించగలదు; గాని, ఆరోజుల్లోని అందాన్ని, ఆనందాన్ని గుర్తించి సంతోషించలేదు. మీరు నాకు పరాయివారు కనుక యీ విషయాల్లో మీకు విషాదం తోచ దనుకున్నాను,," అన్నది, దిగులు ముఖం పెట్టి మాలతి.

"మీరు పరాయివారు" అని ముఖం యెదట చెప్పగలిగిన ఆమె మనశ్శుద్ధికి మురారి సంతోషించాడు. భర్తతో గడిపిన అనుభవాలు యితరులతో చెప్పుకుంటే ఆమెకు అవే అనుభవించిన ట్లుందేమోనని భావించాడు.

మురారి సలహాలతో అభివృద్ధి చెందిన మల్లెతోట ఊరంతా ప్రసిద్ధమయి పోయింది. పూర్వం మురారికి ఫల జాతుల్లోనే తప్ప పూలమొక్కల్లో అట్టే ఆసక్తి లేదు. మాలతికోసం పడిన శ్రమలో అతడు మల్లెజాతిగురించి చాలా చదివాడు; చాలా ప్రయోగాలు చేశాడు; చాలా నేర్చుకున్నాడు. ఒకనాడు అర్ధరాత్రి ఆకస్మికంగా ఒక ఆలోచన వచ్చిందతనికి. ఆ తర్వాత ఆరునెలలు కష్టపడి "మల్లెలు-జాజులు" అని ఒకపుస్తకం వ్రాశాడు. అచ్చయింది. తొలిపలుకులో "ఆ పుస్తకం వ్రాయాలన్న ఉత్సాహం, మాలతి ప్రోత్సాహంవల్ల కలిగిన"దని వ్రాశాడు. అది మొదలైంది చెడ్డరోజులకు. యూని వర్సిటిలో విద్యార్థులు, తోటి అధ్యాపకులు, క్రమంగా ఊళ్ళోవాళ్ళు గుస



గుసలు, వ్యంగ్యోక్తులు, నవ్వుకోడాలు మొదలుపెట్టారు. ''విరజాజుల అందం వితంతు సహవాసంలో తెలిసిందట పాపం!'' అన్నారంతా. మురారి భార్య నానా ఏడ్పూ ఏడ్చి 'మీ రింక వాళ్ళింటికెళ్ళి ఆ పిల్లను చూస్తే నేను నూతిలో దూకుతాను,' అన్నది. వారం తిరక్కుండా ప్రకాశం మురారిదగ్గరికెళ్ళి ''ఇంతపెద్దవారు మీరు. మీకు లోకరీతులు నేను చెప్పవలసినవాణ్ణి కాదు. నా చెల్లెలిబ్రతుకు ఎంతటి దీనమైందో మీకు తెలుసు. దాన్నిట్లా నలుగురిలో నవ్వులపాలుచెయ్యడం భావ్యమా? పెద్దవారు మీరు, మీ కూతురికి వుండదగ్గ వయస్సు దానికి! మీ కీ చాపల్యమెలా కలిగింది?'' అన్నాడు.

ప్రకాశాన్ని చూస్తే అసహ్యమేసింది. ''ప్రకాశం! నాలుగు రోజులక్రిందట నా భార్య నాతో యీ విషయమై పోట్లాడింది. ఆట్టే చదువుకోనిది ఆడది అని సరిపెట్టుకున్నాను. నువ్విలా మాట్లాడ్డం వింతగావుంది నాకు. మాలతి నా జీవితంలోకి రాకపోతే నాకు మల్లెలఅందం, జాజుల పరిమళం నిజంగానే తెలిసేవికావు. ఆమాట వ్రాయడం ఆమెకు నా కృతజ్ఞత చెప్పుకోవడంగా భావించాను. నిజంగా నాలో చాపల్యమే వుంటే, అట్లా వ్రాయగలిగే సాహసం నా కుండేదికాదు. భయపడకు, మీ యింటి ఛాయలకు రానులే యింక,'' అన్నాడు మురారి.

పదిరోజులుగా మురారి రాకపోడంతో

మాలతికి తోచలేదు. క్రొత్తగాచేసిన గ్రాఫ్టు మురారికి చూపించాలనుకుంది. విరజాజిక ఏదో పురుగుపట్టి ప్రతిమొగ్గా వంక తిరిగి పోతున్నది. బెంగపడ్డది మాలతి. అన్న దగ్గరకు వెళ్ళి "మాస్టారొచ్చి చాలరోజు లయిం దన్నయ్యా, వెళ్ళి పిల్చుకు వస్తావూ ?" అంది.

చిరాకుతో "మాలతీ బుద్ధి వుందా నీకు? మాస్టారు రాకపోతే మల్లెతోట వుండదా? వుండకపోతే నాశనం గానీయి ! ఊరువా రంతా నవ్వుతున్నారు అయన్నీ. మనల్ని చూసి. ఆయనతో నువ్వు అంత చనువుగా ఎందు కుండాల్సివచ్చింది ? మాస్టారింక మనింటికి రారు. రాకూడదని ఆయన భార్య ఆంక్ష పెట్టిందట. నేనుకూడా చెప్పాను - యిహ మనింటికి రావద్దని," అన్నాడు ప్రకాశం.

ప్రకాశానికి అనుకోకుండా ఒక రోజు చూచిన మాలతి తిలక-పుష్పధారణ గుర్తుకు వచ్చింది. చెల్లెలు మళ్లీ సుమంగళి అయితే సంతోషించగల ప్రకాశం, ఆ ప్రేరణ మురారి స్నేహంవల్ల కలిగిందేమో నని చిరాకుపడ్డాడు. మబ్బులేని పిడుగుకు తట్టుకోలేకపోయింది మాలతి. గదిలోకి వెళ్ళి తలుపు మూసుకుంది. భర్త ఫోటో ముందు కూర్చుని ఏడ్చింది. "చూడు వనా! నువ్వు లేని అలుసు చూసుకుని మసిపూస్తున్నది నాకు లోకం! మల్లెపువ్వులో మధువే కాని విష ముంటుందా వనా? నే నేం చెయ్యను? నువ్వు నాకు దక్కలేదు. నీ స్మృతిగా నిలుపుకున్న మల్లెతోటకూడ నాకు దక్కదా? రోజూ నిన్నలంకరించే యీ మల్లెల పరిమళంలో మార్పు తోచిందా ప్రభూ! నే నేం చెయ్యాలి చెప్పు?" అని ఏడుస్తూ సొమ్మసిలిపోయింది.

మరునాడు తెల్లవారి కాఫీకి రాలేదు మాలతి. మీనాక్షి కూతురిగదిలోకి వెళ్ళి కెవ్వున కేకవేసింది. రాజారావు, ప్రకాశం పరిగెత్తారు మాలతి గదిలోకి. మీనాక్షి మాలతిమీద పడి ఏడుస్తోంది. మాలతి మంచం ప్రక్కనే టీపాయ్‌మీద ఉత్తరం కనపడింది. ప్రకాశం చేతులు వణుకుతుంటే విప్పి. చదివాడు.

'అన్నా!

చెయ్యకూడని తప్పు చేశావు. నన్నే అను మానించావు. యింకేమి చేసినా నిన్ను క్షమించగలిగేదాన్ని!

మల్లెతోట, మీ బావకు ప్రతిరూపం నాకు! అది కళలు తరిగి నశించి నేను బ్రతికుండి చూడలేను. నేను పోతే మీరంతా ఏడుస్తారు. మల్లెతోట పోతే నేను ఏడుస్తాను. నాకు స్వార్థం హెచ్చు.

మనం మనుష్యులం బ్రతికున్నవాళ్ళను సంతోష పెట్టడానికి సాధారణంగా కష్టపడం. పోయినవాళ్ళ ఆత్మశాంతికోసం ఏమైనా చేస్తాం. నేను పోతున్నాను కదా! నా ప్రియసోదరుడివిగా నా కోరిక తీరుస్తావా? మల్లెతోట నాశనం కాకుండా మాస్టారికి అప్పగించు-మాస్టారు మనింటికి




రావడానికి అడ్డు తీరిందిగా! అమ్మను, నాన్నను ఓదార్చు.

నీ
సోదరి, మాలతి'

ప్రకాశం పిచ్చివాడే అయ్యాడు. నెల్లాళ్ళ తర్వాత ప్రకాశం మురారికి జాబు వ్రాశాడు. మల్లెతోటను అతని "ఎక్స్‌పరిమెంటల్ గార్డెన్"గా చేసుకోమని ప్రతిమాలుతూ వ్రాశాడు. మాలతి ఆఖరి జాబుకూడ జతపరిచి పంపాడు. స్వయంగా వెళ్ళి మురారిని చూడ్డానికి ముఖం చెల్లలేదతనికి. ప్రకాశం వుత్తరాన్ని వెనక్కి త్రిప్పి జవాబు వ్రాసి పంపాడు మురారి.

'ప్రకాశం,

మా అమ్మా, నాన్నా పోయి చాల ఏళ్ళయింది. తద్దినాలు పెట్టడంలో నాకు నమ్మకంలేదు, పెట్టే అలవాటు లేదు.

నీ
మురారి'

మాలతి సంవత్సరీకం వచ్చేటప్పటికి మల్లెతోట సగానికి పైగా ఎండిపోయింది.

———




"అబ్బే! జ్వరం లేదు, ఏంలేదు. ముందు నువ్వు కూర్చో:" శంకరం కుర్చీలో కూర్చోబోయాడు.

"అక్కడకాదు; ఇలా వచ్చి కూర్చోవోయ్! ఫర్వాలేదు. ఇలారా!" అంటూ చెయ్యి పట్టుకుని చనువుగా తనపక్కన మంచంమీద కూర్చోబెట్టుకున్నాడు.

బాలకృష్ణ ఆదరం చూస్తే శంకరం మనస్సు పులకరించింది. ఎందుకో సమస్తం పోగొట్టుకున్న దీనుడిలా కన్పించాడు బాలకృష్ణ. గదంతా చూశాడు శంకరం; అదీ అలాగే వుంది. ఎక్కడిబట్ట లక్కడే! ఎక్కడిపుస్తకా లక్కడే;

"సూరిబా బేడీ?"

"నీ కిప్పుడు బాగావుందా శంకరం?" శంకరం మాటలకి జవాబు చెప్పకుండా అడిగాడు బాలకృష్ణ.

"బాగానే వుందండీ! చాలాబాగా వుంది కాఫీ దగ్గిర్నుంచి అన్నీ అక్కడే. నాకు వేరేగది ఇచ్చారు. టేబుల్‌లైటూ, ఫేనూ - చదువుకోటానికి చాలా సౌకర్యంగా వుంది. ఇప్పుడు వారాలు మానేశాను. బట్టలుకూడా కుట్టించారు. నేను చదువుకోవాలేగానీ ఎన్నేళ్ళయినా చదువుకోమన్నారు- ఇంట్లో అందరూ చాలా మంచివాళ్ళు:" పొంగిపొర్లుతోన్న కృతజ్ఞతతో ప్రవాహంలా ఆపకుండా గడగడా చెప్పేశాడు - శంకరానికో అనుమానం వచ్చింది. -"నే నిప్పుడు వెంకట్రామయ్యగా రింట్లో వుంటున్నాను. మీకు తెలుసాండీ?"

బాలకృష్ణ తల వూపాడు-"తెలుసు. నువ్వు కాలేజీకి వస్తున్నావో లేదో తర్వాత వాకబు చేశాను. అంతా తెలిసింది. మళ్ళా నీ మొహం చూడటానికి సిగ్గుపడి... నిజంగా నీకు చాలా అన్యాయం చేశానోయ్!" బాలకృష్ణ కంఠం బొంగురుగా అయింది.

శంకరం కంగారుపడ్డాడు - "అబ్బే! అదేం లేదండీ! నే నలా ఎప్పుడూ అనుకోలేదు. వెంకట్రామయ్యగారిమీద



అభిమానంకొద్దీ అదంతా చెప్పానే కానీ మీ గురించి చెడ్డగా నే నెప్పుడూ అనుకో లేదండీ!"

"గుడ్డివాడిలాగా నిన్ను తెలుసుకో లేకపోయాను శంకరం! ఎందుకో అప్పు డలా పిచ్చెక్కినట్టు—నిన్ను వెళ్ళ గొట్టాను. తర్వాతెంత సిగ్గుపడి పోయానో నీకు తెలీదు— నువ్వు రాసిన పుత్తరం... రోజు కోసారైనా తల్చు కుంటూ...నన్ను క్షమించు శంకరం!" శంకరం చెయ్యి గట్టిగా పట్టుకున్నాడు బాలకృష్ణ. వెచ్చటి కన్నీటిబొట్లు శంక రము చేతిమీద పడ్డాయి.

మొగవాళ్ళు ఏడవటం శంకరం ఎప్పుడూ చూడలేదు. బాలకృష్ణని చూస్తూ బిక్కమొహం వేశాడు. రెండు నిము షాలు ఇద్దరూ నిశ్శబ్దంగా కూర్చున్నారు. బాలకృష్ణ చెంపలమీదనుంచి బొటబొటా కన్నీళ్ళు జారి పడుతోనేవున్నాయి.

శంకరానికంతా అయోమయంగా — భయంగా వుంది. బాలకృష్ణ ఎందుకింత బాధ పడుతున్నాడు. కాసేపటికి బాల కృష్ణే తేరుకున్నాడు. గబగబా టవల్‌తో కళ్ళు ఒత్తుకొంటూ— "ఇట్సాల్ ఫర్ ది బెస్ట్! శంకరం! నిన్ను వెళ్ళిపొమ్మన టమే మంచిదైంది. నీకూ మంచి చోటు దొరికింది, నాకూ ... లోకజ్ఞానం తెలి సింది..." నిట్టూర్చాడు.

శంకరాని కేం అర్థంకాలేదు. బాల కృష్ణగారి కేదైనా ప్రమాదం జరిగిందా?

"సూరిబా బెక్కడి కెళ్ళాడండీ?"

"ఇంకెక్కడున్నాడు? రూమ్‌లోంచి

పొమ్మన్నాను. మొన్న తన గుడ్డలవీ తీసుకుపోయాడు.''

తెల్లబోతూ చూశాడు శంకరం.

"విమల ... నీకు తెలుసుకదూ ?" బాలకృష్ణ అడిగాడు శంకరం మొహం లోకి చూస్తూ.

"విమలా ?... అప్పుడు ఎలక్షన్స్ టైంలో మీకో వుత్తరం వచ్చిందీ..."

"ఆఁ...ఆఁ—ఆవిడే!"

"సూరిబాబూ మీరూ మాట్లాడు కొంటోంటే పేరు వినటమేగానీ... ఆవిణ్ణిగురించి నా కేం తెలీదండీ!''

''బి. యస్సీ. ఫైనల్లో వుంది. ఎప్పుడో ఓసారి చూ సే వుం టా వు. తెల్లగా, సన్నగా, చాలా అందంగా వుంటుంది. నేనూ తనూ లెటర్స్ రాసు కునేవాళ్ళం. ఆ వ్యవహారమంతా సూరి బాబుకి తెలుసు. మే మిద్దరం అప్పుడ ప్పుడూ విమలావా ళ్ళింటి కెళ్ళి కూర్చుని వచ్చేవాళ్ళంకూడాను."

విమల్ని ప్రాణాధికంగా ప్రేమించే బాలకృష్ణ 'వుత్తరాలు రాసుకునేవాళ్ళం' అంటూ ఏ కాలంలోనో జరిగినట్టు చెపు తోంటే శంకరానికి ఆతృతకల్గింది. బాలకృష్ణమాటలు వింటూ కూర్చున్నాడు.

"విమల పెళ్ళి వ్యావహారం ఏదో ప్రస్తావిస్తూ నా కో వుత్తరం రాసిందట. సూరిబాబు నా కివ్వలేదు. తనే చదివి చించేశాడు. వాడంత జెలసీ ఫీలౌతున్నా డని నా కేంతెలుసు ?

నేనా వుత్తరానికి జవా బివ్వకపోయే సరికి విమలకి చాలాకోపం వచ్చింది. పెళ్ళి అనేసరికి నేను ధైర్యం లేక జవాబు రాయలేదని వూహాగానలు చేసింది. పైగా ఈసూరిగాడేం చెప్పాడో తెలుసా వాళ్ళింటికెళ్ళి? — నేను రోజూ రూమ్‌లో తప్పతాగి తందనా లాడతానట — బజారు వాళ్ళందర్నీ తెచ్చి రూమ్‌లో పెడతానట— నా ఆరోగ్యం కూడా మంచిది కాదట — చాలా క్రూయల్ ఫెలో నట... ఒకటి కాదు... ఎన్ని వాగేడో... దొంగ రాస్కెల్! పాముకి పాలు పోసి పెంచిన ట్టయింది.

''అవన్నీ నమ్మేసి ఆవిడగారు కోపం పట్టలేక రెండుగజాల పొడుగు వుత్తరం రాసింది... ఇదిగో; నువ్వే చూడు —" బాలకృష్ణ ఆవేశంగా లేచి డెస్కులోంచి వుత్తరం తీసి శంకరంమీద పడేశాడు.

శంకరం ఆశ్చర్యంగా వుత్తరం చూశాడు. ఇరవై పేజీలకు పైనే వుంది. చదవమనే యిచ్చాడు బాలకృష్ణ. చదవ టానికి మనస్కరించలేదు శంకరానికి.

"నీకు కొంచెం చురుకుదనం ఎక్కువ. కాలేజీలో అల్లరి చెయ్యటం తప్పితే — మ రే చెడ్డగుణమూ లేదనుకున్నాను. సూరిబాబు నీ స్నేహితుడైనా నా మేలు కోరే అంతా చెప్పాడు. అతనికి జన్మజన్మ లకీ ఋణపడివుంటాను. ఒక త్రాగుబో తునీ, జూదరినీ, వేశ్యాలోలుణ్ణీ నా పరిస రాలకుకూడా చేరనివ్వను. ఏ మగవాణ్ణి



నమ్మి ఏ ఆడది బాగుపడింది? నా హృదయములో నీకు చోటు యిచ్చి దాన్ని మలిన పర్చుకున్నాను. ఇవ్వాళ నీ రూపాన్ని బయటికి గెంటి నా హృదయాన్ని గాయ పర్చుకుంటున్నాను," అంటూ గతమంతా జ్ఞాపకం చేస్తూ నన్ను దెప్పుతూ తను ఏడుస్తూ, నన్ను ఏడిపించాలని ఇంత వుత్తరం రాసింది," అంటూ ఆవేశంగా వుత్తరంలో వాక్యా లెన్నో ఎత్తిచెప్పాడు బాలకృష్ణ. ఆ వుత్తరాన్ని బాలకృష్ణ ఎన్నిసార్లు చదివాడో శంకరం వూహకి అందలేదు.

బాలకృష్ణ కళ్ళల్లో ఎర్రటిజీరలు తేలాయి. మొహమంతా చెమటపట్టింది. బాలకృష్ణని చూస్తోంటే శంకరానికి పుట్టెడు జాలివేసింది. "మరి...మీ రేం చేశారు?''అన్నాడు గొంతు పెగుల్చుకుని.

"ఏం చేశానా? ఉత్తరం విప్పి నాలుగుపేజీలు చదివేసరికే నా తల తిరిగింది. ఎలాగో వూపిరి బిగపట్టుకుని అంతా చదివాను. ఆస లప్పుడు నే నెలా అయ్యానోకూడా జ్ఞాపకం రావటంలేదు.

"తలుపులు తోసుకుని లోపలికి వస్తూ సూరిబాబు కన్పించాడు. అంతే, దెయ్యంలా విరుచుకుపడ్డాను. చొక్కా పట్టుకుని ఛెళ్ళుఛెళ్ళుమంటూ చెంపలు వాయించాను — 'నేను తప్పతాగుతానా? బజారుముండల్ని మేపుతానా? చెప్ప వేంరా దొంగగాడిదా?' అంటూ చితక దన్నాను.

"విమల నా స్నేహం మానేస్తుందను కున్నాడుగానీ ఇదంతా నాకు తెలుస్తుం

దని ఎక్స్పెక్ట్ చెయ్యలేదు వాడు. నాన్చుతూ నాన్చుతూ కొంచెంకొంచెం చెప్పేశాడు - పరీక్షల రోజులుకదా - నేను పెళ్ళి ఆలోచనల్లో పడి వర్రీ అవు తానని నా కా వుత్తరం యివ్వలేదట.

"అసలు నా వుత్తరం నువ్వెందుకు చింపాలి?' అంటే — 'నీ మంచి కోసమే,' అన్నాడు. ఇంకేమనను? - అసహ్యం వేసింది. వెధవని తక్షణం పొమ్మన్నాను. అల్మైరాలోంచి గుడ్డ లవీ తీసి విసిరిపారేశాను. అన్నీ మూట కట్టుకుని ఏడుస్తూ పోయాడు. రెండు రోజులైంది. చూడు! వారంరోజుల్లో పరీక్షలు. ఈ గో లెలావచ్చిపడిందో! ఇంకేం చదువు? ఇంకేం పరీక్షలు?"

శంకరం మౌనంగా అంతా విన్నాడు.

బాలకృష్ణ మనస్సు తేలికపడేలా ఎంతోసేపు చెప్తోనే వున్నాడు.

"మరి మీరు విమలగారికి వుత్తరం రాయలేదా?'' అడిగాడు శంకరం.

బాలకృష్ణ ఎర్రగా చూస్తూ "ఎందుకూ?" అన్నాడు.

శంకరానికేం చెప్పాలో తోచలేదు— బాలకృష్ణకేమైనా సాయం చేయగలిగితే బావుండును! ఏం చెయ్యగలడు తను?

"విమలగారి యిల్లెక్కడ?" బాల కృష్ణ మొహంలోకి చూస్తూ అడిగాడు.

"ఎందుకూ?"

"ఏం లేదు...మీ గురించి నిజానిజా లేమిటో ఆవిడకు మాత్రం ఏం తెలుసు?"

"తెలుసుకోటానికేం ప్రయత్నిం చింది? ఒక వ్యక్తి నాగురించి చెడ్డగా చెప్తే ఆ వ్యక్తి నాకు నిజమైన స్నేహి తుడు కాడని ఎందుకు సందేహించలేక పోయింది? నన్నుగురించి సూరిబాబు చెడ్డగా చెప్తే నమ్మేసింది. మాటమాత్రం కూడా నన్ను అడక్కుండా యింత కఠి నంగా వుత్తరం రాసింది. ఇవ్వాళ మళ్ళా నువ్వెళ్ళి నాగురించి మంచిగా చెప్తే నమ్ముతుంది. క్షమించమంటూ మరో వుత్తరం రాస్తుంది. రేపు ఏ వెంక ట్రావో మళ్ళా చెడ్డగా చెప్తే...?

"వద్దు శంకరం! నన్ను నమ్మని మనిషితో నా కెలాంటి సంబంధమూ వద్దు. ఈ వుత్తరంతోనే ఆవిడకూ నాకూ స్నేహం పోయింది."

శంకరం కంగారూగా అన్నాడు — "అంత తొందరపడకండి బాలకృష్ణ గారూ! సూరిబాబు ఎంత నమ్మకంగా చెప్పాడో! నిజం తెలిస్తే ఆవి డెంత పశ్చాత్తాపపడుతుందో!"

"పశ్చాత్తాపాలతో సమస్యలు పరి ష్కారం కావు. ఈ వుత్తరం వచ్చే క్షణంవరకూ నాకు విమలంటే అంతు లేని యిష్టం - విమ లేదైనా ఆపదలో వుందని తెలిస్తే నా ప్రాణాలకు తెగించి రక్షించగలిగేవాణ్ణి. విమల లేకుండా నా భవిష్యత్తే లేదనుకున్నాను. మా నాన్న ఒప్పుకోకపోయినా విమల్ని పెళ్ళి చేసుకుతీరాలని నిశ్చయించు



కున్నాను. పతంజలి రూమ్‌లో ఏం జరిగిందో విమల చెప్తే నేను అక్షరాలా నమ్మాను. ఇవ్వాళ విమల నన్ను శంకిస్తుందా? నన్ను పిల్చి ముఖాముఖీ అడగలేకపోయిందా? ఇలాంటి వుత్తరం రాస్తే నేనెంత బాధపడతానో ఆలోచించిందా? నువ్వే చెప్పు శంకరం."

శంకరం బాలకృష్ణని తదేకంగా చూశాడు – "అవిడ తప్పే చేసిందనుకోండి. కనీసం తను తప్పు చేసినట్టయినా తెలియాలికదా?"

"తెలుస్తుంది. ఎప్పుడో ఎలాగో తెలుస్తుంది. ఆ నమ్మకం నా కుంది."

బాలకృష్ణ తర్కం శంకరానికి నచ్చలేదు. కానీ బాలకృష్ణ వేదనకి తనేం నిర్వచనం యివ్వగలడు?

"నిజం చెప్పండి. విమలతో సంబంధం లేదనుకుంటే మీ కేం బాధగా లేదా?"

బాలకృష్ణ కొంచెంసేపు మాట్లాడలేదు.

"లేదు శంకరం! నా మాట నమ్ము! విమల నన్ను సిన్సియర్‌గా ప్రేమించలేదని నిర్ధారణ చేసుకున్నతర్వాత నా కా బాధ కలగటం లేదు. జీవితానికి ఏది లేకపోయినా ఫర్వాలేదు గానీ – ప్రేమకీ విశ్వాసానికీ దూరంగా బ్రతకలేం."

ఇద్దరూ మౌనంగా కూర్చున్నారు కాస్సేపు. బాలకృష్ణ మొహం రామ రాను తేటపడింది – "నన్ను నమ్మినందుకు నిన్ను అన్యాయం చేశానోయ్ శంకరం! అందుకే నేను నమ్మినవాళ్ళు నన్ను మోసం చేశారు."

శంకరం మాట్లాడలేదు. బాలకృష్ణ ఎంత బాధపడితే అంత పవిత్రు డౌతాడు.

"ఈ ఒక్క సంఘటనతో ముగ్గురు వ్యక్తుల నిజస్వరూపాలు తెలుసుకున్నానోయ్! విమల నన్ను ప్రేమించలేదు. సూరిబాబు నా స్నేహితుడు కాడు. ఇక నువ్వు నిజంగా నా ఆప్తుడివి; నిజమైన స్నేహితుడివి!" బాలకృష్ణ చిరునవ్వు నవ్వుతూ శంకరం చెయ్యి నొక్కాడు.

శంకరం శరీరం పులకరించింది. అనురాగపూరితంగా బాలకృష్ణ మొహం లోకి చూశాడు.

"శంకరం! నీ కేం కావలసినా నన్నడుగు. ఎంతవరకూ చదువుకున్నా నేను డబ్బిస్తాను; అబద్ధంకాదు. ఈసారి నిన్ను మోసం చెయ్యను."

"అలాగే! అలాగేనండీ! అలాగే అడుగుతాను," అన్నాడు శంకరం సంతోషాతిరేకంతో.

బాలకృష్ణ లేచాడు – "కాస్సేపలా తిరిగివద్దాం పద. ఇప్పుడు నా మనస్సు చాలా హాయిగావుంది. నీతో మాట్లాడితే ఎంత తేలికపడిందో చూశావా? దేవుళ్ళా వచ్చావు;" గబగబా మొహం కడుక్కు వచ్చి బట్టలు వేసుకుని తలదువ్వుకున్నాడు.

గదికి తాళంపెట్టి ఇద్దరూ వీధిలో పడ్డారు.

"శంకరం! నువ్వేదైనా కొనుక్కోవోయ్!"

"కాసిన్ని మరమరాలు కొనండి." బాలకృష్ణ నవ్వాడు – పిడతకింద పప్పు రెండు పొట్లాలు కొనుక్కుని తింటూ నడిచారు.

"బట్ట లేమైనా కొనుక్కుంటావా?"

"అబ్బే! వద్దండీ! నిజంగా చాలా వున్నాయి."

"మరి...పోనీ కొత్తజోళ్ళు కొనుక్కోరాదూ?"

ఎందుకండీ! మొన్ననేగా మీరు కొన్నదీ? ఇంకా కాళ్ళకి పుళ్ళు పడుతోనేవున్నాయి.

"అలాక్కాదు. ఏదోఒకటి కొనుక్కో. అన్నట్టు నీకు వాచీ లేదుగా?"

తెల్లబోయాడు శంకరం – "ఇప్పుడంత డబ్బు..."

"మరోసారి ద్దాం, ప్రస్తుతానికి నీకేది నచ్చుతుందో చూసుకో!" అంటూ చెయ్యి పట్టుకుని లాగాడు బాలకృష్ణ.

"అదికాదు బాలకృష్ణగారూ! నామాట వినండి; మరోసారి... తీసుకుంటాను. ఇప్పుడు నాకు మంచి బుల్‌బుల్ కొని పెట్టండి."

సంబరంగా చూశాడు బాలకృష్ణ – "బుల్‌బుల్ కావాలా? మరి చెప్పవేం?" అంటూ మరోవేపు లాక్కుపోయాడు.

అన్నీ ఎంచి ఎంచి ఎక్కువ ఖరీదు పెట్టి బుల్‌బుల్ కొన్నాడు బాలకృష్ణ – సెలవుల్లో రూమ్ కొస్తూవుండు; వాయించడం నేర్పుతా," అన్నాడు.

"నాకు వచ్చండీ! మీ బుల్‌బుల్



మీదే నేర్చుకున్నా." అన్నాడు శంకరం నవ్వుతూ.

"అమ్మదొంగా! ఎప్పుడూ చెప్ప లేదేం?"

ఇద్దరూ మాట్లాడుకుంటూ నడిచారు.

బాలకృష్ణ శంకరం చెయ్యి వూపుతూ అన్నాడు — "నీకో చెల్లె లుందిటోయ్? నేను పెళ్ళి చేసుకుంటాను. నాకు చదువు రాదుగానీ, డబ్బుందిలే."

శంకరం నవ్వుతూ అన్నాడు.

"అయితే నన్నే చేసుకోండి."

బాలకృష్ణ పగలబడి నవ్వాడు. "ని న్నెందుకూ? తిండిదండగ. సరే! వెళ్ళు! చాలా పొద్దుపోయింది." అంటూ వీడ్కోలిచ్చాడు.

బుల్ బుల్ పట్టుకుని యింటికి వచ్చిన శంకరాన్ని చూస్తూ ఆశ్చర్య పడింది శ్యామల — "ఏం? ఇంత ఆలస్యం చేశారు? ఏమైందో నని కంగారుపడు తున్నా." అంది చిరుకోపంతో.

శంకరం నవ్వాడు — "బజారులో తప్పిపోకుండా వచ్చాలెండి," అన్నాడు.

స్నానం భోజనం అయ్యాక బుల్ బుల్ కొనిచ్చిన బాలకృష్ణ వుదంతం అంతా చెప్పాడు శ్యామలకి — "బాలకృష్ణ గార్ని ఎలా అర్థం చేసుకోవాలో నాకు తెలీలేదు." అన్నాడు చివర.

"ఎందుకు తెలీలేదు? అతను నిజంగా మనిషి. అణిగి పడివున్న అతని సంస్కారం యిప్పటికైనా బయట పడింది. బాలకృష్ణకి కొంచెం దుష్టత్వం వుందేమోగానీ నీచత్వం లేదు. తన

ఆత్మాభిమాన్ని గుర్తించుకున్నాడంటే బాలకృష్ణ బాగుపడ్డాడన్నమాటే," అంది శ్యామల బాలకృష్ణని అర్థం చేసుకొంటూ.

పరీక్ష లయ్యాయి.

చాలా బాగా రాశా ననుకున్నాడు శంకరం. ఆమాటే శ్యామలతో అన్నాడు.

శెలవుల్లోకూడా యింటికి వెళ్ళటం యిష్టంలేదు శంకరానికి. రెండురోజులు ఆలోచించి సరీ అన్నాడు – "మావూరు వెళ్తే బొత్తిగా తోచదండీ! మా అమ్మ లేదుకదా? అందుకని..."

"పోనీ మానెయ్యండి. వెళ్ళబుద్ధి కాకపోతే మరీ మంచిది. కథలపుస్తకాలవీ చదువుకుంటూ కూర్చోండి."

"ఊరికే కూర్చుంటేమాత్రం ఏం తోస్తుంది? పోనీ ఈ రెండునెలలూ చిన్న వుద్యోగం ఏదైనా దొరుకుతుందేమో! పిల్లలెవరైనా ట్యూషన్స్‌కి దొరుకుతారేమో చూస్తాను"

శ్యామల కాస్సేపు మౌనంగా ఉండి అంది – "మీ రేమీ అనుకోనంటే నే నో మాట చెప్తాను."

"నే నేం అనుకుంటాను? ఈమాటే నే నంటే మీ కెంతో కోపం వచ్చేది."

"ఇప్పుడు మీకూ వచ్చిందిగా?" నవ్వింది శ్యామల – "కోపం రాదన్నారుగా? అయితే వినండి. మీకోపని అప్పగిస్తాను. ఎలాగూ మీకు శెలవుల్లో కాలక్షేపం కావాలి. రేఖకీ కిశోర్‌కీ కాస్త చదువుచెప్పండి. స్కూలుకి పంపించటం తప్పితే వాళ్ళకేం ఒంటబడుతోందో తెలీదు. ట్యూషన్లు పెట్టించినా అవీ అలాగే వున్నాయి. చదువుకునేవాళ్ళకే శ్రద్ధ లేకపోతే టీచర్లేం చెయ్యగలరు చెప్పండి. పోనీ నేనే చెప్దామా అంటే నాకా ఓపికలేదు మరి. ఆ పాఠాలూ, లెక్కలూ చూస్తే నాకే నిద్దరొస్తుంది ముందు. అయినా వాళ్ళకసలు నాదగ్గిర భయంలేదండీ! ఓవేపు పాఠం చెప్తోంటే మరోవేపు బిస్కట్లో, బఠానీలో తింటూ కూర్చుంటారు. నా నోట్లోకూడా పడేస్తారు– అదీ వరస.

పాపం నాన్నగారు పైకి చెప్పరు గానీ మమ్మల్నందర్నీ పెద్ద పెద్ద చదువులు చదివించాలని ఎంతో ఆశ. నా చదువు యిలా అయింది. చూశారా? నాకేం బెంగలేదులెండి. పోనీ అన్నయ్యా అయినా నాన్నగారి ముచ్చట తీరుస్తాడేమో అంటే అదీ కన్పించటంలేదు. ఇప్పటికి బి. ఏ. రెండుసార్లు తప్పాడు. ఊళ్ళో వుంటే బాగా చదవటం లేదని మెడ్రాస్‌లో మా అత్తయ్యగారింట్లో పెట్టారు. ఈ సంవత్సరం మ రేం చేస్తాడో!" శ్యామల ఎంతో చనువుగా కుటుంబవిషయాలన్నీ చెప్తోంటే వింటూ కూర్చున్నాడు శంకరం.

"రేఖని మెడిసినూ–కిశోర్‌ని ఇంజినీరింగూ చదివించాలని నాన్నగారి కోరిక. ఏదో సామెతచెప్పినట్టు అన్నీ వున్నాయి;



పిల్లలకి శ్రద్ధేలేదు. కాయితాలు కొంటాం, కలాలు కొంటాం, మాష్టర్లని పెడతాం, ఇం కేం చెయ్యగలం చెప్పండి.

"రేఖావా ళ్ళింకా చిన్న పిల్లలండీ! అప్పుడే చదువుమీద శ్రద్ధేం వుంటుంది? ఇద్దరూ తెలివైనవాళ్ళే. పెద్దచదువులు చదవలేకపోరు. ఇవ్వాల్టినుంచీ నేను వాళ్ళవిషయం చూస్తాగా? మీ కెందుకు? మీ రేం దిగులు పడకండి; ఆ బాధ్యత నా మీద వదిలెయ్యండి. నాకూ సంతోషంగా గడుస్తుంది."

"వాళ్ళ పరీక్షలు నెల్లాళ్ళున్నా యను కుంటాను. ఈ ఏడాది ఫెయిలైనా, మళ్ళా స్కూలు తెరిచేసరికి బాగా వుండేలా..."

"అసలు వాళ్ళ స్టాండర్డ్ ఎలా వుందో చూడాలి ముందు.''

"నిజం చెప్పొద్దూ? మీరు మా యింటికి వచ్చాక రేఖావాళ్ళ భవిష్యత్తు గురించే ఆలోచిస్తోంది నా మనసు. మీ పరీక్షలు అయ్యేవరకూ ఈ మాట చెప్పటం నా కిష్టంలేదు. ఇక యిప్పు డంటారా? ఫర్వాలేదు; మీకూ కాలక్షేపం."

"మీ రేం దిగులు పడకండి; నేను చూస్తాను," అన్నాడుశంకరందృఢంగా.

భోజనా లయ్యాక పిల్ల లిద్దర్నీ తన గదిలోకి పిల్చాడు. ముగ్గురూ కాస్సేపు పుస్తకాల్లో బొమ్మలు చూసుకున్నారు.

మీ యిద్దరిలో ఎవరు బాగా చదవ గలరు?" ఉన్నట్టుండి అడిగాడుశంకరం.

"నేను చదువుతా నండీ!"

"ఛీ! వాడన్నీ తప్పులండీ! నేనే బాగా చదువుతాను."

"అలాకాదు. మీ రిలా దెబ్బలాడు కుంటే నా కేం తెలుస్తుంది? నేనో పుస్తకము యిస్తాను. ఇద్దరూ కొంచెం కొంచెం చదవండి. వింటాను," అంటూ శంకరం టేబుల్ మీద వున్న పత్రిక తీసి రేఖకి యిచ్చాడు.

రేఖ ఓ కాయితం తెరిచి చదవాలని ప్రయత్నించింది. చదవలేక — ఇ దేం పుస్తకం? మా మాష్టారు ఇది చెప్పారు ఏమిటి? నా పుస్తకం అయితే బాగా చదువుతాను."

"అయితే నీ పుస్తకం తెచ్చుకుంటావా? ఎంత బాగా చదువుతావో చూస్తాను."

రేఖ యింట్లోకి పరిగెత్తింది.

"కిశోర్! నువ్వుకూడా నీ పుస్తకాలు త్తెచ్చుకో. తొందరగా వచ్చెయ్! ఎవరు ఫస్టు వస్తారో చూస్తాగా?"

ఇద్దరూ పోటీలమీద పుస్తకాలు తెచ్చుకున్నారు. శంకరందగ్గిర కూర్చుని గడగడా చదవటం ప్రారంభించారు.

కాసేపు శంకరం వింటూ కూర్చున్నారు.

"అరె! ఇద్దరూ చాలాబాగా చదువుతున్నారే!" అంటూ సంభ్రమం వెలిబుచ్చాడు — "ఇన్నాళ్ళూ నాకు తెలీదు సుమా!" అన్నాడు విస్తుబోతూ.

ఆ సంతోషంతో పిల్లలు శంకరం లెక్కలు చెప్తే చేశారు. ప్రశ్నలు వేస్తే తప్పులో ఒప్పులో జవాబులు చెప్పారు— ఏం అడిగినా ఏడుపు మొహాలుమాత్రం పెట్టలేదు.

"ఈ పూటకి మానెయ్యండి. మీ పుస్తకాలన్నీ ఈ గదిలోనే పెట్టేసుకోండి. రోజూ మనం ముగ్గురం కలిసి చదువుకుందాం. మీ పాఠాలన్నీ ఎంతో బావున్నాయి నాకు," అన్నాడు శంకరం.

పిల్లలిద్దరూ వుత్సాహంగా పుస్తకాలు శంకరం పుస్తకాల మధ్య పెట్టుకున్నారు

తర్వాత అడిగింది శ్యామల— "ఎలా వున్నారు మీ శిష్యులు?"

"నన్ను హడలగొట్టేశారు మీరు. వాళ్ళ నెలా లొంగదీయాలా అని పథకాలు వేస్తున్నాను ...

"అంతా వుత్తదే? ఇద్దరూ చక్కగా చదువుతున్నారు. చెప్పినట్టు వింటున్నారు ఓగంట చూసి మరీ విసిగించకూడదని వదిలేశాను."

శ్యామల తెల్లబోయింది - "హాస్యం కాదుగదా?"

"మీతోనా? వాళ్ళు నిక్షేపంలా చదువుతోంటే మధ్య నాహాస్యం ఏమిటీ? ఒకమాట. 'శంకరం చదువు చెప్పే మాష్టారు' అని వాళ్ళ కెప్పుడూ అనిపించకూడదు - 'మాష్టారిదగ్గిర కెళ్ళి చదువుకోండి,' అని మీ రెప్పుడూ అనకండి. వాళ్ళకి నేనంటే చాలా యిష్టం;




నన్ను నమ్ముతున్నారు కూడాను. రేపట్నుంచీ ఎంతబాగా చదువుతారో చూడండి."

శ్యామల కెంతో సంతోషం కల్గింది.

"నిజంగా వాళ్ళిద్దరూ మంచి మంచి మార్కులు తెచ్చుకొంటూ– ప్రతీ సంవత్సరం పరీక్షలు పాసౌతూ – తెలివిగా చదువుతోంటే నాన్నగా రెంత సంతోషిస్తారో చెప్పలేం."

శంకరాని కెంతో తృప్తి కలిగింది. తను ఆమాత్రం సహాయ పడగలిగితే అదే పదివేలు!

* * *

రిజల్ట్సు వచ్చాయి.

అనుకున్నట్టే శంకరానికి క్లాసు వచ్చింది. అనుకోనివిధంగా రమేష్ కూడా బి. ఏ. పాసయాడు.

వెంకట్రామయ్య హృదయం పసిపిల్లాడిలా గంతులేసింది.

రమేష్ ఎమ్. ఏ. లో జాయిన్ అయ్యాడు.

శంకరం బి. ఏ. ప్రారంభించాడు. స్కాలర్‌షిప్‌కి అప్లై చేశాడు.

చీకూ చింతా లేకుండా చదువుకోవటమే ధ్యేయంగా గడిచిపోతున్నాయి రోజులు.

కష్టాల ఒత్తిడీ – సుఖాల ప్రాబల్యం రెండూ అనుభవించక తప్పదు మనిషి. ఆ కష్టాలు దైవికంగా సంభవించినవిగాక ఎవరో కల్పించినవి అయితే ఆ అనుభవం మరీ బాధాపూరితంగా వుంటుంది.

అలాగే సుఖాలకుకూడా సాటి మనుష్యుల సహృదయాలే కారణం అయినప్పుడు ఆ అనుభవం రెట్టింపు సుఖాన్నిస్తుంది.

శంకరం గుండెల్లో రెండు అనుభవాలూ సరిసమానంగా చోటు చేసుకున్నాయి.



మరో ఏడాది తిరిగివచ్చేసరికి శంకరం శారీరకంగా చాలా మారాడు. ఎత్తు పెరిగాడు, పుష్టిగా బలంగా అయ్యాడు. నల్లటి అవయవాల్లోకి మగసిరి వచ్చింది. మొహంలో నిండుతనం కూడింది కళ్ళల్లో కాంతీ, చురుకూ పుట్టాయి.

శంకరం చాలా అందంగా దర్జాగా—పెద్దింటిబిడ్డలా వున్నాడు.

శ్యామలకూడా చాలా మారింది. సహజంగా ఆ వయస్సులో ఆడపిల్లకి వుండే పసితనం శ్యామలలో ఏ కదలికలోనూ కన్పించదు. ఏ మాటలోనూ ధ్వనించదు. పెళ్ళిగానిపిల్లే అయినా ఇంటి యిల్లాలి కుండాల్సినంత హోదా వుంది.

ఆ భవనానికి సర్వాధికారిణిలాగా అందరి మంచిచెడ్డలూ తెలుసుకుంటూ, ఇంటి అవసరాలు చూసుకుంటూ, పని మనుషులతో స్వతంత్రంగా పనులు చేయించుకొంటూ – చిరునవ్వుతో మాట్లాడుతూ తిరుగుతూ వుంటుంది.

శ్యామలంటే – శంకరానికి గతాన్ని మించిన గౌరవభావం ఏర్పడసాగింది రోజురోజుకీ. స్నానానికీ, భోజనానికీ మాత్రమే శంకరం యింట్లోకి వెళ్తాడు. లేనప్పుడు తనగదీ—విశ్రాంతిగా కూర్చోవాలంటే పోర్టికో – సాయంత్రం వేళ తోటలో కూర్చుంటాడు అప్పుడప్పుడూ.

ఎప్పుడైనా శ్యామల వీధివేపుకు వచ్చినప్పుడు శంకరం గదికేసి చూస్తుంది. సామాన్యంగా గదిగుమ్మంలోనే నిలబడి కాస్సేపు మాట్లాడుతుంది.

(సశేషం)




"నీ మేనల్లుడు చచ్చిపోయాడనుకున్నావా, మావయ్యా? ఎందుకలా కుమిలిపోతున్నావ్?... రత్నం లాంటి పిల్ల! దానికేం?... నే నున్నాను, భయపడకు! చిత్తశుద్ధితో చెబుతున్నాను; నిశ్చింతగా వుండు. ఈ విషయంలో నువ్వు ఏ యితర శంకా పెట్టుకోకు.

ఇట్లు,
రవి."

చెమ్మగిల్లిన రాజశేఖరంగారికళ్ళల్లో ఓ చిన్న మెరుపు మెరిసింది.

పేలవంగా వున్న పెదవులమీద ఓ పీరెండలాంటి బుల్లినవ్వు వెలిసింది.

పైమీదున్న కండువాతో ఓసారి కళ్ళొత్తుకున్నారు.

మనోవేదనతో కుళ్ళిపోతూన్న ఆయనకు మేనల్లుడి వుత్తరం ఒహతరహా ఉపశమనాన్నీ, ధైర్యాన్నీ కలిగించింది.

* * *

క్షణక్షణానికీ, అణువణువునా మధువును నింపుకునే మొదటిరాత్రి!

మరుపురాని మధురానుభూతులతో మైమరపించి, ఒకరిపై యింకొకరికి మమతలూ, ఒకరికోసం యింకొకరిలో మమకారాలూ అంకురింపచేసే అనన్యమైన తొలిరాత్రి!

ఆజన్మాంతం లతలల్లే పరస్పరం పెనవేసుకుపోయే, వుండిపోవాలనే అనంతమైన ఆకాంక్ష నిండిన కళ్ళతో మూగశపథాలు చేసుకునే మధురమైన ప్రప్రథమరేయి!

'పేర్లు చెప్పండి!... గా...డి...ద... గు...డ్డు చెప్పండి!...పదిగంట లవ్వొస్తున్నా యీ ఘటాలు యింకా కదలవు యిక్కణ్నుంచి.'

'ఊఁ!...పేర్లు చెప్పం' డని కొరుక్కుతింటూ, పందిరిపట్టిమంచం చుట్టూ మూగిన పేరంటాళ్ళ మందను చూసి తనలో త నోసారి విసుక్కున్నాడు శ్రీనివాస్.

ఆరునెలలనుంచీ, తిండీ తిప్పలూ మానేసి అదే పనిగా కలలుకంటూన్నాడు ఆ రాత్రికోసం. ఇన్నాళ్ళూ తనలో చెలరేగిన మధురభావనల సంచలనం, తీయనికోర్కెల అలజడీ ఎక్కడో అజ్ఞాతంగా, ఏదో అస్పష్టంగానేవున్నట్లు అనిపించేవి. కాలం ఒక మంచుతెరలా తనకీ వాటికీ అడ్డంగా నించుంది. కాని, యీనాడు ఆ మూడుముళ్ళూ కాస్తా వెయ్యటంతో, ఆ సంచలనం, ఆ అలజడీ అనుభవంలోనికి తర్జుమా కావటానికి దగ్గరపడటంలో, వాటికి ఒహతరహా స్పష్టతా, ఆకృతీ వస్తూన్న ట్లనిపించింది శ్రీనివాస్కి,

"అరుంధతి!" అని చెప్పేసి, వెండి గిన్నెలోంచి వేళ్ళతో యింత గంధం తీసి, మంచమీద తన కభిముఖంగా కూర్చున్న అరుంధతి చుబుకం క్రిందా అటుప్రక్కా, యిటుప్రక్కా పూశాడు.

"శ్రీ...ని...వా...స్... బా...వ... గా...రు!" అరుంధతికూడా యింత గంధం తీసి శ్రీనివాస్ బుగ్గమీద, చెయ్యి వేస్తే ఎక్కడ కందిపోతాడో అన్నట్లు రాసింది.

మంగళహారతు లిచ్చి, మందంతా బయట పడింది. మందలో ఆఖరి శాల్తీ గడపవతల కాలు పెట్టగానే, గర్భాదానం గది తలుపులు దభీమని మూసుకుపోయాయ్. అవతల్నుంచి తలుపుకి గొళ్లెం పెడుతూన్న గాజుల చప్పుడు లోపలికి వినిపించింది.

"హమ్మయ్య!... యిప్పటికి వదిలిందిరా బాబూ పీడ!" ఓసారి దీర్ఘంగా నిట్టూర్చాడు శ్రీనివాస్,

ఇప్పుడు పంజరంలోంచి విడిచిపెట్టిన చిలకలా సర్వస్వతంత్రు డయ్యాడు శ్రీనివాస్।

అరుంధతి అనే విశాల, వినూత్న ప్రపంచంలో ఎక్కడైనా హాయిగా విహరించొచ్చు! ఏ చెట్టుకొమ్మమీద కూర్చుని, ఏ పండు తిన్నా తనను అడిగే వాడు లేడు! అలిసిపోయేదాకా ఆమె యవ్వనప్రాసాదంలో యిష్టంవచ్చినట్లు ఆడుకోవొచ్చు! అలిసిపోతే, లేతతమలపాకులాంటి ఆమె సున్నిత స్పర్శాడోలి కలలో కన్ను మూసి, మేను మరిచి, కమ్మగా నిద్రపోవచ్చు!

అరుంధతి యిప్పుడు అక్షరాలా సర్వదా తన సొత్తు. ఇన్నాళ్ళూ శరీరం మినహాగా, నామమాత్రంగానే తనదిగా వుండేది. కాని, యీ వేళ ఆ మినహా

యింపు కాస్తాకూడా భర్తీ అయిపో యింది. అరుంధతి అందచందాలకూ, అంగపుష్టికీ, అవయవసౌష్టవానికీ తాను సార్వభౌముడు! ఆ ఐశ్వర్యాలను అనుభ వించటమే తనవొంతు! తనహక్కు..!! తనవిధి!!!

పసిడికాంతు లీనుతూ మిలమిల మెరిసే ఆమె బంగరు దేహాన్ని తన కౌగలిలో నలిపి పారేస్తాడు! ఆమె పరువాన్నంతనూ ఒక పండుగా పిసికి ఆ అనుభూతుల్ని రసంగా జుర్రుకుం టాడు.

శ్రీనివాస్‌లో...

అంతులేని ఏదో ఆరాటం!

అర్థంకాని అదో తమకం!!

తియ్యని అది!

కమ్మని యిది!!

అదీ, యిదీ ఏవిటి!?... ఏవి టేవిటో!... ఎన్నెన్నో!!... ఎప్పుడూ ఎరుగనివి!!!... ఏన్నడూ తెలియనివి!!

తెల్లారిపోయింది.

ఎప్పుడు తెల్లారిపోయిందో!?

ఎంత సేపై తెల్లారిపోయిందో!?

గదిపైన వెంటిలేటర్లోంచి కొంప మునిగిపోతూన్నట్లు తెల్లనివెలుగు!

గదిబయట పళ్ళాలూ, గిన్నెలూ చప్పుడు.

బంధుజనం చేసే గలభా.

పిల్లలు చేసే అల్లరి!

టేబిల్‌మీది రిస్టువాచీలోనిచిన్నముల్లు లేచికూర్చుని, తొమ్మిదంకెను తన్ని పెట్టి, పన్నెండుమీద తలపెట్టి ఒళ్ళు విరుచుకుంటోంది!

తెల్లారటం అంటే ఏదో మించిపోయి నట్లు యిట్టే తెల్లారిపోయింది. కాని ఎంతకీ చీకటి పడదు!

పడయింది.

పదకొం డయింది.

పన్నెడు... ఒంటిగంట... రెండు... అబ్బ!... యింకా పది గంటలు గడవాలి! అంటే ఆరువందల నిముషాలు! ముప్పై ఆరువేల సెక నులు!!

ఒక్కసారి గుండె బాదుకున్నాడు శ్రీనివాస్.

కళ్ళెంలేని గుర్రంలా అతన్లో వూహలు వురకలు వేస్తున్నాయ్.

కాళ్ళు విరిగిపోయిన కాలం చట్టల మీద దేకుతోంది?

అల్లంతదూరంలో నల్లచీరె!

నల్లచీరలో నిశాకాంత!!

కాళ్ళకు బుద్ధిచెప్పింది వెలుగు!

చుట్టూ అంతా ఒకటే తమం!!

శ్రీనివాస్‌లో తమి తీరని తమకం!

తమకం తీరని తమి!!

గడియారంలోని చిన్నముల్లును తొమ్మిద్దగ్గర పెద్దముల్లు మింగేసింది!

తొమ్మిదికి పావుతక్కువ.

గదిలో పందిరిపట్టిమంచం.

చీమలపుట్టలా చుట్టూ పేరంటాళ్ళు!

'మళ్ళీ పేర్లు చెప్పండి! ... గా ... డి...ద...గు...డ్డు చెప్పండి!'

"అబ్బ!...చప్పున కానిద్దు రొదినా! కునుకుపా ట్లొస్తున్నాయ్."

వదినగారిమీద శ్రీనివాస్ విసురు.

"అప్పుడే కునుకుపా ట్లొస్తే ఎట్లా అబ్బాయ్? ... ఫరవాలేదు, యింకా పన్నెండుగంటల కాలం వుంది, ఎక్కి తిక్కీను. కావలిస్తే, రేపు మధ్యాహ్నం ఒంటిగంటకు లేవండి! మిమ్మల్నెవరూ అడగరు. కాని, మీ వినోదాలకు ముందు మా వేడుకలు జరిగితీరాల్సిందే! గంధం రాసి, పేర్లు చెప్పాల్సిందే!"

వొదినగారి వేళాకోళానికి మరిది మందహాసం!

ముసిముసి నవ్వులు నవ్వుతూ మొహం ప్రక్కకు తిప్పేసుకుని, కొత్త తోటి కోడలి తులుకు!!

పవిటకొంగులు నోటి కడ్డం పెట్టుకుని యువపేరంటాళ్ళ పళ్ళికిలింతలు!!!

"నువ్వూ చెప్పెయ్యమ్మా చప్పున అరుంధతీ! ... మీ ఆయనకు అప్పుడే కునుకుపా ట్లొస్తున్నాయట, పాపం!" ఎవరి చేతనో మురిపించుకుంటోంది అరుంధతి.

"శ్రీ...ని...వా...స్ బా...వ... గా...రు!" గంధం గిన్నెలో మునక వేసిన గాజులచేతి వేళ్ళు శ్రీనివాస్ మొహంవైపు ఓసారి రాకెట్లా దూసుకు పోయి, చెంపలమండలాన్ని ఇలా తాకి అలా తిరిగి వచ్చేశాయ్.

వెండి పళ్ళెరంలో కర్పూరదీపం వెలిగింది!

మంగళహారతి యుగళగీతంలా పలికింది!!

గది తలుపులు ఆవల్నుంచి భళ్ళు మన్నాయ్.

మళ్ళీ తెల్లారింది. కాని, "భళ్ళున" కాదు. మొదటి రాత్రిలా, ఈసారి ఆ తెల్లారటంలో ఆ 'శబ్దం' శూన్యం! ఆ వేగం మృగ్యం!! తీసుకు తీసుకు తెల్లారింది. చచ్చిచెడి, విధిలేక తెల్లారింది.

"మొహం కడుక్కుందుకి బ్రష్షూ, పేష్టూ తెమ్మన్నారా?"

బెడ్రూమ్‌లోనే యీజీ చెయిర్లో, తలమీద చేతులు పెట్టుకుని, కళ్ళు మూసుక్కూర్చున్న శ్రీనివాస్‌ను సమీపించి, సౌమ్యంగా వినమ్రంగా, శ్రావ్యస్వరంతో తియ్యగా అడిగింది అరుంధతి.

"నువ్వేఁవీఁ అందివ్వ నక్కర్లేదు!" తపస్సు చేస్తూన్న మునిలా కనువిప్పి చూడలేదు, మొహం ఎత్తి చూపలేదు. ఎలా కూర్చున్నవా డలాగే కూర్చుని, చీదరించుకున్నాడు శ్రీనివాస్.

ఒక్కసారిగా అదిరిపడింది అరుంధతి.

'ఎందుకంత చీదరించుకుంటు న్నారు?...నే నేం తప్పుచేశా నని? ... పోనీ, ఒకవేళ తెలిసో, తెలీకో ఏదైనా చేస్తే-నువ్వు ఫలానా తప్పుచేశావ్-